# SILAKAMMA

( a collection of Short Stories )

by

## Dr. VASA PRABHAVATHI




**First Edition** January, 2003

**Title Painting** John Fernondez **Cover Design** Sharat Siddoju **Illustrations** Indrajit

**For Copies**

**J. Meenakshi,** Vasa Nilayam, Municipal Colony, Malakpet, Hyderabad - 500 036.

Ph. (040) 24549178

**Price: Rs. 75 /-**

Laser Type setting, Designed, Composed & Printed by

**JAYANTHI PUBLICATIONS**

19 - 90, P & T Colony, Dilsukh Nagar, Hyderabad - 500 060.

**Ph. (040) 24042446**

# అంకితం



రాజకీయ ధాత్రీ వనాన

పరిమళించే నవ్య పారిజాతం...

ప్రజా ప్రతినిధుల కొలువులో

మంచితనం, మానవత్వం కలబోసిన ఆణిముత్యం...

తూర్పు గోదావరి జిల్లాకే వన్నె తెచ్చిన మేటి నాయకా తేజం...

ఆంధ్రప్రదేశ్ ఆర్థిక శాఖామాత్యులు

**శ్రీ యనమల రామకృష్ణుడు** గారికి

కళాభినందనలతో...

ఈ కావ్యాన్ని సమర్పిస్తున్నాను.

\- రచయిత్రి

ముందుమాట

# ఇనగంటి వెంకట్రావు

ఛైర్మన్, ఆంధ్రప్రదేశ్ ప్రెస్ అకాడమి

హైదరాబాదు.
6-12-2002

**వా**సా ప్రభావతి గారు చేయి తిరిగిన రచయిత్రి. రచన ఆమెకు ప్రధాన వ్యాపకం. ఆమె రచనకు దశాబ్దాల చరిత్ర ఉన్నది. దశాబ్దాల తరబడి రచనలు సాగించగలగడం, ఒక ప్రమాణాన్ని పాటించగలగడం సులువైన పని కాదు. అందులోనూ, రచన ఒక జీవితానికీ, ఒక సమాజానికీ ప్రతిబింబంగా భావించి, పదికాలాల పాటు నిలబడేలా కథా రచన నిరంతరం సాగించగలగడం నిజంగా యజ్ఞంతో సమానం. డాక్టర్ వాసా ప్రభావతి గారు ఆ కథా యజ్ఞాన్ని నిరంతరంగా, నిబద్ధతతో కొనసాగిస్తున్నారు.

ప్రభావతి గారి కథలలో ప్రస్ఫుటంగా కనిపించేదీ, హృదయానికి హత్తుకునేలా సాగేదీ పల్లె జీవన చిత్రణ. నాకూ ప్రధానంగా ఆమె కథలలో నచ్చేది ఇదే అంశం. పల్లె సౌరభం ఆమె కథలలో గుబాళిస్తుంటుంది. గ్రామీణ సమాజంలో ఎక్కడెక్కడో మారుమూలన, మరుగున పడివున్న వర్గాలు, ఆ వర్గాలకు చెందిన స్త్రీల జీవనం, మారుతున్న కాలంలో సైతం వారు తాము పుట్టి పెరిగిన పల్లెపట్టుల నిరక్షరాస్య పరిసరాలలోనే నిలబడి, ఒకనాటి సామాజిక కట్టుబాట్లకు, ఆర్థిక బంధాలకు, కుటుంబ అనుబంధాలకు లోబడి, ఒక్కోసారి తిరగబడి జీవన పోరాటం సాగించే తీరు, కుటుంబాలను నడుపుకునే తీరు, చక్కదిద్దుకునే తీరు అనుపమానం. అది అత్తాకోడళ్ళు కాని, పెనిమిటి పెళ్ళాలు కాని- ఆయా పాత్రల చిత్రణ ఎంతో సహజంగా, ఎంతో ఆర్ద్రతతో నిండి వుంటాయి. ఆధునిక వ్యాపార సమాజానికి భిన్నంగా ఇవి ఉంటాయి. ప్రభావతి గారు ఇలాంటి పాత్రలతో కథ నడిపించే తీరు ప్రశంసనీయం. అందుకే కథా నేపథ్యం పాఠకులలో పలువురికి కొత్త అనిపించినా, తుదకంటా కథ చదవకుండా విడిచిపెట్టలేరు. చదివిన తర్వాత ఒక్క నిమిషం అయినా- అలా ఒక ఆలోచనా వలయంలో నిలబడి ఆ కథ గురించి నెమరు వేసుకోకుండా వుండలేరు.

ప్రభావతి గారి తాజా కథల సంపుటి 'సిలకమ్మ'లో సైతం ఈ కోవకు చెందిన కథలు అధికం. వీటిలో కొన్ని నేను ఇదివరకే చదివాను. మెచ్చుకున్నాను కూడా. 'గెద్ద' చదివినా, 'సిలకమ్మ' కథ చదివినా, 'చుక్క' కథ చదివినా మనకు తెలుగు పల్లెల నేపథ్యం కళ్ళకు కట్టినట్లు కనిపించటం తథ్యం. ఒక స్త్రీ- ఒక నిరుపేద గ్రామీణ కుటుంబంలో ఓర్పుతో నిర్వహించే గురుతర పాత్ర- ఒక ఆదర్శ ఆధునిక మహిళ నేర్పుతో నిర్వహిస్తున్న పాత్రకు ఏమాత్రం తీసిపోదు. నేపథ్యం వేరయినా, పరిసరాలు, పద్ధతులు వేరయినా- వారిరువురి అంతిమలక్ష్యం ఒక్కటే... కుటుంబ క్షేమం, సమాజ సామరస్యం. 'సిలకమ్మ' కథా సంపుటిలో పట్టణ మధ్యతరగతి కుటుంబాలకి చెందిన కథలు కూడా ఉన్నాయి. వాటిలో సైతం అవకాశం దొరికినపుడల్లా రచయిత్రి కలం- పల్లె వైపే పరుగెత్తడం కద్దు! అది ఆమె కథలలోని విశిష్టత, విలక్షణత.

ప్రభావతి గారి కథలలో నాకు బాగా నచ్చే మరో అంశం- ఆశావాదం- సానుకూల ధోరణి! వస్తు నిర్ణయంలో కాని, పాత్రల చిత్రణలో కాని, కథనంలో కాని, ముగింపులో కాని ఒక ఆశావహమైన వాతావరణం ప్రస్ఫుటంగా కనిపిస్తుంటుంది. అందుకే అవి ఆలోచింపజేస్తూనే హాయిగా అందరినీ చదివించగలుగుతున్నాయి. పది కాలాల పాటు విలువైన కథలుగా నిలబడ గలుగుతున్నాయి. ప్రభావతిగారి రచనాయానంలో 'సిలకమ్మ' కథల సంపుటి మరో మైలురాయి. ప్రసిద్ధ రచయిత్రిగా ఆమె ఇప్పటికే చేరుకున్న స్థాయికి ధీటుగానే ఉన్నాయి... 'సిలకమ్మ' కథలు. కథాప్రియులకు, ముఖ్యంగా మనం మరచిపోతున్న మన పల్లెపట్టుల ప్రజల గాథలు తెలుసుకోవాలనుకునే వారికి ఇవి ఎంతయినా నచ్చుతాయని నా నమ్మిక.

- ఇనగంటి వెంకట్రావు

# ఇందులో...


మట్టి చేతులు ... 11

గెద్ద ... 25

రహస్యం ... 35

సింకమ్మ ... 41

మిసెస్ రామనాథం ... 51

చుక్క ... 59

కాలం వెంట మనిషి ... 69

ఊరగాయ జాడీ ... 77

మమకారంలో మచ్చలు ... 87

నాకూ ఓ మనసుంది ... 96

సంధ్యలో విరిసిన చెంగల్వ ... 102

వాసకారు కోయిల ... 111

మానవత్వం పరిమళించిన వేళ ... 119

ఆకాశానికో మెట్టు ... 127

అంతమ్మ శపథం ... 136

# నా మాట

**క**విత్వం నా ఊపిరి. అనుక్షణం నన్ను వెంటాడుతుంది. నా మనసులో తానై నిలుస్తుంది. ఈ ప్రకృతిలోని ప్రతి వస్తువు, సంఘటన, సన్నివేశం నన్ను కుదుపుతుంది. నాలో కొత్త ఊహలకు రేకలు విప్పుతుంది. కొత్త ఉత్సాహాన్ని దోసిళ్ళతో అందిస్తుంది. ఇటీవల 'కథ' కూడా నా ఊపిరిలో ఊపిరిగా నిలిచింది. నేను పెరిగిన ఆ పల్లె వాతావరణం, ఈ పట్నవాసపు జీవితం, మనుషులు, వారి సంభాషణలు, జీవిత విధానం, కష్టసుఖాలు నా కళ్ళ ముందు కథలుగా తిరుగుతున్నాయి. ఆ ప్రతిబింబాలే ఈ సంపుటిలోని కథలు.

ఈ కథలను స్వీకరించి ప్రచురించిన వివిధ పత్రికల వారికి నా కృతజ్ఞతలు అందజేస్తున్నాను.

ఈ కథలకు ముందుమాట అందించిన ప్రెస్ అకాడెమీ ఛైర్మన్, 'పత్రిక' సంపాదకులు గౌరవనీయులైన

శ్రీ ఐ. వెంకట్రావుగారికి నా కృతజ్ఞతలు.

ఈ 'సిలకమ్మ' కథా సంపుటిని అందంగా, ఆకర్షణీయంగా ప్రచురించి, సమయానికి అందించిన 'జయంతి పబ్లికేషన్స్' అధినేతలు **శ్రీ యస్వీకృష్ణ, శ్రీమతి కృష్ణజయంతిగార్లకు** నా ధన్యవాదాలు తెలుపుకుంటున్నాను.

... రచయిత్రి

# మట్టి చేతులు



ఎవరిదో పెట్టె జారి కిందపడింది.

ఆ చప్పుడుకి మంగళ ఉలిక్కిపడి కళ్ళు తెరిచింది. అద్దం పక్కకి జరిపి బయటకు తొంగిచూసింది. అంతవరకు లోకాన్ని ఆక్రమించిన చీకటి తొలగిపోతోంది. వెలుగు విచ్చుకుంటోంది. ఆ పరిసరాలకు, ఆమెకు విడదీయలేని అనుబంధం! తను దిగవలసిన ఊరు వచ్చేస్తోంది. తాత, నానమ్మలను చూడాలనే ఆతురత, ఆనందం ఆమెను నిలవనియ్యడం లేదు.

బస్సు ఆగింది.

మంగళ బ్యాగ్ భుజాన వేసుకుంది. పెట్టె చేత్తో పట్టుకుని గబగబా బస్సు దిగింది. ఆమె వెనకే మరో ఇద్దరు బస్సు దిగారు. తన పని పూర్తయినట్టు బస్సు హారన్ మోగించుకుంటూ వెళ్లిపోయింది.

నల్లటి దుప్పటిలో నుంచి నిద్ర లేస్తున్న కాల దేవతలా దూరంగా గ్రామం!

"ఏమ్మా! ఊళ్లోకేనా?" బస్సు దిగినవారిలో ఒకవ్యక్తి ఆప్యాయంగా పలకరించాడు.

"అవునండీ!"

"ఎవరింటికెళ్లాలమ్మా?" మరో వ్యక్తి అడిగాడు.

"మా తాత నరసింహంగారింటికండీ!"

"అయితే- నువ్వు నరసింహం మనవరాలివా? నాలుగురోజుల్నించి అతను నిద్రపోవడం లేదమ్మా! నిన్నే కలవరిస్తున్నాడు" ఇద్దరు వ్యక్తులూ ఒకేసారి అన్నారు.

ఆమె తాత కోసం ఎదురుచూస్తున్నట్లు ఆమె చూపులే చెబుతున్నాయి.

"అమ్మా! మంగా! మంగా!" దూరం నుంచే తాత పిలుపు వినబడింది.

"ఆc..! నీ మనవరాలు వచ్చేసిందయ్యా! నువ్విప్పుడా రావడం?!" ఒకాయన అడిగాడు.

"పొద్దుటే పొలానికెళ్లానయ్యా! అందుకే కాస్త ఆలస్యమయింది" ఆయనకు సమాధానమిచ్చాడు నరసింహం.

"నీ మనవరాలు దీపంలా ఉందయ్యా!" మరోవ్యక్తి మాటలకి పూలచెట్టులా పెరిగిన మనవరాలివైపు గర్వంగా చూశాడాయన.

ఆ వ్యక్తులిద్దరూ నవ్వుకుంటూ ఊరి వైపు కదిలారు.

"ఏమ్మా! మంగా! ఈ తాత, నానమ్మలను చూడ్డానికి ఇప్పటికైనా వచ్చావమ్మా!"

తాత, నానమ్మలు 'మంగా' అనే పిలుస్తారు. తాత తల్లిపేరు మంగమ్మ. ఆయనకు తల్లి అంటే చాలా ఇష్టం. ఆమె పోయిన రోజుల్లో మనుమరాలు పుట్టిందని ఆమె పేరు పెట్టుకున్నాడు. కోడలు శాంతకు ఆ పేరు నచ్చలేదు. 'మంగళ' అని పెట్టుకుంది.

తాత, నానమ్మలు 'మంగా' అనే పిలుస్తారు.

తల్లి 'మంగళా' అనే పిలుస్తుంది.

తండ్రి 'చిట్టి తల్లీ' అని పిలిచేవాడు. మంగళకు ఎవరు ఎలా పిలిచినా ఇష్టమే! తాత పిలుపు మరింత ఇష్టం. తాత మాటల్లోని ఆత్మీయత ఆమెను కుదిపివేసింది. ఆయన గుండెల మీద వాలిపోయింది.

ఆమె తలను, వీపును చేత్తో నిమిరాడు. చాలాకాలం తరువాత తిరిగి అందుకున్న ఆ ప్రేమ బంధానికి ఆయన కళ్ళు చెమర్చాయి. భుజం మీది కండువాతో కళ్ళొత్తుకున్నాడు.

"అమ్మా! మంగా... ఆ రిక్షాలో వెళ్లి కూర్చో!" అక్కడే ఆగివున్న రిక్షాను చూపించాడు.

" ఆలస్యమవుతుందమ్మా! మీ నాన్నమ్మ ఎదురుచూస్తూ ఉంటుంది. పైగా... బస్సు ప్రయాణం చేసి అలసిపోయి ఉన్నావు. వెళ్లి రిక్షాలో కూర్చో!"

మారు సమాధానం చెప్పకుండా మంగ బ్యాగ్ తీసుకుని వెళ్లి రిక్షాలో కూర్చుంది. తాత ఆమె పక్కనే రిక్షాలో కూర్చున్నాడు.

రిక్షా సాంబయ్య పెట్టె వాళ్ళ కాళ్ల దగ్గర పెట్టాడు. రిక్షా ఊరివైపు రోడ్డు పట్టింది. వేప పుల్లలు నములుకుంటూ కాలవ గట్టు వైపు నడుస్తున్న కొందరు, సైకిళ్ల మీద వెళుతూ ఎదురువస్తున్నారు.

అందరూ రిక్షావైపు మాత్రం పరీక్షగా చూస్తున్నారు. నరసింహంగారి పక్కన ఆ పిల్లను చూడగానే అందరికీ అర్థమైపోయింది. అందుకే అందరూ నవ్వుకుంటూ వెళ్లిపోతున్నారు.

"మనూళ్లో గుఱ్ఱం బండి ఉండాలి కదూ తాతా.., అదేమయింది?"

"ఇంకెక్కడి గుఱ్ఱబ్బండమ్మా! ఆ వరదల్లో గుఱ్ఱం చచ్చిపోయిందమ్మా.., బండి విరిగి ముక్కలయిందమ్మా!"

తాత సమాధానం వినగానే ఆ గాలివాన గుర్తుకొచ్చింది. ఆమె గుండె కలుక్కుమంది. పాత జ్ఞాపకాలు కళ్ళ ముందు నిలిచాయి. రిక్షా కొత్తరోడ్డు మీద వేగంగా వెళుతోంది. ఆమె కళ్ళు ఎందుకో... అటూఇటూ వెతుకుతున్నాయి.

"ఇక్కడే తాతా... చెల్లి బురదలో కూరుకుపోయింది!" ఉన్నట్టుండి మంగ పిచ్చిదానిలా అరిచింది. రెండు చేతులతో ముఖం కప్పుకుని వెక్కివెక్కి ఏడ్చింది.

తాత గుండెల మీద పెద్ద బండరాయి పెట్టినట్టుగా బరువెక్కింది.

"ఊరుకో తల్లీ! ఊరుకో!" ఆమెను ఓదార్చడానికి ఎంతగానో ప్రయత్నించాడు.

రిక్షా సాంబయ్య మనస్సు కూడా వికలమైపోయింది. కాళ్ళు తడబడుతున్నాయి. రిక్షా అనుకున్నంత వేగంగా తొక్కలేకపోతున్నాడు.

'ఇంకా మంగకు ఏ జ్ఞాపకాలు తలపుకు వస్తాయో'...నని తాతని భయపెడుతూనే ఉన్నాయి. అతను భయపడుతున్నంత సంఘటనా జరిగింది.

"తాతా! తాతా! ఇక్కడే నాన్న! తాతా! నాన్న..." ఇంక ఆమెకు మాటలు పెగల్లేదు. ఈసారి గుండెలు బాదుకుని ఏడ్చింది.

సాంబయ్య భార్య కూడా ఆ వరదల్లో చనిపోయింది. ఆ పక్కనే ఆమె శవం దొరికింది. అతనికి దుఃఖం పెల్లుబికి వచ్చింది. తలగుడ్డ తీసి నోట్లో కుక్కుకున్నాడు. ఎడంచేత్తో రిక్షా సైకిలు పట్టుకుని, కుడిచేత్తో చిన్నపిల్లాడిలా కళ్ళు తుడుచుకున్నాడు.

తాత కారే కన్నీళ్లను దాచుకోలేకపోయాడు. ఆమెను ఓదార్చడానికి ఎంతగానో ప్రయత్నించాడు. కానీ... ఓదార్చలేకపోయాడు. సాంబయ్య రిక్షా తొక్కలేకపోయాడు.

కాలం స్తంభించినట్లుగా రిక్షా ఆగిపోయింది. మనసులోని శోకరసం కరిగికరిగి అడుగంటినట్లుగా వారి ఏడుపులు ఆగిపోయాయి. తిరిగి కాలం కదలినట్లయింది.

సాంబయ్య రిక్షా కూడా ముందుకు కదిలింది.

మనవరాలు వస్తుందన్న కంగారులో ఆదిలక్ష్మిగారు ఇంటి పనులన్నీ గబగబా ముగించుకుంది. ఇంటిముందు రిక్షా చప్పుడు కాగానే తలుపులు తెరిచింది. ఒక్కసారి వెలుగంతా లోపలికి వచ్చింది.

ఆ వెలుగు మధ్యలో ఆ యింటి దీపంలా మంగ కనబడింది.

"మంగా! నా తల్లీ... వచ్చేశావా?" ఆవిడ చేతులు చాచి ముందుకువచ్చింది.

"నానమ్మా!" అంటూ మంగ చేతిలోని బాగ్ అక్కడే పడేసి ఆవిడవైపు అడుగు వేసింది.

పద్దెనిమిది సంవత్సరాల మంగ గువ్వపిట్టలా ఆవిడ చేతుల్లో వాలింది, ఆవిడ గుండెల మీద సేద తీర్చుకుంది.

ఇద్దరి గుండెలూ బరువెక్కాయి. ఆనందం, ఆతురత, చాలాకాలానికి చూశామన్న ఆందోళన వారిని ఉక్కిరిబిక్కిరి చేశాయి. మరుక్షణంలో ఇద్దరూ వెక్కివెక్కిఏడుస్తూ అలాగే నిలబడిపోయారు.

"అదేమిటి ఆదిలక్ష్మి.., పెద్దదానివై ఉండి అదేంపని?! పిల్లని లోపలికి తీసుకెళ్లు" ఇరుగుపొరుగు ఆడవాళ్ళ మాటలతో ఈ లోకంలోకి వచ్చింది ఆదిలక్ష్మి. తన కళ్ళు తుడుచుకుంది. గుండెరాయి చేసుకుని మంగ కళ్ళు తుడిచింది.

మనవరాలిని నడిపించుకుటూ లోపలికి తీసుకువెళ్లింది.

అప్పటికి వారితోపాటే తేరుకున్న సాంబయ్య సామాను లోపలపెట్టాడు. నరసింహంగారు పైసలిస్తానన్నా వద్దంటూనే రిక్షా తొక్కుకుంటూ వెళ్లిపోయాడు.

"ఆ పిల్లకి కాస్త కాఫీ యిస్తావా.., లేదా?"

"ఇదిగో... ఇప్పుడే కలుపుతా! కాఫీ డికాషన్ తీసే ఉంచా!" భర్తకు సమాధాన మిచ్చింది ఆదిలక్ష్మిదేవి.

"అమ్మా! మంగా! ముఖం కడుక్కురామ్మా! కాఫీ పట్టుకొస్తా!"

మంగను తొందర చేసింది నానమ్మ.

మంగ బ్యాగ్ తెరచింది. బ్రష్, పేస్టు తీసుకుని పెరట్లోకి వెళ్లింది.

పెరడంతా కొత్తగా కళకళలాడుతూ కనబడింది. నీళ్లు తోడుకోడానికి పంపు పక్కనే నీళ్లతో సిమెంటు గోలేం. రకరకాల పూల మొక్కలు, విచ్చిన కనకాంబరాలు, ఎర్ర గులాబీలు, తెల్లని నంది వర్ధనాలు, ఎర్రని మందారాలు, గన్నేరులు గాలికి అటుఇటు ఊగుతూ ఆత్మీయంగా పలకరిస్తున్నట్లు కనపడ్డాయి.

పళ్లు తోముకుని చల్లని నీళ్లతో ముఖం కడుక్కుంది. ముఖంతోపాటు, మనసు కూడా చల్లబడినట్లయింది.

అప్పుడు గమనించింది మంగ– 'పెరడే కాదు, ఇల్లు కూడా మారిపోయింది. ఇందాక ఊరంతా మారిపోయినట్లనిపించింది. తాతను అడగాలనుకుని మర్చిపోయాను' మంగ తనలోనే అనుకుని లోపలికి వచ్చింది. తాత అందించిన తుండుతో ముఖం తడుచుకుంది.

"ఇదిగో... ముందు ఇడ్డెన్లు తినమ్మా!" ఆదిలక్ష్మి పీటవేసి ముందు ప్లేటు పెట్టింది.

"పొద్దుటే ఇడ్లీ ఎక్కడివి నానమ్మా!"

"ఎక్కడివేమిటీ? మన పిచ్చయ్య కొట్టుకెళ్లి మీ తాత నీకోసం ఇడ్డెన్లు పట్టుకొచ్చాడమ్మా! చల్లారకుండా తిను."

"పిచ్చయ్య కొట్టు ఇంకా ఉందా?" జ్ఞాపకం చేసుకుంటూ తిరిగి అడిగింది మంగ.

"పిచ్చయ్య తెలివైనవాడు. పైగా... చాలా కష్టపడతాడు. ఆ చిన్న కొట్టే ఇప్పుడు పెద్ద హోటలయిందమ్మా! కాని, ఆ కొడుకుల్దిద్దరూ ఒట్టి జులాయి ఎదవలయ్యారమ్మా! తల్లితండ్రులమాట వినరు.., కష్టపడరు. తండ్రి సంపాదన తగలెయ్యడమే వారికి తెలుసమ్మా!"

"ఇదిగో మంగా! నీకు జున్ను ఇష్టమని నిన్ననే వండి ఉంచా!" ఉట్టిమీద గిన్నె తీసి మరో ప్లేట్లో జున్నుపెట్టి మంగ ముందు పెట్టింది.

"జున్నెక్కడిది నానమ్మా?" జున్ను చూడగానే నోరు చప్పరించుకుంటూ అడిగింది మంగ.

"మొన్నరాత్రే మన ఆవు ఈనిందమ్మా! నువ్వు వస్తున్నావని దానికి తెలుసు కదమ్మా!"

మంగ పకపకా నవ్వింది. తాతా, నానమ్మలు కూడా మనవరాలితోపాటు పకపకా నవ్వారు.

ఇడ్లీ తినడం పూర్తి చేసి, మంగ జున్ను ప్లేటు ముందుకు జరుపుకుంది.

"అన్నట్లు... అడగడం మరిచిపోయా తాతా! మన పెంకుటిల్లు ఇలా డాబాలా ఎలా మారిపోయింది? ఏదైనా మ్యాజిక్కా!"

"మ్యాజిక్కు కాదూ, ఏమీ కాదు. అంతా నిజమేనమ్మా. ఆ గాలివానకు మన పెంకుటిల్లు నేలమట్టం అయ్యింది కదమ్మా! తిరిగి ఇల్లు కట్టుకోడానికి అందరికీ తలో రెండు వేలు ఇచ్చారు. బ్యాంకులు ఋణాలు ఇచ్చాయమ్మా. ఇల్లు కట్టుకోడానికి స్వచ్ఛంధ సంస్థలు ఎంతగానో సహాయం చేశాయి. మనమే కాదు, చాలామంది కట్టుకున్నారమ్మా! పేదవారికి పక్కా యిళ్ళు కూడా కట్టించి యిచ్చారు!"

"అందుకేనా ఊరంతా మారిపోయినట్లు అనిపించింది. పెంకుటిల్లు పోతే పోయింది గాని మంచి యిల్లు కట్టావు తాతా! పైకిమెట్లున్నాయా! ఎక్కవచ్చా? చిన్న పిల్లలా అడిగింది మంగ.

"ఎక్కవచ్చమ్మా" తాతా నానమ్మలు ఒకేసారు అన్నారు ఆమె కంటే చిన్నపిల్లలై.

బెల్లంతో మిరియాల పొడి వేసి వండిన జున్ను మంగకు చాలా ఇష్టం.

"ఎంతబాగుందో జున్ను!" లొట్టలు వేసుకుంటూ తింటోంది మంగ.

"మంగా... కొంచెం జున్ను వెయ్యనా! మీ నాన్నకూ్కడా జున్నంటే చాలా యిష్టమమ్మా! అందులోనూ- ఈ బెల్లం జున్ను మరీ యిష్టం!" కొడుకు పేరు తలపుకు రాగానే ఆవిడ కళ్ళు తుడుచుకుంది.

నానమ్మను చూసిన మంగ కళ్ళు తడయ్యాయి. తినడం మానేసి నానమ్మ వైపే చూస్తూ ఉండిపోయింది.

అటుగా వచ్చిన నరసింహంగారు వారిద్దరినీ చూశాడు. ఆవిడ మాటలు కూడా విన్నాడు. వారిద్దరి గుండెలు పాత జ్ఞాపకాలతో తిరిగి బ్రద్దలు కాకూడదనుకున్నాడు.

"అమ్మా! మంగా కాసేపు నడుం వాల్చమ్మా! కబుర్లు తర్వాత చెప్పుకోవచ్చు. అవి ఎక్కడికి పోవు. మీ నోట్లోనే ఉంటాయమ్మా!" అన్నాడు లేని నవ్వు తెచ్చుకుని.

"ఉండమ్మా! కాఫీ పట్టుకొస్తాను" ఆవిడ కాఫీ వెచ్చ చేసి పట్టుకొచ్చింది.

"కాఫీ తాగటానికి మా అమ్మ కప్పులు పంపించింది" మంగ బ్యాగ్‌లోంచి తీసి అరడజను పింగాణీ కప్పులు అక్కడ పెట్టింది.

"ఎంత బాగున్నాయో కప్పులు!" నానమ్మ వాటిని అటుఇటు తిప్పి చూసి ఒక కప్పు కడిగి తెచ్చింది. మంగ అందులో కాఫీ పోసుకుని తాగింది. తాతా, నానమ్మలు తృప్తిగా చూశారు మనవరాలి వైపు.

"అమ్మా! మంగా! కాసేపు గదిలో మంచం మీద నడుం వాల్చమ్మా!"

తాత మాటలకు సమాధానం చెప్పకుండానే పీట మీంచి లేచింది. గదిలోకి వెళ్లి పట్టెమంచం మీద నడుం వాల్చింది.

ఎదురుగా దండ వేసి ఉన్న నాన్న ఫోటో! ఆనాటి జల ప్రళయం మంగ కళ్ళ ముందు నిలిచింది. మంగ మనసంతా వికలమైపోయింది. నాలుగురోజులు ఎడతెరిపి లేకుండా గాలివాన.

ఆ ప్రాంతాల్లో ఎన్నోసార్లు గాలివానలు వచ్చాయి. అమలాపురానికి మూడు మైళ్ల దూరంలో ఉంది ఆ గ్రామం. అటువంటి గాలి ఎప్పుడూ రాలేదు. ఈలలు వేసుకుంటూ భయంకరమైన గాలి! ఇళ్ల కప్పులు ఎగిరిపోతున్నాయి. మరోపక్క ఆకాశం చిల్లుపడినట్లుగా కుండపోతగా వర్షం!

పాత ఇళ్లు, దూడల పాకలు, తాటాకు ఇళ్లు నేలమట్టమయ్యాయి. లోతట్టు ప్రాంతాలన్నీ మునిగిపోయాయి. ఓపక్క గౌతమీ నదికి వరదలు. ఎన్నోచోట్ల గండ్లు పడ్డాయి. ఊళ్లన్నీ నీళ్లలో కొట్టుకుపోతున్నాయి. మరోపక్క సముద్ర కెరటం విరుచుకుపడింది. పల్లపు ప్రాంతాల్లోని జనాన్ని తరలించారు.

"ఊళ్లోకి నీళ్లొచ్చేస్తున్నాయ్ః... బాబోయ్!" అర్ధరాత్రి ఎవరిదో కేక... మృత్యు నినాదంలా వినబడుతోంది.

నరసంహంగారి గుండెల్లో రాయి పడింది. ఎందుకైనా మంచిదని ఆదిలక్ష్మిగారు ఇల్లు సర్దింది. ముఖ్యమైన వస్తువులు రేకుపెట్టెలో సర్దింది. ఖరీదైన బట్టలు మూట కట్టింది. తలుపులు తెరిచేటప్పటికి వరదనీరు ఇంట్లోకి వచ్చేసింది. ఇళ్లూ, వాకిళ్లూ వదలి అందరితోపాటు నరసింహంగారి కుటుంబం కూడా దేవాలయ ప్రాంగణం చేరుకుంది.

ఆ దేవాలయం చాలా ఎత్తులో ఉంది. ఆదిలక్ష్మిగారి పెట్టె చేరింది. కాని, నెత్తి మీద మూట ఆ కటిక చీకట్లో నీళ్లలో కొట్టుకుపోయింది.

నరసింహంగారి కొడుకు ప్రసాదు, చిన్న మనవరాలు ఊర్మిళ అందరిలో కనబడలేదు. మరెక్కడికో వెళ్లివుంటారని అందరూ ధైర్యం చెప్పారు. అయినా... వీరి మనస్సు మనస్సులో లేదు. కన్నీరు మున్నీరుగా ఏడుస్తూనే ఉన్నారు. ఆ ప్రాంగణంలోనే ధర్మదాతలు అందరికీ వండించి భోజనాలు ఏర్పాటుచేసారు.

మూడు రోజులకి వానతోపాటు వరద కూడా తగ్గింది.

అప్పుడు తెలిసింది– నరసింహంగారి సంసారం బ్రద్దలయిందని!

ఆ బురదలో నడుచుకుంటూ అందరూ శోకదేవతల్లా ఇళ్ల వైపు కదిలారు. వారి వెంటే నరసింహంగారి కుటుంబం ఉంది. ఎక్కడ చూసినా కుళ్ళిపోయిన శవాలు, జంతు

కళేబరాలు, ఆ కంపు వాసనలోనే కొడుకు ప్రసాదు శవం, మనవరాలు శవం గుర్తుపట్టారు. గుండెలు బ్రద్దలయ్యేలా ఏడ్చారు.

ఇళ్లూ, వాకిళ్లూ నాశనమయ్యాయి. పంటపొలాలు, పాడిపశువులు మట్టిలో కలిశాయి. ఎలా బతకాలో, ఎందుకు బతికిఉన్నారో ఆ వూరి వారికి తెలియలేదు.

పచ్చని కలశంలాంటి కోనసీమ– ఎండిన మోడులా, బండరాయిలా మారి పోయింది. పునరావాస కార్యక్రమాలు ప్రారంభమయ్యాయి. ఎన్నో స్వచ్ఛంద సంస్థలు ముందుకొచ్చాయి. కేంద్రప్రభుత్వంతోపాటు, రాష్ట్ర ప్రభుత్వం తగిన సదుపాయలు కల్పించడం ప్రారంభించింది.

అమ్మ అక్కడ ఉండలేకపోయింది. మంగను, కొడుకును తీసుకుని చూడ్డానికి వచ్చిన అమ్మమ్మ, మామయ్యలతో ప్రయాణమయింది. కొడుకు పోయిన బెంగతో ఆదిలక్ష్మీ, నరసింహంగార్లు చాపను కరుచుకుని ఉండిపోయారు. కోడలిని వెళ్లవద్దని బతిమాలారు.

“ఎప్పటికీ వరదలు వస్తూనే ఉంటాయి. మిగిలిన నా కూతుర్నీ, ఉన్న ఒక్క కొడుకునూ ఈ కోనసీమకు బలివ్వలేను” కోడలు శాంత సమాధానమిచ్చింది. పుట్టిల్లు నిడదవోలు చేరుకుంది.

భర్త లేని బాధను, కడుపుశోకాన్ని మరిచిపోడానికి ఆసుపత్రిలో నర్సుగా చేరింది. పుట్టింటికి భారం కాకుండా ఆ జీతంలో పిల్లల్ని పోషించుకుంటోంది.

నరసింహంగారు కోడల్నీ, మనవల్నీ రమ్మని ఎన్నోసార్లు ఉత్తరాలు రాశారు. అయినా... శాంత పంపించలేదు. చివరకు ఇప్పటికి మంగను పంపించింది. మంగ కన్నీళ్లతో తలగడా తడిసిపోయింది. ప్రస్తుతంలోకి వచ్చిన మంగ కన్నీళ్లు తుడుచుకుంది.

‘అమ్మ, తమ్ముడు కూడా వస్తే నానమ్మ, తాత ఎంత సంతోషపడేవారో!’

మంగ పదే పదే అనుకుంది. మంగ కళ్ళు బరువెక్కాయి. ఎంతసేపు పడుకుందో తెలియదు... గాఢనిద్రలో మునిగిపోయింది.

“అమ్మా! మంగా! లేమ్మా! భోజనం చేద్దువుగాని! లేమ్మా...” నానమ్మ పిలుపుకి మంగళ కళ్ళు తెరిచింది.

“వేడినీళ్లు కాచి ఉంచా! రెండు చెంబులు నీళ్లు పోసుకుని భోజనం చేద్దువుగాని, రామ్మా!”

“అలాగే నానమ్మా!” ఆవిడ వెంటే నడిచింది మంగ.

మంగ స్నానం చేసి వచ్చేటప్పటికి అరటి ఆకుల్లో భోజనం వడ్డించి ఉంచింది ఆదిలక్ష్మిగారు.

"మీరూ భోజనం చెయ్యలేదా?" మంగ నొచ్చుకుంటూ వెళ్లి ఓ పీట మీద కూర్చుంది. ముగ్గురూ కబుర్లు చెప్పుకుంటూ భోజనాలు ముగించారు.

"అమ్మా! మంగా! ఊరు చూస్తానన్నావు కదమ్మా! వెడదామా!"

"ఇప్పుడే వెడదాం తాతా!" మంగ తాతను తొందరచేసింది.

"ఇప్పుడే కదా... భోజనం చేశావు! కాసేపుండి వెడుదువుగాని!" ఆవిడ మాటలు వినలేదు మంగ. చెప్పులు వేసుకుని తాత వెంట బయలుదేరింది.

మంగ ఊహించినట్లు లేదు ఆ వూరు.

మంగ ఆశ్చర్యంగా చూసింది. ఆనాడు నాశనమయిన చెట్లపక్క పచ్చని చెట్లు పెరిగాయి. కొత్త జాతి కొబ్బరి మొక్కలు నాలుగేళ్లకే కాపుకొచ్చి పచ్చని గుమ్మటాల్లా ఉన్నాయి. పాఠశాల భవనాన్ని ఆసక్తిగా చూసింది మంగ. రేకుల చావిడికి బదులు– సగం కట్టడం పూర్తి చేసిన భవనం!

"మంగా... చూశావా? ఈ బడిలో 5వ తరగతి వరకు ఉంది. అన్ని తరగతులకు పంతులు ఒక్కడే! చదువుకున్న వారంతా ఊరు వదలి వెళ్లిపోతున్నారు. ఇంకా బాగా చదువుకున్నవారు దేశం వదిలే వెళ్లిపోతున్నారు. ఈ బడిలో పాఠాలు చెప్పడానికి ఎవరు వస్తారమ్మా!"

తాత మాటలు అంతగా పట్టించుకోని మంగ, "అలాగా!" అది.

"చూశావా అమ్మా! ఆ పిల్లలు కోతిమూకల్లా ఎలా అల్లరి చేస్తున్నారో! మరో పంతులు ఉంటే ఎంత బాగుండునమ్మా! ఈ వూరు బాగుపడుతుంది. ఈ పిల్లలు బాగుపడతారు!" తాత మాటల్లోని అంతరార్థం మంగళకు తెలీలేదు. కాని, అమాయకపు గృహిణిలా కనపడే గ్రామం చురుకైన యువతిలా కనపడింది.

"ఇక వెడదామా తాతా!" మంగ ఇంటివైపు అడుగులేసింది. ఆమె వెంట తాత అడుగులేశాడు. ఏదో తెలియని ఆనందం ఆమె మనసులో తళుక్కుమంది.

'ఆ బడిలో మనుమరాలు పంతులమ్మ అయితే ఎంత బాగుండును!'

నరసింహంగారి మనసులో కొత్త ఆశలు మొలకలెత్తాయి. కొత్త ఆలోచనలు ఊసులెత్తాయి. మంగ ఇల్లు చేరింది. అప్పటికే మంగని చూడ్డానికి వచ్చిన ఆడవాళ్ళు కూర్చొని ఉన్నారు.

మంగని వారి మధ్యలో కూర్చోపెట్టింది ఆదిలక్ష్మిదేవి. వారు అడిగిన ప్రశ్నలన్నిటికీ ఓర్పుగా సమాధానమిచ్చింది మంగ.

"మంగ బుద్ధిమంతురాలు!" అన్నారు.

"ఇంత చక్కటి మనుమరాలు మీకుంది. ఎంతైనా మీరు అదృష్టవంతులు!" అన్నారు మరికొందరు.

"మీ కోడలు, మనవడు కూడా వస్తే ఇల్లు కళకళ్లాడేది కదమ్మా!" అన్నారు మరికొందరు. చీకటి పడుతూంటే అందరూ లేచి ఇళ్లకు వెళ్లారు.

'ఇక్కడి వాళ్ళందరూ ఎంత మంచివాళ్ళో! నిడదవోల్లో ఇలా ఉండరు' అనుకుంది మంగ.

ఆరాత్రి ముగ్గురూ కలిసే భోజనాలకు కూర్చున్నారు. మనుమరాలికి కొసరి కొసరి వడ్డించింది నానమ్మ.

"గడ్డ పెరుగు ఎంత రుచిగా ఉందో నానమ్మా!"

ఆ మనువరాలి మాటలకి ఆవిడ మరింత పెరుగు వడ్డించింది.

"చాలు... నాన్నమ్మా! చాలు!" మంగ అరుపుకి తాత, నానమ్మలు పకపకా నవ్వుకున్నారు. ఆ పూట ఆ ముసలి దంపతులు రెండుముద్దలు ఎక్కువే తిన్నారు. ఆదిలక్ష్మిగారు వంటిల్లు సర్దుతోంది.

"తాతా! నేను రేపు వెళ్లిపోతాను!" అంది మంగ.

"అదేమిటమ్మా?!" నరసింహంగారు ఆశ్చర్యంగా అడిగారు.

ఆదిలక్ష్మిగారు చేతిలో పని ఆపేసి బొమ్మలా నిలబడిపోయింది.

"మిమ్మల్ని చూశాను. ఊరు చూశాను. అమ్మ వెంటనే వచ్చేయమంది తాతా!"

"అలాగే వెళుదువు గాని! ఇక్కడ నాలుగు రోజులు మాతో ఉండి వెళ్లమ్మా!"

– మనుమరాలిని బతిమాలుతున్నట్లుగా అన్నాడు తాత.

అప్పటికి ఆదిలక్ష్మిగారిలో చలనం వచ్చింది.

"రాకరాక వచ్చావు కదమ్మా! తొందరపడితే ఎలా? మేమే వచ్చి నిన్ను దిగపెడతాం! మీ అమ్మనీ, తమ్ముణ్ణి కూడా చూసినట్లవుతుంది" అంది ఆదిలక్ష్మీదేవి.

ఆ మాటలు మంగకు నచ్చాయి. "సరే!" అని తలాడించింది.

ఆరాత్రి మంగ నానమ్మ పక్కలో పడుకుంది. మనుమరాలి మీద చేయివేసి ఆవిడ ఏదో చెబుతూనే ఉంది. ఊరంతా నడవడంవల్ల మంగకు కాస్త కాళ్లు నొప్పులనిపించాయి. అలనటవల్ల తెలీకుండానే నిద్రలోకి జారిపోయింది.

మరునాడు మంగ లేచేటప్పటికి కాస్త పొద్దెక్కింది. మంగ స్నానం చేసి బట్టలు వేసుకుంది. తాత హోటల్ నుంచి పట్టుకొచ్చిన పెసరట్లు తింది.

"పెసరట్లు బాగున్నాయి తాతా!" అంది.

"అవి మనూరు పెసరట్లు తల్లీ!" అన్నాడు తాత.

"నరసింహంగారూ!" అంటూ బడిపంతులు శ్రీనివాస్ లోపలకి వచ్చాడు.

"రావయ్యా! పంతులూ... రావయ్యా! ఇలా కూర్చో!" అంటూ కుర్చీ చూపించాడు నరసింహంగారు.

"నమస్కారమండీ!" మంగ వైపు తిరిగి నమస్కరించాడు పంతులు.

"నమస్కారమండీ!" లేచి నిలబడి ప్రతినమస్కారం చేసింది మంగ.

'ఎంతైనా... నిడదవోల్లో పెరిగింది కదా- సంస్కారవంతురాలు!' అనుకున్నాడు మనసులో పంతులు.

వాళ్ళిద్దరినీ చెరో కుర్చీలోనూ కూర్చోపెట్టి నరసింహంగారు పట్టెమంచం వాల్చి కూర్చున్నారు.

"ఇతను మన మునసబుగారి అబ్బాయి శ్రీనివాస్! హైదరాబాద్‌లో ఎమ్.ఎ., బి.ఎడ్. చేసి వచ్చాడు. ఈ బడిలో పంతులుగా చేస్తున్నాడమ్మా!" ఆయన పరిచయం చేశాడు.

అతని వైపు ఆశ్చర్యంగా చూసింది మంగ.

"నేను ఈ చిన్నబడిలో పాఠాలు చెప్పే పంతుల్ని! సాయంకాలం వయోజనులకు విద్య నేర్పుతానండి. అంతేకాదు, అభంశుభం తెలియనివారు ఈ గ్రామ ప్రజలు. వారికి బ్యాంకులో, పోస్టాఫీసులో డబ్బులు దాచుకోవడం, తీసుకోవడం, అవసరమైతే ఋణాలు తీసుకోవడం తెలియచెబుతానండీ! మనం చదుకున్నవాళ్ళం. ఈ దేశం మనకేమి చెస్తుందని కాదు- ఈ దేశానికి మనమేం చేస్తున్నాం.., ఏం చేయగలమని ఆలోచించాలండీ! మిమ్మల్ని విసుగిస్తున్నానుకోకండి... మీరు ఒక్క నాలుగురోజులు ఈ గ్రామాన్ని పావనం చేయండి. ఆ నాలుగురోజులు మా బడికి కూడా వచ్చి మా పిల్లలకి నాలుగు కొత్త విషయాలు చెబుతారని ఆశిస్తున్నానండీ!" అన్నాడు శ్రీనివాస్.

అతని మాటల్లోని నిజాయితీకి, అతని ఆశయాలకు మనసులోనే నమస్కరించింది మంగ.

"తప్పకుండా మీ బడికి వస్తానండీ!" సమధానమిచ్చింది.

"బడి గంట కొట్టే సమయమయింది. నేను వెడతానండీ!" పంతులు లేచి నిలబడ్డాడు.

"తాతా! నేను కూడా బడికి వెళతాను" మంగ కూడా కుర్చీలోంచి లేచింది.

తాత సంతోషంగా తలూపాడు.

మంగ అతని వెంటే బడికి బయలుదేరింది.

అతనితోపాటే తరగతుల్లో తిరుగుతూ పాఠాలు చెబుతుంటే తెలియని ఆనందమేదో ఆమెలో చోటుచేసుకుంది. బడి వదిలే గంట కొట్టారు. బడి గంట త్వరగా కొట్టారనిపించింది మంగకు.

"రండి... మిమ్మల్ని ఇంటి దగ్గర దిగబెట్టి వెళతాను" మంగతోపాటే అడుగులేశాడు శ్రీనివాస్.

ఇంటికి కాకుండా పొలాలవైపు నడిచారు ఇద్దరూ.

ఎన్నో విషయాలు మాట్లాడుకుంటూ ఇద్దరూ అలా నడుస్తూనే ఉన్నారు.

క్రమంగా సంధ్యా సమయమయింది. ఎర్రని సూర్యబింబం పశ్చిమాద్రిలోకి వెళ్లిపోతోంది. పొలాల మీదుగా వచ్చే చల్లగాలి సేద తీరుస్తోంది. ఇద్దరి మనసుల్లో ఏదో తడబాటు... ఏదో కొత్త ఆనందం!

ఆకాశంలో తెల్లని కొంగలు, నల్లని కాకులు బారులుగా చెట్లవైపు అరుచుకుంటూ పోతున్నాయి.

"ఇంక వెళదామండీ!" మంగ మాటకి 'సరే...' అన్నాడు శ్రీనివాస్.

ఆవులను, గేదెలను తోలుకుంటూ పశువులకాపర్లు ఇళ్లకు వస్తున్నారు. ఇళ్ల ముంగిళ్లలో కట్టేసిన ఆవు, గేదె దూడలు– 'అంబా...' అంటూ అరుస్తున్నాయి. అంతలో... మంగ ఇల్లు రానేవచ్చింది.

"లోపలకి రండీ!" అంటున్నా వినిపించుకోలేదు శ్రీనివాస్. వెనుతిరిగాడు.

'ఆ గ్రామానికి ఏదో చెయ్యాలనే తపన'... ఆమెలో మొలకలెత్తింది. నవ్వుకుంటూ ఇంట్లోకి అడుగుపెట్టింది మంగ.

"బడి నీకు నచ్చిందా మంగా!" తాత ప్రశ్నకు– "ఓఁ..." అంటూ సమాధానమిచ్చింది మంగ.

"ఈ వూరు బాగుందా?" అన్న నానమ్మకు–

"చాలా బాగుంది నానమ్మా!" అని సమాధానమిచ్చింది మంగ.

మనవరాలి సమాధానం వారికి వెయ్యేనుగుల బలం ఇచ్చినట్లయింది.

ఆ రాత్రి నానమ్మ పక్కలో పడుకున్న మంగ– ఆలోచిస్తూనే ఉంది.

తన స్వార్థానికి తానే సిగ్గుపడింది.

'ఊళ్లో ఎవరికీ లేని భయం తమకెందుకు? గాలివానలూ, ఈ ప్రాంతాలకు కొత్తేమీ కావు. వారితోపాటే తాము. తాను ఇక్కడే, ఎలాగైనా ఇక్కడే ఉండాలి. 'దేశం

మాకేమిచ్చిందని కాదు.., దేశానికి మనం ఏం చేస్తున్నామని అలోచించాలి' అన్న శ్రీనివాస్ మాటలు చెవుల్లో గింగురుమన్నాయి. నానమ్మ వొడిలో దూరి హాయిగా నిద్రపోయింది మంగ.

పొద్దుటే నరసింహంగారు పొలానికి బయలుదేరారు.

"నేనూ వస్తా" నంటూ మంగ వెంటబడింది.

"అక్కడ పాములుంటాయి, ముళ్లుంటాయి.., నువ్వు వద్దమ్మా!"

తాత ఎంత చెప్పినా వినకుండా మంగ ఆయన వెంట బయలుదేరింది. ఆయనతోపాటే పొలంలో తిరిగింది. అక్కడి పనులన్నీ చూసింది.

'ఆ ముసలితాత ఎన్నాళ్లు ఈ పొలం కోసం కష్టపడతారు? రేపటినుండి పొలానికొచ్చి తాత బాధ్యత స్వీకరించాలి. ఎవరేమనుకున్నా భయం లేదు'... ఒక నిశ్చయానికొచ్చింది మంగ. తిరిగి తాత వెంటే ఇంటికి బయలుదేరి వచ్చింది. నానమ్మ అందించిన కాఫీ తాగింది.

"బడికి వెడతా నానమ్మా!" అంది గారాలు పోతూ!

ఆవిడ "సరే..!" అనగానే మంగ గబగబా తెమిలి బడికి బయలుదేరింది.

పిల్లలు ఎంత అల్లర్లు చేస్తున్నా వారిని సముదాయించిది. కథలు చెప్పింది. పాటలు నేర్పింది. పిల్లలందరికీ ఆమె అంటే ఎంతో ఇష్టం ఏర్పడింది.

శ్రీనివాస్‌కే ఎంతో ఆశ్చర్యం కలిగింది.

'అమె తనకు తోడుగా ఉంటే ఎంత బాగుండును!' అనుకున్నాడు. అతని మనసు వసంతంలో పూదోటలా గుబాళించింది.

ఇంటికి వచ్చిన మంగ నానమ్మను వాటేసుకుంది.

మనవరాలి ముఖంలో సంతోషం చూసి ఆదిలక్ష్మిగారి మనసు కుదుటపడిం

ఆవిడ అందించిన జంతికలు, మినప సున్ని, పూతరేకులు వద్దనకుండా తింది.

"చాలా బాగున్నాయి నానమ్మా!" మనవరాలి మాటలకు ఆవిడ తృప్తిగా చూసి

మంగ నీళ్ల బిందె పట్టుకుని వీధుల్లోకి వెడుతుంటే ఆశ్చర్యంగా చూసి

అంతకంటే ఆశ్చర్యంగా చూశారు ఇరుగుపొరుగు స్త్రీలు.

ఇంటికెదురుగా రోడ్డుపక్క పంచాయితీవారు నాటిన మొక్కకు చు నీళ్లు పోసింది మంగ.

అదేమిటో అర్థంకాకపోయినా— ఇరుగుపొరుగు స్త్రీలు అదే పని చేశారు. ఎవరి ముందు మొక్కలకు వాళ్ళు నీరు పోశారు. నీళ్లు పీల్చిన మొక్కలు పచ్చగా తలలూపా

"అదేమిటమ్మా!" అప్పుడే పొలం నుంచి వచ్చిన తాత ఆశ్చర్యంగా అడిగాడు.

"పంచాయితీవారు మొక్కలు నాటింది మన కోసమే కదూ తాతా! వాళ్ళు కూలీలను పెట్టి నీరు పోయించాలి కదా! ఎవరింటి ముందు మొక్కలకు వాళ్ళే నీళ్లు పోస్తే అవే పెరుగుతాయి కదూ తాతా! మట్టిలో పుట్టి మట్టిలో పెరగడం కాదు తాతా! ఈ మట్టికోసం మనం ఏం చేస్తున్నామో, ఏం చెయ్యాలో ఆలోచించాలి తాతా!"

ఆమె మాటలు ఆశ్చర్యంగా అనిపించాయి.

మట్టి చేతులు చూసుకుంది మంగ. పొలం నుంచి వచ్చి తాత తన మట్టిచేతులు తుడుచుకున్నాడు. పెరట్లో కలుపుమొక్కలు తీసిన ఆదిలక్ష్మిగారు మట్టిచేతుల వైపు చూసుకున్నారు.

"తాతా రేపటి నుండి పొలంపనులు నేనే చూసుకుంటాను. బడిలో పంతులమ్మగా చేరుతా! అమ్మని రమ్మని రాశా!"

నట్టింట్లో దీపంలా నిలబడిన మనవరాలిని ఆ ముసలి దంపతులు ఆప్యాయంగా చూసుకున్నారు.



- 'ఆంధ్రప్రదేశ్' మాస పత్రిక... ఏప్రిల్, 2002

# గెద్ద



గెద్ద తాటిపేళ్ల బుట్ట చంకన పెట్టుకుని బయలుదేరింది.

అది మార్చి నెల. ఉదయం పది గంటలకే ఎండ చురుక్కుమంటోంది.

అడుగు తీసి అడుగు వేయడానికి వయసు మళ్లిన ఆమె ఆయాసపడుతోంది. అయినా... నెమ్మదిగా అలాగే ముందుకు పోతోంది.

ఆ ఊళ్లోనే కాదు.., ఆ చుట్టుపక్కల గ్రామాల్లో కూడా 'సోది' చెప్పిచెప్పి అలసిపోయింది.

అలవాటు పడిన ప్రాణం... పొట్ట కూటి కోసం జీవితాంతం కష్టపడుతూనే ఉండాలి.

ఏ ఇంట్లో ఆడపిల్లలు పెళ్ళీడుకు వచ్చిఉన్నా, ఏ ఆడవారు కడుపుతోటున్నా, ఏ కొత్త కోడలు అత్తింట అడుగుపెట్టినా తెలుసుకుని వారింటి ముందుకు చేరుతుంది. ఆమె కంఠానికి ఏదో శక్తి ఉంది. ఆమె మాటలో చాకచక్యం ఉంది. అందుకే ఆమె ఏది చెప్పినా వారు నమ్ముతారు.

ఆ ముందురోజు సాయంకాలం పెద్ద వీధిలో సూరమ్మ ఎదురుపడింది.

"ఆ పెద్ద అరుగుల వారమ్మాయికి ఈరోజు పెళ్ళివారొచ్చి వెళ్లారు! నీకు తెలీదా?" అనడిగింది.

"నాకు ఎఱుక లేదమ్మా!" అంటూనే గెద్ద ముందుకు అడుగులేసి ఇల్లు చేరింది.

ఆ రాత్రి గెద్దకి కంటికి సరిగా కునుకు రాలేదు.

'ఎప్పుడు తెల్లారుతుందా? ఎప్పుడు వారింటికి వెళ్లి సోది చెపుదామా'...ని ఆతురత పడుతూనే ఉంది.

పెద్ద అరుగుల లోగిలి రాగానే ఆ ఇంటి ముందు ఆగింది.

"సోది చెబుతానమ్మ! సోది చెబుతా!" అంటూ గొంతెత్తి అంది.

మూసి ఉన్న ఆ ఇంటి తలుపులు తెరుచుకున్నాయి.

"అమ్మా! సోది చెప్పే ఆమె వచ్చింది!" పరికిణీ కుచ్చిళ్ళు చేత్తో పట్టుకుని పరుగెత్తుకుంటూ వచ్చిన ఓ అమ్మాయి గట్టిగా అరిచింది.

ఇంటావిడ బయటకు వచ్చింది.

"నువ్వా గెద్దా! రా! రా!" అంటూ లోపలికి పిలిచింది.

గెద్ద ఆయాసపడుతూ మెట్లు ఎక్కి ఆవిడ వెంట పెరటి వసారాలోకి వెళ్లింది. ఆవిడ చెప్పిన చోట చంకలోని బుట్ట కింద పెట్టి కూర్చుంది.

ఆవిడ బియ్యం ఉన్న చేట పట్టుకుని వచ్చింది.

గెద్దకు ఎదురుగా ముక్కాలిపీట లాక్కుని దాని మీద కూర్చుంది. బియ్యం చేట గెద్ద ముందుకు జరిపింది.

"నిన్న అమ్మాయికి పెళ్ళివారొచ్చారు. పిల్లను చూసుకుని ఏమీ చెప్పకుండానే వెళ్లిపోయారు. నువ్వు అన్ని విషయాలు వివరంగా చెప్పు!" అందావిడ.

"అమ్మాయిగోరిని పిలవండమ్మా!"

ఆమె మాట పూర్తి కాకుండానే చంద్రముఖి అక్కడ ప్రత్యక్షమయింది.

తల్లి పక్కగా ఓ తుంగ చాప పరుచుకుని చతికిలపడింది.

గెద్ద ఎడం చేత్తో ఆమె ఎడం చెయ్యి పట్టుకుంది.

కుడిచేత్తో బుట్టలో ఉన్న ఓ చిన్న కర్రపుల్ల తీసింది.

చంద్రముఖి అరచేతిలో దానితో అటు, ఇటు పామింది.

తరువాత ఆ చెయ్యి వదిలి కుడి చెయ్యి పట్టుకుంది. ఆ అరచేతిలో కర్రపుల్లతో తిరిగి అటూ ఇటూ పామింది.

"అమ్మా పలుకు! జగదాంబ పలుకు. కాశీలోని గంగమ్మ పలుకు, ఈ ఊరి మాలచ్చమ్మా పలుకు, ఎల్లమ్మతల్లీ పలుకు! పలుకు పలుకు..! జగదంబా పలుకు పలుకు" అంటూ పదం అందుకుంది.

"ఇదిగో! ఓ అమ్మీ! ఈ సోది ఆపి అసలు సోది చెబుతావా లేదా?" చంద్రముఖి ఆమె చేతిలో నుంచి చెయ్యి లాక్కోబోయింది.

"కోపం వద్దు తల్లీ! సానా కోపం మంచిదికాదు తల్లీ. ఇదిగో సెబుతన్నా! ఉన్నది ఉన్నట్టు సెబుతా! జరిగేది సెబుతా? జరగబోయేది సెబుతా!"

"చెప్పు.... చెప్పు! అసలు సంగతులు చెప్పు! ఎసరు మరిగిపోతూ ఉంటుంది. వెళ్లి బియ్యం పోసి రావాలి!" తొందరచేసింది వెంకట రమణమ్మ.

"పొద్దు పొడిచే దిక్కు నుంచి పెళ్ళోరొచ్చినారు! ఆ వచ్చిన చిన్నోడు ఈ తల్లికి మగడవుతాడు! చిన్నోడు చిన్నమ్మంత సక్కనోడు! పెద్దింటిలో కాలుపెడుతాది, మంచి పేరు తెచ్చుకుంటాది."

"అలాగా! ఎప్పుడు పెళ్ళవుతుందో చెప్పు! చెప్పు!" వెంకట రమణమ్మ మరింత తొందరచేసింది.

"తొంధర పడకమ్మా! ఉన్నది ఉన్నట్లు సెబుతా! కనక దుర్గమ్మ తల్లి ఆన! ఆ మల్లమ్మ తల్లి ఆన! తల్లీ! నెల దాటకుండానె పెల్లవుతాది! ఎన్నెల ఏల మనువాడుతాది! ఆ జగదాంబ తల్లి ఆన!" అంటూ ఆమె చేతిలో కర్రపుల్లతో గట్టిగా పాముతూ నొక్కి చెప్పింది.

చంద్రముఖి బుగ్గలు యాపిల్ పండ్లలా ఎరుపెక్కాయి.

దాచుకోలేని సిగ్గు కళ్లలో చేరి కలవరపెట్టింది.

ఆమె చెయ్యి వెనక్కి లాక్కుంది.

"అమ్మాయిగారిని చూసినారా! ఎలిగిపోతోంది. పొద్దు ముఖంలా ఎలిగిపోతోంది" గెద్ద మాటలకి అందరూ నవ్వుకున్నారు.

చంద్రముఖి లోపలికి పరుగెత్తింది.

అయిదు రూపాయలు, ఓ పాత చీర పట్టుకొచ్చి వెంకటరమణమ్మ చేటలోని బియ్యం మీద పెట్టింది.

"ఇదిగో గెద్దా! అమ్మాయి పెళ్ళికి తప్పకుండా రావాలి! పప్పు అన్నం తిని మరీ వెళ్లాలి! అప్పుడు కొత్త చీర పెడతా! తెలిసిందా!"

"మీ దయమ్మా!"

చేటలో బియ్యం తన బుట్టలో పోసుకుంది.

పాత చీర కూడా బుట్టలో పెట్టుకుని 5 రూపాయల నోటు రవికలో పెట్టుకుంది. కొందరు చేట బియ్యంలో ముందే ఉమ్మి పక్కన పెట్టుకుంటారు.

గెద్ద అటువంటి పనులు చెయ్యదు. అందరితోనూ మర్యాదగా మసలుకుంటుంది. అందరూ ఆమెను అలాగే చూస్తారు.

"అమ్మా! ఓ ముద్ద అన్నముంటే పెట్టమ్మా!"

"చద్దన్నం ఉంది. పట్టుకొస్తానుండు"

వెంకట రమణమ్మ లోపలకి వెళ్లింది.

ఓ అరిటాకులో అన్నం, కూర, కాస్త చింతకాయ పచ్చడి వేసి పట్టుకొచ్చి ఓ వారగా పెట్టింది.

"గెద్దా! తినిపోతావా?" అనడిగింది.

"లేదమ్మా! ఇంటికే పట్టుకెడతానమ్మా!" అరిటాకు నాలుగువైపులా మడిచి గంపలో వారగా పెట్టుకుంది.

"ఇంక ముసలిదానవయ్యావు? నడుం వంగింది. 'సోది చెబుతా' నంటూ ఎన్నాళ్లు తిరుగుతావు? నువ్వు ఇంటి పట్టున ఉండి నీ కోడల్ని పంపించవచ్చు కదా!"

వెంకట రమణమ్మ మాటలకి గెద్ద కళ్ళల్లో నీళ్లు సుళ్ళు తిరిగాయి.

"నీవు చెప్పినాది సత్తెమే కాని! నా కోడలికి మాట లేదాయే! అది సోది చెప్పజాలదు. కానుపు సేయడమే నేర్పినా! ఇప్పుడు ఆ మంత్రసానులంట... ఊరి మీదికొచ్చి మా నోటిలో మట్టి కొడుతున్నారమ్మా! ముగ్గురు తిండికే కరువయ్యేనమ్మా!" ఆమె కంఠం పూడుకుపోయింది.

"మరి, నీ కొడుకేమయ్యాడే? వాడు ఏ పని చెయ్యడా?"

"ఆడెక్కడికి పోతాడమ్మా! మొద్దు రాచిప్పలా ఇంట్లోనే ఉంటాడు. ఆడికి ఏ పనీ చేతకాదమ్మా! ఆడు చేతకానోడు! అందుకే మా బతుకులు ఇట్టయినాయి."

గెద్ద కళ్లొత్తుకుంది.

"నీకు వెండి వడ్డాణం, దండ కడియాలు, చేతి మురుగులు, మెళ్లో కంటెకాసులు అన్నీ ఉండేవి! ఇప్పుడేమయ్యాయే?"

"ఏమవుతాయమ్మా! అన్నీ పులుసులో పడ్డాయి. ఇంకేటి మిగిలేది? ఇవిగో... ఈ సత్తు మురుగులేనమ్మా!"

"గెద్దా! అనవసరంగా బాధపడకు! నీకూ మంచిరోజు లొస్తాయిలే!"

కదలడానికి మొరాయించే శరీరాన్ని బలవంతంగా లాక్కుంటూ ముందుకు అడుగులేసింది గెద్ద. మెల్లిగా ఇల్లు చేరుకుంది.

ఆ ఇల్లు ఓ తాటాకు గుడిసె.

నేల మీద ఓ తాటాకు తోకబుట్ట బోర్లించినట్టు ఉంటుంది.

చుట్టూ తాటాకు దడి- పైన తాటాకు కప్పు, 3 అడుగుల తాటాకు తలుపు. వీధుల్లో దాని పక్కనే అదే ఆకారంలో తాటాకు పాక. దానికి 1 అడుగు తలుపు మాత్రమే ఉండేది.

చంకలో ఉన్న బుట్ట తలుపు గొళ్ళెం తీసి లోపల పెట్టింది. చూరులో దాచిన చుట్ట తీసి సగం చేసింది. తిరిగి గుమ్మం బయటకు వచ్చి మట్టి అరుగుమీద కూర్చుని చుట్ట ముట్టించింది.

ఎండిన దవడలతో పొగ వదులుతుంటే ఆమె మనస్సు ఎటో తేలిపోతోంది.

గెద్ద మొగుడు కొడుకు పుట్టగానే మరో ఆమెతో ఎక్కడికో వెళ్లిపోయాడు. తిరిగి ఆ ఊరు రాలేదు. అందుకే బొట్టు తియ్యలేదు. మెళ్ళో ఇత్తడి పుస్తె అలాగే ఉండిపోయింది. వదిలేసి పోయినా, కట్టుకున్నవాడు గుర్తుకు రాగానే మనస్సు కలుక్కుమంది. చెయ్యి చురుక్కుమనగానే చుట్ట పీక వదిలేసింది.

జగ్గి ఎండు పుల్లలు ఏరుకుని ఇల్లు చేరింది.

"ఆ బుట్టలో అన్నం ఉంది. ఇద్దరం చెరోముద్దా తిందాం. నారిగాడికి ఓ ముద్ద ఉంచు" అంది గెద్ద.

జగ్గి సొట్టలు పోయిన సత్తు పళ్లెంలో అన్నం, కూర వేసి పట్టుకొచ్చింది.

మట్టి ముంతతో నీళ్లు తెచ్చి అక్కడ పెట్టింది.

ఆ కంచంలోనే ఇద్దరూ చెరో రెండు ముద్దలు తిన్నారు. సగం కడుపు కూడా నిండలేదు. ఇద్దరూ గ్లాసుడు నీళ్లు తాగారు.

పొట్టలు కాస్త నిండినట్లయ్యాయి.

చీకటి పడేవేళ నారిగాడు పందులు తోలుకుని కొంపకు చేరుకున్నాడు.

పందులు మొరాయిస్తున్నా బలవంతంగా ఆ చిన్న గుడిసెలోకి తోలి బలవంతంగా తలుపు పెట్టాడు. కాళ్లు, చేతులు కడుక్కుని అరిటాకులో మిగిల్చిన అన్నం ఆవురావురంటూ తిన్నాడు.

ఆరోజు తాను తెచ్చిన బియ్యం, డబ్బులు చూపించింది.

మూడు రోజుల వరకు తిండికి బాధ లేదని ముగ్గురూ మురిసిపోయారు.

"జగ్గీ! ఎల్లి మంచినూన, కొబ్బరినూనె, చింతపండు, ఉప్పగడ్డలు, ఉల్లిపాయలు పట్టుకురాయె!" అంటూ రవికలో దాచిన 5 రూపాయలు తీసి ఇచ్చింది.

"ఈ డబ్బుతో ఇన్నొత్తాయా?" అంది జగ్గి అమాయకంగా!

"అదేటి? ఎందుకు రావే? మా కాలంలో అయితే ఓ బేడకు సీసాడు నూనె, అణాకు చింతపండు, అర్ధణాకు ఉల్లిపాయలు వచ్చేవి తెలుసా?"

"అదే కాలమేటి?" పకపకా నవ్వింది జగ్గి.

"ఏటా ఎర్రినవ్వు?" నారిగాడు విసుక్కున్నా వాడూ పకపకా నవ్వాడు.

"చీకటి పడకుండా ఎల్లిరాయే?"

గెద్ద మాటలకు వెంటనే బయలుదేరింది జగ్గి.

చిన్న సీసాతో మంచినూనె, మరో సీసాతో కిరసనాయిలు, కాస్త చింతపండు, ఉప్పురాళ్లు పట్టుకొచ్చి లోపల పెట్టింది. ఇంట్లో ఉన్న పాత నూకలతో గంజి కాచింది.

ముగ్గురు చెరో కాస్త తాగారు.

ఇంట్లో బుడ్డి దీపం వెలిగించింది. పాత తాటాకు చాప పరుస్తుంటే ఓ పాము పల్లి నేల జారింది. తాటాకు దడిలోంచి జరజర పాకుతూ బయటకు వెళ్లిపోయింది.

విషజీవాలు కూడా వారి బతుకుల్లో భాగాలే. అందుకే వారేమీ కంగారుపడలేదు.

ఆ చింకి చాపమీద మరో చింకి బొంత పరిచింది.

నారిగాడు దానిమీద నడుం వాల్చాడు. గాఢ నిద్రపట్టిందని అతని బరువు ఊపిరే చెబుతోంది.

వీధుల్లో మట్టి అరుగు మీద గెద్ద నడుం వాల్చి కళ్లు మూసింది. జగ్గి వెళ్లి మొగుడు పక్కలో చేరింది.

జగ్గి అప్పుడే కళ్ళు మూసిందో, లేదో... వీధుల్లో " గెద్దా! గెద్దా!" అన్న పిలుపు వినబడింది.

జగ్గి ఉలిక్కిపడి లేచి బయటకు వచ్చింది.

అప్పటికే గెద్ద లేచి కూర్చుని "ఏరూ?" అంది.

"పెద్దబాబుగారి ఇంటికాడ నుంచొచ్చినా! అమ్మాయిగారికి నొప్పు లొత్తున్నాయంట. నిన్ను ఎంట బెట్టుకు రమ్మన్నారు!"

'ఇన్నాల్టికి తిరిగి పని దొరికింది!' గెద్ద గుండె వేగంగా కొట్టుకుంది.

పాలేరు అరికెన లాంతరు చేతపట్టి ముందు నడుస్తున్నాడు. జగ్గి అతని వెంట బయలుదేరింది.

'ఎన్నో పాపాలు చేశాను. ఎందరో అత్తల మాటలు విని కోడళ్ళ కాన్పులు పోగొట్టాను. ఎందరో ఆడవాళ్ళ మాటలు విని మరి కాన్పులు కాకుండా మందులిచ్చి గొడ్రాళ్ళను చేశాను. ఈ పాపపు పని కోడలికి చెప్పలేదు. ఇవి నాతోనే అంతరించిపోవాలి. జగ్గి అమాయకురాలు. అందుకే పురుడు పోసి పసిబిడ్డను, తల్లిని కాపాడే పని నేర్పింది. పురుళ్లు పొయ్యడం అతి తేలిగ్గా చేస్తోంది. దాని చేయి మంచిదంటున్నారు. కొడుకు, కోడలు... పిల్లా, పాపలతో సుఖపడాలి'

– గెద్ద కళ్ళు అలసటగా మూతలు పడ్డాయి. నిద్రలోకి జారిపోయింది.

మూల గదిలో నులక మంచంమీద పడుకుని ఆ ఇంటి వారమ్మాయి బాధతో మెలికలు తిరుగుతోంది.

మంత్రసాని ఊళ్లో లేదు. అందుకే గెద్దకు కబురు పెట్టారు. జగ్గి ఆమెను సమీపించింది.

"సానా ఓర్చుకోవాలమ్మా! ఓర్చుకోవాలా!" అంటూనే జగ్గి లోపలి లంగా ముడి విప్పి చీర కిందికి జరిపింది.

పొట్టనిండా ఆముదం రాసి బిగపట్టకుండా మెల్లిగా పైనుంచి కిందకు రాసింది. నెప్పులు ఎక్కువయినకొద్దీ లోపలి శిశువు ఎక్కడుందో జగ్గికి ఇట్టే తెలిసింది. కాస్త తేడాగా ఉంది.

అయినా నొప్పులొస్తుంటే శిశువు తల కిందికి దిగజారుతోంది.

"అమ్మో! అయ్యో!" ఆమె మరింత మూల్గుతోంది.

కన్నతల్లి ఆ బాధ చూడలేక ఆమె తల దగ్గిరే కూర్చుని కూతుర్ని ఓదారుస్తూనే వెక్కివెక్కి ఏడుస్తోంది.

ఆ తల్లీకూతుళ్ల అనుబంధం చూసి జగ్గి ఏమీ అనలేకపోయింది. నెప్పులు మరింత ఎక్కువయ్యాయి.

జగ్గి చేతులు ఆమె పొట్టమీద మిషన్‌లా పని చేస్తున్నాయి.

"రెండు పెద్ద నొప్పులకి పురుడు వచ్చేస్తదమ్మా!"

జగ్గి మాటలు ఆ తల్లికి ఊరటనిస్తున్నాయి.

ఆ పిల్ల తండ్రి పెరటి వసారాలో కాలుగాలిన పిల్లిలా తిరుగుతున్నాడు.

నొప్పులు మరింత ఎక్కువయ్యాయి.

భూనభోంతరాళాలు బ్రద్దలయ్యేలా ఆమె అరిచింది. శిశువు ఈ ప్రపంచాన్ని చూసి కెవ్వుమంది.

"అమ్మా! మగ పిల్లాడు!"

అంతవరకు పడిన బాధలు, భయాలు, ఆందోళనలు అన్నీ అందరూ మర్చిపోయారు.

బాలింత మెల్లిగా కళ్ళు తెరచి చూసింది.

ఓ పెద్ద నిధి దొరికినంత సంతోషం! ఏదో మమకారం కడుపులోని పేగులు తెంచుకుని బయటకు వచ్చింది.

శరీరంలో ఏదో తెలియని కదలిక! శరీరం గగుర్పొడిచింది.

జగ్గి పసివానికి బొడ్డు కోసింది. స్నానం చేయించి తల్లి పక్కలో పడుకోబెట్టారు.

పాలు పొంగిన స్తనాలను ఆ బాలింత కన్న శిశువుకు అందించింది.

ఆ తల్లి ముఖంలో అనిర్వచనీయమైన ఆనందం చూసి- సంతానం లేని జగ్గి 'తనకా అదృష్టం ఎప్పుడు పడుతుందో..!' అనుకుంది.

గదంతా శుభ్రం చేసింది జగ్గి.

ఆవిడ పాత చీర ఇచ్చింది.

అక్కడే స్నానం చేసి ఆ పాత చీర కట్టుకుంది. తిరిగి ఫాలేరు ఆమెను ఇంటి ముందు దిగబెట్టి వెళ్లిపోయాడు.

అప్పటికే అర్ధరాత్రి దాటింది. ప్రతిరోజు జగ్గి పురిటి బాలింత దగ్గర అవసరమైన పనిచేసి వెడుతోంది.

పదిరోజులు ఇట్టే గడిచాయి.

మునుపటిరోజుల్లో బాలింతను పసిబిడ్డను ఎన్నెమ్మ సంధి కొడుతుందని కిటికీ తలుపులు, గది తలుపులు మూసి ఉంచేవారు.

అది కందిరీగ ఆకారంలో వస్తుందని భయపడేవారు. ఊకతో పొగ వేసేవారు. గెద్ద కాలంలో ఆ భయం మరింత ఉండేది. రానురాను తగ్గిపోయాయి. కొందరిళ్లలో ఆ భయం ఇంకా పోలేదు.

జగ్గికి అవేమీ పట్టవు. తన పని తాను చేసుకుపోతుంది.

11వ రోజు పురిటి స్నానం చేయించడానికి జగ్గి వచ్చింది.

ఊరిలోని ముత్తయిదువులందరు పెద్ద నిమ్మకాయంత పసుపుముద్ద బిందెకు పెట్టి నిండా వేడినీళ్లతో పట్టుకొచ్చి పెరటి అరుగంతా నింపేశారు.

ముందు పిల్లవానికి స్నానం చేయించి జల్లెడలో పడుకోపెట్టారు.

బాలింతకు పసుపు ముద్దలు రాసి, నెత్తిన జల్లెడ పెట్టి, తెచ్చిన బిందెలలోని వేడినీళ్లు పోసి స్నానాలు చేయించారు.

తెలకపిండి కూర, పప్పు, పెరుగు, అన్నము ఎన్నెమ్మకు నైవేద్యం పెట్టారు ఇంటివారు.

దానిని జగ్గి, బట్టలుతికే లచ్చిమి తిన్నారు.

వీధిన పోయే కుక్కను తెచ్చి దాని ముఖాన పసుపు రాసి జగ్గి కుంకుమ బొట్టు పెట్టింది. భైరవుడని పూజ చేసి, ఆ కుక్కకు పెరుగు అన్నం పెట్టి జగ్గి వదిలేసింది. వారిచ్చిన బియ్యం, ధాన్యం, మరో పాత చీర తీసుకుని జగ్గి ఇంటికి తిరిగి వచ్చింది.

కోడలు కోసం ఎదురుచూస్తూ గెద్ద ఆ మట్టి అరుగుమీదే కూర్చుని ఉంది. కోడల్ని చూడగానే ఆ ముసలి కళ్ళల్లో కొత్త కాంతి తళుక్కుమంది.

"ఇంత పొద్దుపోయేదాకా ఏం సేసినావేటి?"

"అన్నీ సేసినా! ఎన్నెమ్మకు ఎట్టిన సద్ది తిందాంరా?" జగ్గి అన్నం చూపించగానే గెద్ద నోటిలో ఊరిన లాలాజలాన్ని చప్పరించింది.

గెద్ద రెండు ముద్దలు తిని "నువ్వు తినుకో!" అంది.

"నేనాడ తినొచ్చినా... ఇదిగో ఈ సీర నీకే!" బుట్టలో చీర తీసిచ్చింది.

"ఈయాలో, రేపో పోయేదాన్ని... నా కెందుకే ఈ సీర!"

"ఎందుకేటి! నా కోటి ఇచ్చినారుగా! ఇది నీకే!" అత్త ముందు పెట్టింది.

"ఇదిగో! ఇన్ని బియ్యం గింజలిచ్చినారా? ఇన్ని వడ్లగింజలా? ఈరిది పెద్దసెయ్యే! ఇలా కాన్పులకి పిలుత్తుంటే మన బతుకులు బాగపడతాయే!"

"గెద్దా! గెద్దా! అమ్మగారికి కడుపునొప్పట! నిన్ను సూసి పొమ్మన్నారు!"

"మీరెల్లండి బాబూ! అట్లాగే వత్తా!"

"సరే!" వచ్చిన వ్యక్తి తిరిగి వెళ్లాడు.

"అదేటి నువ్వెందుకంట? నే ఎల్లా!"

"జగ్గి! నే ఎల్లి వత్తాలే!"

జగ్గి వద్దన్నా వినకుండా గెద్ద ఆ ఇంటికి వెళ్లింది.

ఆ నొప్పులు అజీర్ణపు నొప్పులని గెద్ద ఇట్టే పసిగట్టింది. ఆమెకు తగిన జాగ్రత్తలు చెప్పి ఇంటిదారి పట్టింది. గెద్ద మట్టి అరుగు మీద అలాగే కూలబడింది.

"అదేటి అత్తా! ఏటయినాది?"

"ఏందో... ఈడ నొప్పిగా ఉందే!" గుండెల మీద చెయ్యివేసి చెప్పింది.

"అదేటి? ఆచారిగారొద్ద మందు తేనా?"

"వద్దే! ఇగ నేను ఉండనే. అన్నీ నీకు సెప్పినా? ఇగ నే ఎల్లి పోతున్నా!"

ఆ సాయం సంధ్యలో ఓ కృష్ణ గెద్ద 'కృష్ణా' అంటూ ఆకాశంలో ఎగురుకుంటూ పోయింది.

గెద్ద ఆ మట్టి అరుగుమీద వాలిపోయింది.

"ఓ యత్తో!" అంటూ జగ్గి ఆ శరీరం మీద పడి బావురుమంది.



– 'పత్రిక' మాస పత్రిక... ఏప్రిల్, 2002

# రహస్యం



"ఎవరైనా ఇంటికి వస్తే అంత బాధపడడం దేనికండీ! కాస్త భోజనం పెడితేనో, ఓ కప్పు కాఫీ ఇస్తేనో అరిగిపోతామా! ఇంటికొచ్చిన వారికి ఇంత పెడితేనో, మనకో ఇంత దొరుకుతుందంటారు! మరీ అంత పిసినారితనం పనికిరాదండీ!"

రమాదేవి భర్తతో వాదిస్తూనే ఉంటుంది. చలపతికి భార్య మాటలు వెగటుగా అనిపిస్తాయి. తాము ఎంతో కష్టపడి సంపాదిస్తున్న సంపాదన అలా అడ్డమైన వాళ్ళ కోసం ఖర్చుపెట్టడం అమాయకత్వం అనుకుంటాడు.

చలపతికి గవర్నమెంటు అఫీసులో ఉద్యోగం. లంచాలు దొరికే సీటు. దీపం ఉండగానే ఇల్లు చక్కపెట్టుకోవాలన్న తపన అతనిలో మరీ ఎక్కువ! హైదరాబాదులో ఇల్లు కట్టుకోడానికి ఎంతో ఆలోచించాడు. బంధువులు, స్నేహితులు వగైరాలు ఇంట్లో మకాం పెడతారని భయం. చివరకు అద్దెల బాధపడలేక ఇల్లు కట్టాడు. అతని ఇష్టాఇష్టాలతో ప్రమేయంలేకుండానే బంధువులు, స్నేహితులు ఆ ఇంటికి వచ్చి వెళుతూనే ఉన్నారు.

"ఇదిగో! ఇంటికి ఎవరు వచ్చినా సరే... నిర్మొహమాటంగా ఉండాలి. వెళతానంటే 'సరే' అనాలి. ఉండమని ఎవరిని బతిమాలకు... తెలిసిందా! ఇంటికి వచ్చిన వాళ్ళందరికీ మర్యాద కోసం పాకులాడి కాఫీ కప్పులు అందించకు. వద్దంటే ఊరుకో! ఇదిగో... వింటున్నావా!"

"ఇదిగో... ఎవరినీ భోజనాలకుండమని బలవంతపెట్టకు. పుణ్యాపాపాల మీద నాకు నమ్మకం లేదు. తెలిసిందా!" అలా అతను ఇంట్లో ఉన్నంతసేపు భార్యకు ఏదో చెబుతూనే ఉంటాడు. అతని బాధ పడలేక ఆవిడ 'సరే...' అనడం నిత్యకృత్యమైపోయింది.

అంతలో... ఒకరోజు అనుకోకుండా చిన్ననాటి స్నేహితుడు శంకరం భార్యతో సహితం వచ్చాడు. వారి చేతుల్లో పెట్టేబేడా చూసి చలపతి గుండెల్లో రాయి పడింది. శంకరం తను చేసే ఉద్యోగానికి రిజైన్ ఇచ్చిన సంగతి, ఇక్కడ ఉద్యోగం వెతుక్కోడానికి వచ్చిన సంగతి చలపతితో చెప్పాడు,

చలపతిని చేతనైన సహాయం చెయ్యమని అడిగాడు కూడా. చలపతి ముభావంగా 'అలాగే చూద్దాం' అన్నాడు. చిన్ననాటి చనువుతో శంకరం– 'ఒరే... శంకరం!' అంటూ చలపతి కౌగలించుకుంటాడేమోనని ఎదురుచూశాడు. కాని, చలపతి ముభావంగా ఉండటం గ్రహించాడు శంకరం.

అతనిలో వచ్చిన మార్పును గ్రహించి శంకరం కూడా దూరంగానే ఉండిపోయాడు.

"ఇదిగో... నా స్నేహితుడు కదాని మరీ మర్యాదలు చెయ్యకు. వెళతానంటే ఉండమని మొహమాటపెట్టకు. అసలే ఉద్యోగం లేదు! ఇక్కడే తిష్టవేస్తాడు జాగ్రత్త!" వాళ్ళు వచ్చిననాడే, పెళ్ళాన్ని హెచ్చరించాడు చలపతి.

శంకరం నాలుగు రోజుల్లో ఓ ఉద్యోగం సంపాదించుకున్నాడు.

ఇల్లు చూసుకుని వేరుగా కాపురం పెట్టాలనుకున్న విషయం చలపతికి తెలియజేశాడు.

"మన వెనుక పోర్షన్ ఖాళీగా ఉంది కదండీ! వాళ్ళని అందులో ఉండమని చెబుదామండీ! మీరు ఎప్పటికో కాని ఇంటికి రారు. వంటరిగా ఉండడానికి నాకు పగలూ,

రాత్రీ కూడా భయంగానే ఉందండీ! అందరూ అద్దె ఎంత ఇస్తున్నారో వీళ్ళని కూడా అంతే ఇమ్మని చెబుదాం!" భార్య మాటల్లో నిజముందనిపించింది చలపతికి.

"ఇదిగో... అద్దెలో రూపాయి తక్కువైనా ఊరుకోను జాగ్రత్త!" భార్యను మరోసారి హెచ్చరించాడు చలపతి. భర్త మాటలు బాధ కలిగిస్తున్నా రమాదేవికి అలవాటుగా మారాయి.

ఆరోజే శంకరం, లలిత వెనుక గదుల్లోకి చేరారు.

ఆ దంపతులు ఎంతో అన్యోన్యంగా ఉంటారు. వారిని చూస్తే ముచ్చటేస్తుంది రమాదేవికి. లలిత ఇల్లంతా, ఎంతో నీటుగా సర్దుకుంది. చేసే ప్రతిపని మీదా ఆసక్తి ఎక్కువ. వీధివైపు శుభ్రం చేసి పూలకుండీలు కొని తెచ్చి సర్దింది. ఇంటి వెనుక ఖాళీస్థలం శుభ్రం చేసి కొత్తిమీర, తోటకూర, పాలకూర విత్తులు చల్లింది. వారంరోజుల్లో అవి పచ్చని మొలకలెత్తి వింత అందాన్ని తెచ్చాయి. ఇంటిముందు పాచి చేసి చుక్కల ముగ్గులు వేస్తోంది. ఆ ఇంటికో కొత్త అందాలు తెచ్చింది లలిత.

"నీళ్ళు తేరగా వచ్చినట్లు అలా కుమ్మరిస్తోందేమిటి? వాళ్ళిచ్చే అద్దంతా వాటర్ బిల్లుకే అయ్యేటట్టుంది. నేలంతా పాచే. ఆ ముగ్గంతా ఎవరిదంటావు?" చలపతి మాటలకు నివ్వెరపోయింది రమాదేవి. అతనికి ఏదోవిధంగా సర్దిచెప్పి పంపింది.

ఒకనాడు చలపతికి యాక్సిడెంటు అయిందని, హాస్పిటల్లో ఉన్నాడని ఇంటికి ఫోను వచ్చింది. పొంగివచ్చే దుఃఖం ఆపుకుంటూ గుండె రాయి చేసుకుంది రమాదేవి. శంకరం దంపతుల్ని తీసుకుని హాస్పిటల్‌కి బయలుదేరి వెళ్లింది.

బెడ్‌మీద అచేతనంగా ఉన్నాడు చలపతి. ఊపిరి పీల్చుకోలేకపోతున్నాడని ఆక్సిజన్ పెట్టారు. ఓ చేతికి సెలైన్ ఎక్కిస్తున్నారు. తల నిండా, కాళ్ల నిండా బ్యాండేజులు, 'చలపతి' అనిచెబితే తప్ప ఎవరూ గుర్తుపట్టలేరు. 'పుట్టుక, చావుల మధ్య పోరాటమే జీవితం కాబోలు...' అనుకుంది రమాదేవి.

"రక్తం చాలా పోయింది. రక్తం ఎక్కించకపోతే ప్రాణానికి ప్రమాదం. అతని బ్లెడ్‌గ్రూపు ఎక్కడా లేదు" డాక్టర్లు తొందర చేశారు. రమాదేవికున్న ఆప్తులు ప్రస్తుతం శంకరం దంపతులే. తన భర్తను బతికించమని ప్రాధేయపడింది. చలపతి మారిపోయి మనసు లేని యంత్రంలా అయిపోయినా... మనసున్న వ్యక్తి శంకరం. తన రక్తమిచ్చి చలపతి ప్రాణం కాపాడ్డానికి ముందుకొచ్చాడు.

డాక్టర్లు శంకరం రక్తం తీసి పరిక్ష చేశారు. ఇద్దరిదీ ఒకే గ్రూపు రక్తం. శంకరం చేసిన రక్తదానంతో చలపతి తిరిగి ప్రాణం పోసుకున్నాడు. వారంరోజుల్లో చలపతిని ఇంటికి తీసుకువచ్చారు. క్రమంగా కోలుకుని మామూలు జీవితంలో పడ్డాడు చలపతి.

'ఇంటిస్థలం కొనుక్కుంటున్నానని, ఒక్క 50 వేలు సర్దుబాటు చెయ్యమని, ఇంటి నుంచి డబ్బు రాగానే తీర్చేస్తా'నని శంకరం రమాదేవి ద్వారా చలపతికి విన్నవించుకున్నాడు.

శంకరానికి ఏదో విధంగా సహాయపడాలని రమాదేవి కోరిక.

"రోడ్డుమీద పడిపోయి ఉంటే ఎవరో పుణ్యాత్ములు హాస్పిటల్లో సమయానికి చేర్పించారు. వారు ఆదుకోకపోతే ఏం జరిగేదో కదా?"

"జరగడానికేముంది..? చస్తే బూడిదయ్యే వాడిని అంతేకదా!"

"అదేమిటండీ... అలా అంటారు? శంకరం ప్రాణాలకు తెగించి తన రక్తం ధారపోసి మిమ్మల్ని బలికించాడు. అతనికి మనం ఋణపడి ఉన్నామండీ!"

"వెర్రిదానా! మనం ఋణపడటమేమిటి? అతనే మనింటికి చేరి, మన తిండి తిని, మన నీళ్ళు తాగి మనకి ఋణపడ్డాడు. అందుకే రక్తం నాకు ఇచ్చి ఋణం తీర్చుకున్నాడు. ఇంతకీ... అసలు నా ప్రాణం గట్టిది కనక బతికి బట్టకట్టాను. ఇప్పటికైనా అర్థమయిందా!"

"మీ ప్రాణం గట్టిది కనుక బతికారు... నిజమే! కాని, శంకరంలో దానగుణం ఉంది కనకే తన రక్తం ధారపోసి మిమ్మల్ని బతికించాడు. అతను ఇల్లు కట్టుకోడానికి స్థలం కొనుక్కోవాలనుకుంటున్నాడుట. ఒక్క 50 వేలు సర్దుబాటు చెయ్యమని అడుగుతున్నాడు. అతని రిటైర్‌మెంటు డబ్బు అందగానే ఇచ్చేస్తాడుట!"

"ఓసి... వెర్రి పెళ్ళామా! రెక్కలు ముక్కలు చేసుకుని సంపాదించే జీతపురాళ్ళు తిండికే చాలకపోతే అప్పెలా తీరుస్తాడు? నాలుగు రోజులు తిండిపెట్టమంటే పెట్టా! ఇంట్లో ఉంటానంటే ఉండమన్నా! ఇల్లు అద్దెకు కావాలంటే ఇచ్చా కానీ, డబ్బు దగ్గర నేనెవరి మాటా వినను. 50 వేలు కాదు కదా 5 రూపాయలు కూడా అప్పుగా ఇవ్వను! ఇంక మరెప్పుడూ ఈ ప్రస్తావన చెయ్యకు?"

'పిసినారితనమే కాదు.., ఈ మనిషిలో మూర్ఖత్వం కూడా చాలా ఉంది? ఇంక ఈ మనిషిని మార్చడం ఎవరితరమూ కాదు!' రమాదేవి ఎంతో బాధపడింది. కోపంతో కుతకుతలాడింది. పొంగిన పాలలా తిరిగి చల్లారిపోయింది.

రానురాను చలపతిలో మరింత మార్పు కనబడుతోంది–

బంగారు నగలు తెచ్చి బీరువాలో పెడతాడు.., వాటిని పెట్టుకోకూడదని ఆవిడకు ముందే చెబుతాడు.

నోట్లకట్టలు తెచ్చి ఇంట్లో పెడుతున్నాడు.., వాటిని వాడకూడదని ఆజ్ఞాపిస్తాడు. ఆ డబ్బు ఎక్కడిదని అడిగే అధికారం ఆమెకులేదు. గొంతు పెంచి తిడతాడు.

క్రమంగా ఆలస్యంగా ఇంటికి రావడం, అలావచ్చినప్పుడు అతని నోటినుండి దుర్వాసన. అతను తాగివస్తున్నాడని రమాదేవి ఇట్టే గ్రహించింది. అతను పతనం దిశగా పయనిస్తున్నాడని తెలిసినా అతనిని నిలదీసి అడిగేది.

అతను రెచ్చిపోయి కోపంతో చెయ్యి ఎత్తి కొట్టబోవడం మొదలుపెట్టాడు.

'తనకు ఏమాత్రం వ్యక్తిత్వం లేని ఆ ఇంట్లో ఉండటం అవమానమే! అతనితో కాపురం చెయ్యడంకంటే ఆత్మహత్య నయం! అలా ఆత్మహత్య చేసుకుంటే, లేక విడాకులిస్తే నాలుగు రోజుల్లో మరో కన్య ఇల్లాలిగా ఆ ఇంట్లో అడుగుపెడుతుంది.

గడపదాటితే తనకు బతకడానికి ఏ ఆధారమూ లేదు! ఆదరించే తల్లిదండ్రులు కానీ, ఆత్మీయులు కానీ లేరు! వారిలో కూడా ఎంత స్వార్థమో?! యాంటీ కరప్షన్ వారికి ఎవరైనా రిపోర్టు ఇస్తే ఎంతబాగుండునో?' అలా ఎన్నో విధాల ఆలోచిస్తోంది రమాదేవి.

'బహూశా... ఆ బ్రహ్మ ఎలా ప్రవర్తిస్తాడో చూద్దామని రాతిని కలిగించి ఈ మనిషిని తయారుచేసి ఉంటాడ' ని మాత్రం నిర్ణయించుకుంది.

చలపతి ఆఫీసులో లంచాలు పుచ్చుకుంటున్నాడనే వార్త క్రమంగా అందరికీ తెలిసిపోయింది. అతను ఎప్పుడు పట్టుపడతాడోనని రమాదేవి భయపడుతూనే ఉంది.

ఒకనాడు హఠాత్తుగా యాంటీకరప్షన్ వారు చలపతి ఇంటిమీద రైడ్ చేశారు.

వారిని ముందుగా చూసిన రమాదేవి నగలన్నీ మూటకట్టి లలిత చేతిలో పెట్టింది. ఏదోవిధంగా కాపాడమని వేడుకుంది. శంకరానికి కబురు చేసి చలపతిని ఆదుకోమని వేడుకుంది.

వచ్చినవారంతా ఇల్లంతా సోదా చేస్తున్నారు. ప్రతీవస్తువునీ పరిశీలిస్తున్నారు.

వారికి బీరువాలో 50 వేలు కనబడ్డాయి.

వారి ప్రశ్నలకు సమాధానం చెప్పలేని చలపతి తల దించుకున్నాడు. శరీరమంతా చెమటతో తడిసిపోయింది. అతని కాళ్లు వణుకుతున్నాయి. కళ్ళు చీకట్లు కమ్ముతున్నాయి.

అతని మనస్సు మొద్దుబారిపోయింది. సుఖదుఃఖాలకు అతీతంగా, నిర్వికారంగా నిలబడ్డాడు. కాలం కదులుతున్న జాడ అతనికి తెలీటం లేదు. అయినా కాలం కదులుతోంది.

"చలపతీ! చలపతి! నీ దగ్గర దాచుకున్న 50 వేలు ఇస్తావా? ఇదిగో... ఇంటి స్థలం కొనడానికి ఎగ్రిమెంటు అయింది. ఇవిగో డాక్యుమెంట్లు!" అప్పుడే అక్కడకు వచ్చిన శంకరం వాటిని చలపతికి చూపించాడు.

"మీరు ఆయనతో పర్సనల్‌గా ఏమీ మాట్లాడకూడదు!" అక్కడున్న యాంటీకరప్షన్ వారు ఆటంకపెట్టారు. వారూ అతని చేతిలో ఉన్న పేపర్లు పరిశీలించారు. వారడిగిన

ప్రశ్నలన్నింటికీ సమాధానమిచ్చాడు శంకరం. పైగా... తనకు బీరువా లేకపోవడం వల్ల అతని బీరువా లాకర్లో దాచమని 50 వేలు ఇచ్చానని చెప్పాడు. శంకరం మాటలు, చేతిలో ఉన్న డాక్యుమెంట్సును బట్టి నమ్మారు. 50 వేలు శంకరం చేతిలో పెట్టి వారు కదిలారు. ఏ ఆధారమూ దొరకనందున చలపతిని అరెస్టు చెయలేకపోయారు.

శంకరం మాటల్లోని అంతరార్థం తెలియక రాతిబొమ్మలా నిలబడ్డ చలపతిలో వారు వెళ్లిన తరువాత చలనం ప్రారంభమయింది. అతని గుండెల్లో ఘనీభవించిన మానవత్వం కరగడం ప్రారంభించింది.

శంకరం తిరిగి 50 వేలు చలపతి చేతిలో పెట్టాడు. పెరట్లో మొక్కల మాటున దాచిన నగల మూట తెచ్చి లలిత తిరిగి రమాదేవికి అందజేసింది.

"ఎదుటివారిని అర్థంచేసుకోడానికి మనస్సుండాలండీ! మనిషికీ, యంత్రానికీ మధ్య తేడా ఒక్క మనస్సే! మనిషి మనుగడకు అది చాలా అవసరం. మనిషి యంత్రంలా పనిచేయవచ్చు- కాని, యంత్రం కాకూడదు. డబ్బు సంపాదించవచ్చు- డబ్బే జీవితం కాకూడదు. ప్రేమా, ఆదరణ, ఆత్మీయతా కోల్పోయినా ఎదుటిమనిషి మీద నమ్మకం కోల్పోకూడదు. తెలిసిందాండీ!"

"ఇదిగో అవకాశం వచ్చిందని సుత్తి కొట్టి వాయించకు."

చలపతి సమాధాననికి భార్య రమాదేవి మనస్సు కుదుటపడింది. 'ఇప్పటికైనా ఈ రాతిమనిషి మామూలు మనిషి అయ్యాడు. అంతేచాలు!' అనుకుంది రమాదేవి.

"ఒరేయ్ శంకరం... నన్ను క్షమించరా!" అంటూ శంకరాన్ని వాటేసుకున్నాడు చలపతి. చలపతి తిరిగి డ్యూటీకి వెళుతున్నాడు. కానీ, మునపటిలా ఫైలు మీదపెట్టే ప్రతీ సంతకానికి మాత్రం చెయ్యి బల్లకిందకు సాగడంలేదు. ఇంటి దగ్గర పొదుపు సంగతీ ఎత్తడం లేదు.

ఇంతకీ... యాంటికరప్షన్ వారికి కంప్లైంటు ఇచ్చింది... భార్య రమాదేవేనన్న విషయం రహస్యంగానే ఉండిపోయింది.



- **'ఆంధ్రప్రభ'** ఆదివారం... *19 జూలై, 1998*

# సిలకమ్మ



ఎంకమ్మ రోజూలాగె వెలుగు రాకుండానే లేచింది.

వీధి ముందు భాగంలో కొబ్బరి చీపురుతో తుడిచి పేడనీళ్లతో కళ్ళాపుజల్లింది.

అప్పుడే నిద్రలేచి వచ్చిన సిలకమ్మ అత్తను చూసి సిగ్గుపడింది. "ముగ్గు నే పెడతాలే!" అంటూ ముగ్గుచిప్ప అందుకుని చుక్కలతో మామిడాకుల విస్తరి పెట్టింది.

చేతిలో గీతల ముగ్గే తప్ప– చుక్కల ముగ్గురాని ఎంకమ్మ ఆశ్చర్యంగా చూసింది. అప్పటికే ఆడవాళ్ళు కొందరు మంచినీళ్లు తెచ్చుకోడానికి తోటలోని బావి వైపు వెడుతున్నారు.

"రాయే కోడలుపిల్లా... నీల్లకు పోవాలీ!" పిన్నత్త మల్లమ్మ పిలుపు వినబడింది.

సిలకమ్మ రెండు చేతివేళ్ళతో జుట్టు సరిచేసుకుంది.

చీరకుచ్చెళ్లు సర్దుకుంది. సారెగా తెచ్చుకున్న పెద్ద, చిన్న ఇత్తడి బిందెలు తీసుకుని బయలుదేరింది.

"ఈ బాయిలో నీరే కనపడదేటి? నే తీత్తానుండి!" అంటూ పిన్నత్త వద్దంటున్నా సిలకమ్మ బరబరా గిలక మీద నీరు తోడింది. ముందు అత్త బిందెలు నింపి, తరువాత తన బిందెలు నింపుకుంది సిలకమ్మ.

ఓ బిందె భుజానకెత్తి, మరో చిన్నబిందె చంకన పెట్టుకుని పిన్నత్త వెంట అడుగులేసింది.

సిలకమ్మ రంగు నలుపైనా– చారడేసి కళ్ళతో కళకళలాడుతూ ఉంది. పైగా– పచ్చని చీర, రవికలో వెండి కంటె, కాసులతో, కాళ్లకి వెండి సాంజీబులతో, చేతికి వెండి కడియాలు, దండ కడియాలతో ఇట్టే ఆకర్షిస్తుంది.

"అబ్బ... ఎంకమ్మ కోడలు అందగత్తే కాదు.., పనిమంతురాలు కూడా!" అనుకున్నారు బావి దగ్గర ఆడవాళ్ళంతా.

"ఏటిరా గోపన్నా! కొత్త పెళ్ళాం వచ్చిందిగా! రాతిరి నిదురబోయావా, లేదా?" కావడితో ఎదురొచ్చిన గోపన్నను పినతల్లి వేళాకోళం చేసింది.

గోపన్న నవ్వుకుంటూ అలా ముందుకు వెళ్లిపోయాడు.

గోపన్న నీళ్లు తెచ్చి పెరటిలోని సిమెంటు గోళాలు నింపాడు. తర్వాత గోపన్న గేదెపాలు పిండడానికి దూడను వదిలాడు. ఎంకమ్మ రెండు ఇత్తడి చెంబులు తోమి అక్కడ పెట్టింది.

ఎంకమ్మ రెండవ కొడుకు గూనెవాడు. బరువు పనులు చెయ్యలేడు. గోపన్న నింపిన చెంబుల్లో పాలు సేరు చెంబులతో వత్తను ఇళ్లల్లో పోసి వచ్చాడు.

ఎంకమ్మ గేదెపేడతో పిడకలు చేసి పెరటి వైపు మట్టిగోడ నిండా పరిచి వచ్చింది. అప్పటికే బారెడు పొద్దెక్కింది.

"ఓయమ్మో! వణ్ణం పెట్టవే? పొలానికి పోవాలా!" అంటూ గోపన్న తొందరచేశాడు.

ఎంకమ్మ– మిద్దె గదిలోంచి కోడలు తెచ్చిన స్టీలు కంచాలు తెచ్చి కొడుకులిద్దరికీ అన్నాలు పెట్టింది.

"ఇదేటి? ఈ స్టీలు కంచాలిలా మెరిసి పోతున్నాయేటి?" అన్నారు ఇద్దరూ ఒకేసారి.

"సిలకమ్మ తెచ్చినాదిలే! వేడి వణ్ణం వార్చి ఉల్లికారం సేసినాది!" అంది ఎంకమ్మ.

"ఓయబ్బో! ఉల్లికారం సానా బాగుందే!" అంటూ కొడుకులిద్దరూ లొట్టలేసుకు తింటుంటే ఎంకమ్మ వారిని సంతృప్తిగా చూసుకుంది.

గోపన్నా, నాగులు మేకల్ని, గేదెను తోలుకుని గోదావరి గట్టు వైపుకు వెళ్లాలని బయలుదేరారు.

"గోపన్నా! గోపన్నా! సిన్నయ్యగోరు రమ్మంటున్నారు..!" అంటూ అంతలో ఈరిగాడు పరుగెత్తుకుంటూ వచ్చాడు.

"నువ్వెల్లి రా! రా!" అంటూ తమ్ముడికి మేకల్ని, గేదెను అప్పచెప్పి గోపన్న-వచ్చిన ఈరన్న వెంట బయలుదేరాడు.

"ఓయత్తా! అదేటి? అలా ఎల్లిపోతే మన పనుల మాటేటి?" సిలకమ్మ అత్తను ఆశ్చర్యంగా అడిగింది.

"కొత్తగా వచ్చినావు గందా! నీకేటి తెలుత్తాదే కట్టం..? మన నేల రెండు ఎకరాలు ఆరికాడ కుదువ ఉన్నాదే! అంతా తప్పుడు లెక్కలు సూపి ఓ అయిదు కుంచాల నేల చేజిక్కించుకున్నాడు. ఇప్పుడీ నేల మీద ఏసినాడు కన్ను..!" ఎంకమ్మ గుండె చెరువయింది. కళ్ళు నీళ్లతో నిండాయి. ఇక నిలబడలేక నులక మంచం మీద చతికిలబడింది.

"ఓ యత్తా! అదేటీ? అలా అయినావేటి?" సిలకమ్మ సిల్వరు గ్లాసుతో నీళ్లు తెచ్చి అత్తకు అందించింది.

"ఇదిగో... ఈరు మన పనులు సూసుకోనీకుండా రాసుకు తింటారే! ఈరి జిమ్మడి పోను.., ఈరి కొంప నాశనమై పోను!" ఎంకమ్మ కోపం పట్టలేక తిట్టడం మొదలుపెట్టింది.

"ఊరుకోయే యత్తా! నే లేనా! నే సూసుకుంటాగా! నువ్వూరుకోయే!" చిన్నదైనా సిలకమ్మ మాటలతో ఎంకమ్మ గుండె కాస్త దిటవయింది.

"ఆడు ఒట్టి ఎర్రిబాగులోడే! ఆడిని, ఈ కొంపని నీ సేతుల్లో పెడుతున్నా! నువ్వే సూసుకోవాలా!" ఎంకమ్మ ఆమె రెండు చేతులు పట్టుకుంది. ఎంకమ్మ కళ్ళనుండి కారే కన్నీళ్లు సిలకమ్మ చేతుల మీద పడ్డాయి.

సిలకమ్మ పమిట కొంగుతో ఆమె కన్నీళ్లు తుడిచింది. మరోసారి ఆమెకు ధైర్యం చెప్పింది.

ఎంకమ్మ కోడలు సాయంతో మెల్లిగా లేచింది. మేకల పాకంతా తుడిచి శుభ్రం చేసింది. మేకల పెంట ఎత్తి చెత్తకుప్పలో వేసింది.

ఎంకమ్మ మగడు బతికున్నప్పుడు నలభై వరకు మేకలుండేవి. ఇప్పుడు ఇరవై మాత్రమే మేకలున్నాయి. మేకల్ని అమ్మినప్పుడు ఆ డబ్బుతో తిరిగి మేకలు కొనుక్కుంటారు.

ఇప్పుడు ఎంకమ్మ కుటుంబానికి ఆ మేకల్ని పెంచడమే కష్టమైపోయింది. మేకలే వారి సంపద..! అదే తరిగిపోతోంది.

అప్పటికే సూర్యుడు నడినెత్తి మీదికొచ్చాడు. ఎంకమ్మ, సిలకమ్మ అప్పటివరకు ఏమీ తినలేదు. కడుపులో ఆకలి నకనకలాడుతోంది.

ఎంకమ్మ పెరటివైపు చూరు వారనున్న పొయ్యి అంటించి సిల్వరు గిన్నెతో ఎసరు పెట్టింది. పాతడబ్బాలో అడుగునున్న బియ్యం చేటలో పోసి తెచ్చింది.

"నే సేత్తాగా! నూ కూకో!" సిలకమ్మ ఆమె చేతిలోని బియ్యంచేట అందుకుంది.

"ఎంకమ్మా! ఎంకమ్మా! వరిపిండి కొట్టాలంట, మినప్పిండి ఇసరాలంట! సిన్నమ్మగారు ఎంటనే రమ్మంటున్నారు!" అంటూ సీతాలు గుక్క తిప్పుకోకుండా వచ్చిన పని చెప్పేసింది.

"రెండు ముద్దలు కూడు తిని వత్తాది! ...నువ్వెల్లు!" అంది ఎంకమ్మ.

"బెగిరా!" అంటూ సీతాలు వెనక్కి తిరిగింది.

"నేనూ వత్తారీ! ఓ యత్తా!" అంది సిలకమ్మ.

"నువ్వే కాదు, రాజమ్మా వత్తాది!" అంది ఎంకమ్మ.

అన్నం ఉడగ్గానే ఇద్దరూ చెరో నాలుగు ముద్దలు తిన్నారు. ముగ్గురూ చిన్నమ్మగారి ఇంటికి బయలుదేరి వెళ్లారు.

అక్కడ వరిపిండి కొట్టారు. మినప్పిండి విసిరారు. పెసలు, మినుములు, విసిరి చాయపప్పు కోసం నూనె రాసి ఎండలో పెట్టారు. సాయంకాలం వరకు ముగ్గురూ కలిసి ఏదో పని చేస్తూనే ఉన్నారు.

దీపాలు పెట్టే వేళయింది.

చిన్నమ్మగారు లెక్కలు కట్టి ముగ్గురుకీ రావలసిన డబ్బు ఇచ్చింది. ఒక సేరు బియ్యం కూడా కొలిచి వారి కొంగుల్లో పోసింది. మరునాడు చేయవలసిన పని పురమాయించింది.

"ఆయ్‌ఁ..! సిత్తం! రేపొద్దారి!" అంటూ ముగ్గురూ ఇంటి దారి పట్టారు.

సిలకమ్మ దృష్టి అంతా అప్పు మీదే ఉంది. 'అది ఎలా తీర్చాలా..?' అని ఆలోచిస్తోంది.

"ఓ యత్తా! దినాం పని దొరికితే మన అప్పు తీరుద్దే!" అంది సిలకమ్మ ఇంటి కెళ్లగానే. ఆమెలో కొత్త ఆశ చిగురించింది.

"అది సత్తమే కోడలా!" అంది ఎంకమ్మ సంబరంగా.

సిలకమ్మ దబ్బంతా లెక్క కట్టింది.

"అదేటి? నీకు లెక్కెట్టడం వచ్చా?" అంది ఎంకమ్మ ఆశ్చర్యంగా.

"నాలుగో కళాసు సదివినా!" అంది సిలకమ్మ సంబరంగా.

చిల్లరతో మొత్తం ఇరవై రూపాయలయింది. సిలకమ్మ ఆ డబ్బు ఓ చిన్న ముంతలో వేసి పచ్చని గుడ్డ వాసిన కట్టింది. మీది గదిలో కావడి పెట్టెలో దాన్ని దాచి వచ్చింది.

గోపన్న రాత్రి పొద్దుపోయాక ఇంటికి వచ్చాడు. ఎంకమ్మతోపాటు కోడలు కూడా మెలకువగానే కూర్చుంది.

"ఇంత పొద్దోయిందాకా ఏడున్నావురా? పెల్లాం వచ్చినాదని మరిసినావా ఏటి? ఇగసెయబోక... బాగోదు" ఎంకమ్మ కొడుకును మందలించింది.

"ఆరు తాటిపూడి ఎల్లి రమ్మన్నారు. సైకిలిచ్చినారులే! ఆకలేత్తోందే... వణ్ణం పెట్టవే!" అన్నాడు గోపన్న.

"పోయి కాడ ఏడినీల్లున్నాయి. రెండు సెంబులు పోసుకురా!" అంది ఎంకమ్మ.

ఎంకమ్మ చూరుకు తగిలించిన అరికెన లాంతరు వత్తి పెద్దది చేసింది.

గోపన్న స్నానం చేసి వచ్చి అన్నం గబగబా తింటుంటే... ఎంకమ్మ కొడుకు వైపు జాలిగా చూసింది. ఎంకన్న నాలుగు ముద్దలు తిన్నాడు. నిద్ర ముంచుకొస్తుంటే తిన్న కంచంలోనే చెయ్యి కడుక్కుని లేచాడు. పక్కనే ఉన్న నులక మంచం మీద వాలబోయాడు. తల్లి చెయ్యి పట్టుకుని తీసుకెళ్లి మీది గదిలో పట్టెమంచం మీద పడుకోబెట్టింది. ఎంకమ్మ ఆ పాత నులక మంచం మీద నడుం వాల్చింది.

అత్తకు నిద్ర పట్టిందనుకున్న సిలకమ్మ గదిలోకి వెళ్లి గోపన్నను లేపింది. గోపన్న కళ్ళు నులుముకుంటూ లేచి కూర్చున్నాడు. సిలకమ్మ తాను తెచ్చిన మిఠాయి ముక్క నోటి కందించింది.

"ఇదేటి? సీనీదా? సానా బాగుంది!" అంటూ గోపన్న లొట్టలేసుకుంటూ తిన్నాడు.

"ఏడకో ఎల్లినావు గందా! ఆరు ఏటిచ్చినారు?" సిలకమ్మ ప్రశ్నించింది.

గోపన్న "ఏటీ ఇవ్వలేదు!" అనగానే సిలకమ్మ ఆశ్చర్యపోయింది.

"కట్టం సేసినావు గందా? ఆరు ఏటీ ఇవ్వకపోతే మనం బతికేదెట్టా? మన పనులు ఏరు సేత్తారు? ఈ పొద్దు నుంచి ఆరు పదో, పరకో ఇత్తే తప్ప- ఏరి పనికీ పోబోక!" అంది సిలకమ్మ.

సిలకమ్మ మాటలు అతనికి పూర్తిగా అర్థంకాకపోయినా, "సరే..." అంటూ తలూపాడు. పెళ్ళాం చెప్పినట్టు మాత్రం చెయ్యాలనుకున్నాడు.

గోపన్న గుండెల మీద తలవాల్చిన సిలకమ్మ అతన్ని లతలా చుట్టేసుకుంది. తెల్లవార్లూ ఏదో మేక అరుస్తూనే ఉంది.

ఆ రోజు మేకల్ని, గేదెను పొలంలో మంద కట్టడానికి తీసుకెదుతున్నారు. రాత్రిళ్ళు అన్నదమ్ములిద్దరూ కాపలాగా పొలంలోనే పడుకుంటారు.

"అదేటిరా! సిలకమ్మని రాతిరి వంటరిగా వదలి నువ్వాదుంటె ఎలారా?"అంది ఎంకమ్మ దిగులుగా.

"మా చిన్నోడిని పిలిపిత్తా!" సిలకమ్మ అంటూండగానే ఆమె తమ్ముదు లచ్చుదు రానే వచ్చాదు.

'ఆ దేవుడే పంపించిందు' అనుకుంది ఎంకమ్మ.

సిలకమ్మ వదనం సూర్యోదయంలో తామర పువ్వులా కళకళలాడింది.

లచ్చుదు నాలుగు ముద్దలు అన్నం తిని వారి వెంటే పొలం వెళ్లాదు.

"మన పొలంలో మనం మంద కట్టుకునే రోజు ఎప్పుడొత్తదో!" అంది ఎంకమ్మ దిగులుగా.

"దానిదేముందే? ఓ యత్తా! అది మళ్లీ ఈ కాలానికి సూద్దారి!" అంది కోడలు.

అత్తా, కోడలు– రాజమ్మతో కలిసి ఏదో పనికి పోతూనే ఉన్నారు. చేతినిండా పనే! ఊరగాయల కాలంలో కారం కొట్టడం, డప్పుకొట్టడం, ఆవపిండి విసరడంతో వారికి మరింత పని దొరికింది. ఆ డబ్బుతో మూడు పిడతలు నిండిపోయాయి.

ఆరోజు గోపన్నను రమ్మనమని చిన్నయ్యగారు మళ్లీ కబురు చేశారు. గోపన్న భార్య మాటలు తలపుకు వచ్చి "రాలే" నని సమాధానమిచ్చాదు.

వారి ఇంటిముందే– వచ్చిన మనుష్యులు గోపన్నను చేతికర్రలతో చావకొట్టారు. ఎదురుగా పోలీసుస్టేషను ఉంది. పోలీసులు రావడం చూసి వారు పారిపోయారు.

ఎంకమ్మ, సిలకమ్మ గుండెలు పగిలేలా ఏడ్చారు. రాజమ్మే వారిని ఓదార్చింది. ప్రభుత్వ ఆసుపత్రికి తీసుకువెళ్లి కట్లు కట్టించి ఇంజక్షన్ చేయించారు.

నాలుగు రోజులు గోపన్న మంచం మీదే ఉండిపోయాడు. దెబ్బలు కాస్త మానాక గోపన్న లేచి తిరగగలిగాడు.

ఒరోజు సాయంకాలం పెద్ద గాలిదుమారం వచ్చింది. ఇంటి మీది తాటాకులన్నీ ఎగిరిపోయాయి. తరువాత కురిసిన వడగళ్ళ వానకి ఇల్లంతా మడుగయింది. మేకల పాక కూలింది.

సిలకమ్మ భయంతో బిగుసుకుపోయింది.

ఆమె పుట్టింటోరిది పెంకుటిల్లు. గాలి దుమారం వచ్చినా, కుంభవృష్టి వానలు కురిసినా ఆమె ఎప్పుడూ ఇలాంటి దృశ్యం చూడలేదు. ఆమె కూర్చున్న నులక మంచం నీళ్లలో తేలింది.

"ఓ యత్తా! ఇదేటే?" అంది అత్తను వాటేసుకున్న సిలకమ్మ.

"మన బతుకుల్లో ఇది మామూలే!" ఎంకమ్మ కోడలిని ఓదార్చింది.

గాలి దుమారం వెలిసాక కొబ్బరిచీపురుతో నీరంతా తుడిచింది ఎంకమ్మ. గోనెతట్టుతో బురదంతా తుడిచింది. అంతలో... గోపన్న, నాగులు పొలంలోని మేకల్ని ఇంటికి తీసుకువచ్చారు. ఆ ఇంటికి చుట్టూ మట్టిగోడలు. పైన తాటాకు కప్పు. గుమ్మాలకి మాత్రం కర్ర తలుపులున్నా- పొట్టిగా నాలుగు అడుగులే అవడంవల్ల తలలు వంచే లోపలకు వెళ్లాలి. వీధిలో ఎడంవైపు మేకల పందిరి. అది పడిపోకుండా చుట్టూ తాటాకు దడి ఉంది. గేదెను మాత్రం బయటే కట్టేస్తారు. పెద్దవానలు వస్తే గోడలు కూలిపోతూ ఉంటాయి. ఎంకమ్మ మట్టితో ఎప్పటికప్పుడు మెత్తుతూ ఉంటుంది.

గోపన్న, నాగులు, లచ్చుడు సాయంతో మేకల పాక రాటలు పాతి, తిరిగి పైన తాటాకు కప్పి సరిచేశాడు. చుట్టూ పడిపోయిన దడి మళ్లీ కట్టాడు. తర్వాత ఇంటిపైకి ఎక్కి తాటాకులన్నీ కప్పి కట్టాడు. చీకటి పడకుండా కిందికి దిగాడు. అప్పటికి సిలకమ్మ ప్రాణం కుదుటపడింది.

లచ్చుడు ఆ పూటకు అక్కడ ఉండి మరునాడు వాళ్ళ ఊరు వెళ్లిపోయాడు. అక్క సిలకమ్మని వెంట రమ్మన్నా, ఆమె తర్వాత వస్తానని తమ్ముణ్ణి పంపేసింది.

వర్షాలు ప్రారంభమయ్యాయి.

వాగులు, వంకలు నిండాయి.

గోపన్న ఇంటి చుట్టూ ఉన్న గోతులు నిండాయి. ఒకటే కప్పల బెకబెకలు..!

గోపన్నకు చేతినిండా పనే! వరిచేలు పెరుగుతుంటే వాళ్ళు కంటికి రెప్పలా చూసుకుంటున్నారు. సీతాలచ్చిమి వీధి వైపు, దొడ్డి వైపు నాటిన పూలచెట్లతోపాటు కూరగాయల చెట్లు, పాదులు పెరిగి కాపుకొచ్చాయి.

గోపన్న వాళ్లు ఎరువులు, మందులు, కొనడానికి అప్పు తీసుకుంటారని ఎదురుచూస్తున్న చిన్నయ్య కోరిక ఎండమావే అయింది. బ్యాంకు లోనుతోనే ఎరువులు, పురుగుల మందులు కొన్నారు. పైగా- మరో పది మేకలు కూడా బ్యాంకు లోనుతోనే కొన్నారు. ఆ సంవత్సరం వరి ధాన్యం తెగ పండిందన్నారు రైతులు.

సిలకమ్మ ఓరోజు గోపన్నతో పుట్టింటికి వెళ్లింది.

తండ్రితో మాట్లాడి తన వంటి మీది వెండినగలు అమ్మించి డబ్బు తీసుకుంది. గోపన్న వద్దన్నా ఆమె వినలేదు. మరునాడే తిరిగి మగనితో ఇల్లు చేరుకుంది. కళకళలాడే కోడలు అలా బోసిగా ఉంటే ఎంకమ్మ చూడలేకపోయింది.

"అదేటే... నగలన్నీ అమ్మేసినావూ? పంట సేతికొచ్చినాక తిరిగి సేపిస్తాలె?" అంది.

సంక్రాంతి నెల పట్టారు. ఊరంతా ఏదో కొత్త సందడి!

సిలకమ్మ ముఖంలో ఏదో దిగులు ఉంది. ఎంకమ్మకి అంతు పట్టలేదు.

ఆరోజు పంట చేలు కోసి కుప్ప వేశారు. అప్పుడే ఇంటికొచ్చాడు గోపన్న.

"ఏరా గోపన్నా... ఎన్ని కోటాలు తూగుతాయేటి?"

ఎంకమ్మ ఆతురతగా అడిగింది.

"ధాన్యం కొట్టినాకే తెలుస్తుంది..!" అన్నాడు గోపన్న.

నాలుగు మెతుకులు తిని తిరిగి పొలం పరుగెత్తాడు. మరునాడు ధాన్యం కొట్టడం ప్రారంభించారు. రాత్రి చీకటిపడే వేళకి పనులు పూర్తయ్యాయి. కోటాలు తూచి కపులు ధాన్యం చిన్నయ్యగారింటికి పంపించాడు. మిగిలిన ధాన్యం గోపన్న ఇంటికి బండిలో తీసుకొచ్చాడు. గోపన్నకి బండి, ఎడ్లు లేవు. సిలకమ్మ తండ్రి మేనమామే అన్ని ఏర్పాట్లూ చేశాడు.

ఇంటి ముందు బండి ఆపి ధాన్యం బస్తాలు దింపుతుంటే... చిన్నయ్య మనుషులు బడెతలతో యమదూతల్లా అక్కడ ప్రత్యక్షమయ్యారు.

'చిన్నయ్యగారి బాకీ తీరిత్తేగాని ధాన్యం బస్తాలు దింపటానికి వీల్లే ' దని అడ్డుపడ్డారు. ఎవరు ఎంత చెప్పినా వినలేదు.

"రేపు సాయంకాలం కచేరి కాడికి అందరూ రండి. అక్కడ లెక్కలు చూద్దాం! ఇప్పటికి ధాన్యం గోపన్న ఇవ్వటం మంచిది!" అన్నాడు పంచాయితీ ప్రెసిడెంటు.

"అవును. అలా చేస్తేనే బాగుంటుంది. పైగా... ఆయన గ్రామపెద్ద. ఆయన చెప్పినట్లు చెయ్యడం మంచిది!" అన్నారు మిగిలిన పెద్దలు.

ఇంక ఏం చెయ్యలేక చిన్నయ్య మనుషులు అక్కడ నుంచి మెల్లగా జారుకున్నారు.

వచ్చిన పెద్దలు వెనక్కి తిరిగారు.

సావిట్లో పేర్చిన ధాన్యం బస్తాలకు కాపలాగా గోపన్నా, బావమరిది నాగులు వాటి పక్కనే పడుకున్నారు. తెల్లవార్లూ అరికెన లాంతరు, మరోపక్క బుడ్డిదీపం వెలుగుతూనే ఉన్నాయి.

తెల్లవారింది మొదలు సిలకమ్మ తండ్రి తెచ్చిన డబ్బు, తాను దాచిన ముంతల్లో డబ్బు లెక్కలు కడుతూనే ఉంది. ఎంకమ్మకి, గోపన్నకి మాత్రం లోపల దిగులుగానే ఉంది.

సాయంకాలం అందరూ కచేరి సావిడికి చేరుకున్నారు. ఒకవైపు చిన్నయ్య, ఆయన మనుషులు కూర్చున్నారు. మరోవైపు గోపన్న, మామగారు, లచ్చుడు, నాగులు... వారి వెనుక సిలకమ్మ, ఎంకమ్మ, రాజమ్మ కూర్చున్నారు. అంతలో పంచాయతీ ప్రెసిడెంటు, ఇతర పెద్దలు వచ్చి ఎదురుగా ఉన్న రాగి చెట్టుకింద కుర్చీలో కూర్చున్నారు.

"ఇదిగో... అన్ని వడ్డీలు, అసలు... అన్నీ కలిపి మొత్తం ఆరువేలయింది. ఆ డబ్బుకట్టి నేల విడిపించుకోవాలి! గోపన్నా డబ్బు పట్టుకొచ్చావా?" అడిగాడు పంచాయితీ ప్రెసిడెంటు.

"ఆయ్ఁ...! సిత్తం బాబా!" అంటూ గోపన్న సిలకమ్మ వైపు చూశాడు.

సిలకమ్మ కట్టిన లెక్కల ప్రకారం కూడా ఆరువేలే అయింది. సిలకమ్మ ఆశ్చర్యపోయింది. మహా సంతోషంతో డబ్బు మూట గోపన్నకి అందించింది.

"ఏందే! అందులో ఆరుఏలు ఉన్నాయా?" అంటూ అడిగిన అత్తకు భయపడి "అత్తా! ఆరు ఏలు ఉన్నాయే?" సిలకమ్మ సమాధానం చెప్పింది.

రెండు చేతులు గుండెల మీద వేసుకుని గట్టిగా ఊపిరి తీసుకుంది ఎంకమ్మ.

'అంత డబ్బు ఆళ్లెక్కడ కట్టగలరు? భూమి మనదే!' అనుకుంటూ మీసాలు మెలేసుకుంటున్న చిన్నయ్య ముఖం గోపన్న చేతిలో డబ్బు మూట చూసి చిన్నబోయింది.

గోపన్న ఆ డబ్బు మూట పెద్దల ముందు పెట్టాడు. వాళ్ళు ఆ మూట విప్పి డబ్బు లెక్కపెట్టారు. సరిగ్గా ఆరువేలుంది.

"చిన్నయ్యా! ముందు ఆ భూమి కాగితాలు మాకిచ్చి, ఇదిగో... డబ్బు మూట అందుకో!" అన్నాడు ప్రెసిడెంటు.

"నాకు భూమే కావాలా! డబ్బొద్దు!"

... అని చిన్నయ్య అరిచినా పెద్దలు వినలేదు. పైగా మందలించారు.

చిన్నయ్య అవమానంతో పళ్ళు నూరుకుంటూ తన మనుషులతో కదలబోయాడు.

"చిన్నయ్యా! ఇది మర్యాద కాదు... ముందు కాగితాలు ఇక్కడ పెట్టి మరీ కదులు!" అన్నాడు ప్రెసిడెంటు.

చిన్నయ్య కోపంతో ఊగిపోయాడు. అయినా... చేసేదేమీ లేక భూమి తనఖా కాగితాలు ప్రెసిడెంటు ముందుకు విసిరాడు. తన మనుషులతో అక్కడ నుండి విసవిసా వెళ్లిపోయాడు.

"గోపన్నా! ఇదిగో... నీ భూమి కాగితాలు తీసుకో! ఇక, నీ భూమి నువ్వే వ్యవసాయం చేసుకో!" అన్నాడు ప్రెసిడెంటు.

గోపన్న ఆయన చేతిలోనుంచి కాగితాలు అందుకున్నాడు. వాళ్ళ సంతోషానికి అంతు లేదు.

"దండాలు బాబా!" అంటూ అందరికీ దండాలు పెట్టాడు.

"అబ్బో! గోపన్న పెళ్ళాం సానా సదువుకుందంట! ఆ డబ్బంతా ఆమే పోగుసేసిందంట! ఇగ ఆ కొంపకే ఉంది సిరి!" అన్నారు ఆడవాళ్ళంతా.

ఆ మాటలు విన్న గోపన్న- పెళ్ళాం సిలకమ్మ వైపు గర్వంగా చూశాడు.

ఇంటికెళ్లిన సిలకమ్మ ముఖం ఎందుకో వాడిపోయి ఉంది.

"అదేంటీ సిలకా! అలాగున్నావేటే?" అడిగింది ఎంకమ్మ.

"ఏం లేదే! ఓ యత్తా! నే మాయమ్మకాడికి ఎల్లిపోతానే!" అంది దిగులుగా.

"అదేటే? ఆ మాటేటే? ఈడ ఉండక ఆడకెందుకే?" ఎంకమ్మ అర్థంకాక అడిగింది.

"నాకు పిల్లలు లేరంటే..! మొన్న మా ఊరి డాక్టరుగారు సెప్పినారే! అత్తా... నీ కొడుక్కి మరో మనువు సెయ్యి!" ఆ మాట అంటుంటే సిలకమ్మ కళ్ళలో నీళ్లు తిరిగాయి.

"ఓసినీ! ఈ కొంపకి నువ్వు మాలచ్చిమే! ఈడ డాటరమ్మకి నే సూపిత్తానే! వైద్యం సేపిత్తా! దిగులు పెట్టుకోబోక! నువ్వేడకి పోతావే?" అంటూ ఎంకమ్మ ఆమె తల నిమిరి మెటికలు విరిచింది.

సిలకమ్మ ముఖంలో దిగులు పోయింది. పున్నమి చంద్రబింబంలా కళకళలాడింది. కడుపులో ఏదో కదులుతూన్నట్లు అనిపించింది. ఏదో కొత్త ఆశ చిగురించింది.

ఎంకమ్మ కళ్ళ ముందు ఆ తాటాకుల కొయ్య పెంకుటిల్లులా కళకళలాడింది.

సావిట్లో బట్ట ఉయ్యాల్లో చంటిపిల్లాడు పకపకలాడుతూ కనిపించాడు.

# మిసెస్ రామనాథమ్



"మేము సికింద్రాబాద్ నుంచి ఫోను చేస్తున్నాము. నవంబరు 19న మా క్లబ్ వార్షికోత్సవం. మీరు ముఖ్య అతిథిగా విచ్చేసి మా సభను జయప్రదం చేయాలి!" పొద్దుటే ఓ ఫోను.

ఎక్కడో ఆ గొంతు విన్నట్లు అనిపించింది. కాని గుర్తుపట్టలేకపోయాను.

"మీరు ...."

నా మాట పూర్తి కాకుండానే అవతలి కంఠం-

"హిమాయత్‌నగర్‌లో ఉంటాం! మరి, మీరెక్కడుంటారు?" అదే నా మొదటి ప్రశ్న.

"మేము సికింద్రాబాద్ లాలాగూడా క్వార్టర్స్‌లో ఉంటాము."

"అక్కడ మీకు... అంటే ఆడవాళ్ళకి కాలక్షేపం బాగుంటుందా?"

"అబ్బో... ఆడవాళ్ళకి కావలసినంత కాలక్షేపం! లేడీస్ క్లబ్‌లున్నాయి. రకరకాల ఆటలు, కుట్లు, అల్లికలు, వంటలు, ఎన్నో ట్రైనింగ్‌లు, పైగా... పోటీలు! క్వార్టర్స్‌లో ఉన్నవాళ్ళం కలుసుకుంటూ ఉంటాం! మధ్యమధ్యలో అందరం కలిసి విందులూ, వినోదాలు కూడా ఏర్పాటు చేసుకుంటాం!"

"అయితే– మీకు కాలక్షేపం బాగానే ఉన్నట్టుంది!" అన్నాను నవ్వుతూ.

"ఆః... లేడీస్ క్లబ్‌కి ప్రస్తుతం నేను ప్రెసిడెంటుగా సెలక్టు అయ్యానండి! మా సెక్రెటరీ కూడా చాలా చురుకైంది. మేము అనాథాశ్రమం నడుపుతున్నాం. పిల్లల కేర్‌సెంటర్ పెట్టాం! బాగా రన్నవుతున్నాయి. మా కల్చరల్ ప్రోగామ్స్‌కి ఆడవాళ్ళే కాదండీ– మగవారు, ముసలివారు, పిల్లలు... అందరూ వస్తారండి!"

"అయితే... ఆ కాలనీ మీకో మినీ ప్రపంచమన్నమాట! మీ పనే బాగుందండీ!"

ఆమె కిలకిలా మరోసారి నవ్వింది. తెల్లటి ముత్యాల్లాంటి ఆమె పళ్ళు, నల్లటి కోలకళ్ళు, సన్నటి ముక్కు మరింత సొగసుగా ఉన్నాయి. ఛాయ తక్కువైనా మనిషి ఆకర్షణీయంగా ఉంది.

"మా పని బాగానే ఉంది. ఏదో ఇంటి పట్టున ఉండేవాళ్ళం! మీరేం చేస్తారో చెప్పలేదు?"

"నేను మా సొంత బిజినెస్ చూసుకుంటాను."

"ఓః... అలాగా! మా క్వార్టర్స్‌లోనే మావారి కొలీగ్ భార్య యూనివర్సిటీలో పని చేస్తారు. ఆవిడ జయాసారథి. చాలా ధైర్యస్థురాలండీ! ఆడవాళ్ళంతా స్వతంత్రంగా ఆలోచించే శక్తి ఉంచుకోవాలనీ, తమ కాళ్ళ మీద తాము నిలబడేవరకు ఎదగాలనీ ఎన్నో చెప్పేవారు. ఇప్పుడామె మా క్వార్టర్స్‌లో లేరు! బయట ఇల్లు కట్టుకుని వెళ్ళిపోయారు! ఆవిడ వెళ్ళాక నాకు సగం శక్తి తరిగిపోయిందనుకోండీ..!"

"ఓః...! జయాసారథిగారా! నాకు బాగా తెలుసండి! ఆవిడ చాలా ఉన్నత భావాలుగల వ్యక్తి. ఆవిడ చెప్పినట్టు మన ఆడవాళ్ళు బాగా మారాలి కదండీ! మగవారిని ఎదిరించమని, వారిని కించపరచమని కాదు.., స్వతంత్ర భారతంలో స్త్రీ, పురుషుల స్థానం సమానమైందే కదా! పైగా... బండికి ఇరుచక్రాల వంటివారు! హెచ్చుతగ్గులు తాత్కాలికం!

భేదాలు సృష్టించుకోవడం అవివేకం. కాని, మన ఆడవాళ్ళకి ఏ అన్యాయం జరిగినా, అవమానం జరిగినా సహించకూడదు. స్త్రీని లోకువగా చూసినా, హేళన చేసినా ఏమాత్రం ఊరుకోకూడదు!"

"ఆవిడా ఇలాగే చెప్పేవారు! కాని, సగం మంది స్త్రీలు ఎక్కువ చదువుకోకపోవడం వల్ల, ఇంట్లో వంటిల్లుకు అతుక్కుపోయి వండుతూ, వారుస్తూ, వడ్డిస్తూ ఉండటం వల్ల కూడా కొంత లోకువై ఉండవచ్చండీ!" అంది.

ఆవిడ మాటల్లో ఏదో అమాయకత్వం కనబడింది.

"మీరు చెప్పింది నిజమే! ఆడవాళ్ళకి ఏమీ తెలీదని చాలామంది అపోహ! అందుకే ప్రభుత్వం తరపున కాని, ప్రైవేటుగా కాని ఏవైనా అవకాశాలు వస్తే ఏదో ఒకర్ని పిలిచి సర్దుబాటు చేసి చేతులు దులుపుకుంటారు. నిజమే కదా?"

"ఎంత కరెక్టుగా చెప్పారండీ! స్త్రీలకి పురుషులతో సమానమైన రోజులు ఎప్పుడొస్తాయంటారు?"

"ఇంకెంత? ఆ టైము వచ్చేసిందండీ! మొదటి మెట్టుమీద ఉన్నారు. ఒక్కొక్క మెట్టే ఎక్కేస్తారు. ఎంతో కాలం పట్టదు!" అన్నాను.

సంతోషం పట్టలేక ఆవిడ గట్టిగా చప్పట్లు కొట్టింది. పడుకున్నవాళ్ళు తలతిప్పి చూడగానే ఆవిడ చప్పట్లు కొట్టడం ఆపి, నాలిక కరుచుకుంది!

టైం చూస్తే అప్పటికే పదయింది.

"జయాసారథిగారు కనబడితే అడిగానని చెప్పండి! ఇంక పడుకుందామా..?"అంది

"అలాగే... ఆవిడ కనబడితే చెబుతా! కాని, మీ పేరు నాకు తెలీదు కదా!" అన్నాను నవ్వుతూ.

"మిసెస్ రామనాథమ్! అలా చెప్పేస్తే ఆవిడకు తెలుస్తుంది" అలా అంటుంటే ఆవిడ ముఖం వాడిపోవడం నేను గమనించాను.

ఆవిడ పైబెర్తు మీదికి వెళ్లి పడుకున్నారు.

బ్లూ బెడ్‌లైట్ సన్నని కాంతిలో మెత్తని రగ్గు కప్పుకుని నేను కూడా నిద్రలోకి జారుకున్నాను.

మేము తెల్లవారాక ఎక్కువ మాట్లాడుకోలేదు.

చెన్నై సమీపిస్తోంది.

సామానులన్నీ సర్దుకుని రెడీగా ఉన్నాం! ఆవిడ నా అడ్రస్సు అడగలేదు. నేను ఆవిడనీ అడగలేదు.

స్టేషన్ రాగానే–

"వస్తానండీ!" అంటూ ఆవిడ భర్త వెంట సామానుతో నడిచింది.

సామాను తీసుకుని నేను దిగాను.

తర్వాత ఆవిడ నాకు అప్పుడప్పుడు ఎందుకో జ్ఞాపకం వస్తూనే వుంది.

మా ఇద్దరి మధ్యా జరిగిన సంభాషణాప్రభావం కాబోలు... "ఆవిడ పేరు మిసెస్ రామనాథమ్!" అన్నప్పుడు ఎందుకు ఆవిడ ముఖం వాడిందో! ఆవిడకు అసలు పేరు ఉండాలి కదా! ఎందుకు చెప్పలేదు?

ఈ ప్రశ్నలకు మాత్రం ఎంత ఆలోచించినా సమాధానం దొరకలేదు. తర్వాత ఆ విషయాన్ని నేను అంతగా ఆలోచించలేదు.

ఫంక్షన్ ఓ రోజుందనగా... మిసెస్ రామనాథమ్ ఆహ్వాన పత్రికలతోపాటు సెక్రెటరీని కూడా వెంటబెట్టుకుని నా దగ్గరకు వచ్చారు.

వాళ్ళుండగానే ఆహ్వాన పత్రికలు కవర్లోంచి తీసి చూశాను. కింద పేర్లు చూసి నాకు ఆశ్చర్యం కలిగింది.

"ఇదేమిటండీ... మీరు ఇంత మంచిపేరు పెట్టుకుని ఆరోజు నాకెందుకు చెప్పలేదు?" ఆశ్చర్యం, కోపం మిళితమైన స్వరంతో అడిగాను.

"ఆ పేరు వాడుకలో లేనప్పుడు చెప్పడం దేనికి? చెప్పినా ఎవరికర్థమవుతుంది? అందుకే చెప్పలేదు."

"అంటే..?" ఆవిడ మాటలు అర్థంకాక అడిగాను.

"మా తల్లిదండ్రులు 'చందన' అని ఎంతో అందమైన, మృదువైన పేరు పెట్టారు. అందరూ నన్నీ పేరుతో పిలుస్తుంటే నా ఒంటినిండా చందనం పరిమళిస్తున్నట్టు అనిపించేది. పెళ్ళై అత్తవారింటికి వచ్చాక మా అత్తింట్లో అందరూ 'ఏమే, ఒసే, కోడలుపిల్లా...' ఇవే పేర్లు ఖాయం చేశారు. మావారు కొత్తలో 'చందనా' అని పిలిస్తే మురిసిపోయాను. తర్వాత ఆయన కూడా ఏ గూటిచిలక ఆ గూటి పలుకే పలుకుతుందన్నట్టు– 'ఏమి, ఒసే, మొద్దూ, ఏమోయ్...' అంటూ అలవాటు చేసుకున్నారు. ఊళ్లో అందరూ మిసెస్ రామనాథమే సార్థకం చేశారు. నా పేరు వాడుకలోంచి పోయింది. నేనే కాదు, మా క్వార్టర్స్‌లో అందరి పేర్లూ అంతే! ఈవిడ మా సెక్రెటరీ! ఈవిడ 'మిసెస్ రావు!" అంది. అలా చెబుతుంటే ఆవిడ కళ్ళల్లో నీళ్లు తిరిగాయి.

"మరిప్పుడెందుకు మీ పేర్లు వేసుకున్నారు?"

"క్వార్టర్స్‌లోకి ఎంతోమంది కొత్తవాళ్లు వచ్చారు. కనీసం వాళ్ళకైనా మా అసలు

పేర్లు తెలుస్తాయని! పైగా... పిల్లలు కూడా 'నీ పేరేమిటమ్మా?' అంటూ రోజూ ప్రాణం తీస్తున్నారు."

"అందుకని... ఇన్నాళ్లు ఈ ధైర్యం ఎందుకు చెయ్యలేకపోయారు?"

"అవకాశం రాలేదు! ఇప్పుడు మేము కాస్త పదవుల్లో ఉన్నాం కదా... అవకాశం వచ్చింది!"

"దేనికైనా ధైర్యం చెయ్యాలి! ఇప్పటికైనా ఆ పని చేశారు... సంతోషం! ఇంక వెళ్లి రండి!" అన్నాను వాళ్ళ భుజాలు తట్టి.

"నమస్తే మేడమ్..!" అంటూ ఇద్దరూ బయలుదేరి వెళ్లారు. ఇప్పుడు నాకు వాళ్ళ బాధ పూర్తిగా అర్థమయింది.

ఆరోజు ఆలస్యం కాకుండా సమయానికి ఫంక్షన్ హాలు చేరుకున్నాను.

అప్పటికే క్వార్టర్స్‌లోని జనంతో హాలంతా నిండిపోయింది. ఆ క్లబ్‌కి ఎంతో సహాయం చేస్తున్న 'రజనీ' గారు సభకు అధ్యక్షత వహించారు.

"మిసెస్ రామనాథంగారు, మిసెస్ రావుగారు చాలా పట్టుదల, తెలివిగలవారు. ఎంతో కృషి చేసి ఈ క్లబ్ నడుపుతూ ఇంత పైకి తీసుకువచ్చారు? మిసెస్ రామనాథమ్, మిసెస్ రావుల మూలంగానే అనాధాశ్రమం, కేర్‌సెంటర్ ఎంతో జాగ్రత్తగా చూస్తున్నాం" అంటూ మాటకు ముందు వారి పేర్లను పొగుడుతూనే ఉన్నారు.

స్త్రీలంతా పళ్లు నూరుకుంటున్నారు. మిగతావారు పట్టించుకున్నట్టే లేదు. ఎవరి గోలలు వారివి!

తర్వాత నన్ను మాట్లాడమన్నారు.

నేను మైక్ దగ్గరకు వచ్చాను–

"ఈగ ఇల్లలుక్కుంటూ పేరు మర్చిపోయిందట. అలాగే పెళ్ళై ఈ క్వార్టర్స్‌కు వచ్చిన ఆడవాళ్ళంతా వారి పేర్లు వారే మర్చిపోయారు. ఊళ్లోవాళ్ళకి వాళ్ళ భర్తపేర్లే వారి పేర్లు! తల్లిదండ్రులు ఎంతో ముద్దుగా 'చందనా' అని పేరు పెడితే భర్త, అత్త, ఆడబిడ్డా ఆపేర్లతో పిలిస్తే ఎంత బాగుంటుందో చెప్పండి? ఏమైనా డబ్బు ఖర్చా? పరువు నష్టమా? నేనడం కాదు... మీరే చెప్పండి? ఊళ్ళోవాళ్ళంతా ఆమె పేరును తీసేసి భర్త పేరే ఆమెకు ఖాయం చేస్తే ఎలాగండీ? అది తారుమారై భర్త పేరుకు బదులు భార్య పేరు తగిలిస్తే ఎంత అసహజంగా ఉంటుంది? కనీసం ఇంట్లో పెంచే కుక్కలకి, పిల్లులకి కూడా పేర్లు పెట్టుకుని ముద్దుగా పిలుచుకుంటాం! మొన్న హైదరాబాద్ జూలో చనిపోయిన పులిపిల్ల 'సాకీ' పేరు తెలియని వారున్నారా? స్త్రీలని ఉద్ధరించాలంటే ముందు వారిపేర్లతో వాళ్ళని

బతకనీయండి. మీకిదే నా ప్రార్ధన!" నా ఉపన్యాసం ముగించాను.

హాలంతా చప్పట్లతో ప్రతిధ్వనించింది.

చందన, సుందర్‌ల ముఖాలు దివిటీల్లా వెలిగాయి.

కొత్తగా క్వార్టర్స్‌లోకి వచ్చిన ఆడవాళ్ళందరూ వచ్చి "మమ్మల్ని ముందే హెచ్చరించినందుకు చాలా సంతోషమండీ!" అన్నారు.

"మా అమ్మ చందన, చందన..." అంటూ ఆ తల్లిని పిల్లలు చుట్టుముట్టారు.

ఆ మహిళ నవ్వుతో నా హృదయం స్వర్ణ కమలమయింది.

ఎప్పుడైనా "మిసెస్ రామనాథమ్!" గుర్తుకు రాగానే నవ్వుకుంటూనే ఉన్నాను.



- *'ఆంధ్రజ్యోతి'* వార పత్రిక... 10 నవంబర్, 2000

# చుక్క



ఆ రోజు జనరల్ కంపార్టుమెంటు మరింత రద్దీగా ఉంది.

చంకలో చంటిపిల్ల గుక్కపట్టి ఏడుస్తుంటే, చుక్క బలవంతంగా రైలెక్కి జనాన్ని తోసుకుని ఒకచోట కూర్చోగలిగింది. రైలు ఎక్కుతుంటే ఆమె నెత్తి మీది మూట అందుకున్న వారెవరో తిరిగి ఆ మూట తెచ్చి ఆమె పక్కనే పడేశారు.

ఎవరో వెంటపడి తరుముతున్నట్టు ఆమె గుండె అంతసేపు వేగంగా కొట్టుకుంటూనే ఉంది. రైలు కదిలి స్టేషన్ దాటగానే ఆమె గుండె కుదుటపడింది.

"జర కూసంత నీరైనా తాగిపించవే! సన్న పానం గుటుక్కుమంటదే!" చంటిపిల్ల ఏడుపు వినలేక చుక్క పిన్నత్త హెచ్చరించింది.

"అట్టగే..!" అంటూ చుక్క పక్కనే ఉన్న గోనెమూట విప్పి సగం విరిగిన ఓ పింగాణీ కప్పు తీసింది. తాగిద్దామంటే నీళ్లు లేవు.

చుక్క మనస్సు చివుక్కుమంది. పిల్ల ఏడుపుతో గుండె గుభిల్లుమంది. ఏమీ చెయ్యలేని అయోమయంలో అందరి వైపు జాలిగా చూసింది.

సీటు మీద కూర్చున్న ఒకామె చుక్కమ్మ బాధ అర్థంచేసుకుంది. పైగా... ఆ చంటిపిల్ల ఏడుపుకు గల కారణం కూడా గ్రహించింది.

"కాసిని నీళ్లు పట్టమ్మా!" అంటూ పక్కనే ఉన్న నీళ్ల సీసా అందించింది.

పెద్దనిధి దొరికినంత సంబరపడింది చుక్క.

ఎవరైనా లాగేసుకుంటారేమోనన్నంత కంగారుగా ఆవిడ చేతిలోని సీసా అందుకుని నీళ్లు కప్పులోకి వంపింది. రైలు వేగానికి నీళ్లు కప్పులో కంటే... అటు ఇటు నీళ్లు తుళ్ళుతున్నాయి. పైగా... కంగారువల్ల చెయ్యి కూడా వణుకుతోంది. దాని మూలంగా నీళ్లు కప్పులో పడటమే లేదు.

అయినా కప్పులో పడిన గుక్కెడు నీళ్లు ఏడుస్తున్న పిల్లనోటి కందించింది.

ఆ పిల్ల నీరు తాగలేదు సరికదా... చేత్తో కప్పు తోసేసింది. ఆ గుక్కెడు నీళ్లూ నేలపాలయ్యాయి. ఏడ్చి ఏడ్చి పిల్ల గొంతు బొంగురుపోతోంది. ఎవరో బిస్కట్టు పెట్టమని ఓ రెండు బిస్కట్లు అందించారు.

ఆ పిల్ల వాటినీ తోసేసింది.

"తల్లివి కాయే? ఆ మాత్రం తెల్వదాయే? పాలు నోట్లో పెట్టయే! అదే ఏడుపు సాలిత్తది!" ఓ పెద్దామె సలహా ఇచ్చింది.

"పాలు ఎప్పుడో ఎండిపోయినాయి. సంటిది తాగుతుంటనే తల్లి దగ్గర పాలుంటయి! ఈరికెలా సెప్పేది పాలు లేవని!" చుక్క మనసులోనే మథనపడింది. అయినా... పమిటకొంగు భుజాల మీదికి కప్పుకుని చనుకట్టు ఆ పిల్లనోటి కందించాలని ప్రయత్నించింది!

ఆ పిల్ల చేత్తో అదీ తోసేసింది. తల పవిట చాటుకు వెళ్లనే లేదు. తల వెనుకకు వాల్చి ఆ పిల్ల మరింత గట్టిగా ఏడవడం మొదలుపెట్టింది.

"ఎక్కడనుంచైనా ఎత్తుకొచ్చిన బాపతా? అసలు నీ కూతురేనా? నిజం చెప్పు" అప్పుడే అక్కడకు వచ్చిన టికెట్టు కలక్టరు అనుమానంతో బెదిరించి అడిగాడు.

"అసోంటిదాన్ని కాదు బాబా! నా బిడ్డనే! నా పిన్నత్త నదుగు బాబా!" అంటూనే ఆ పిల్లను మరింత గట్టిగా పట్టుకుంది. ఆ పిల్లను ఎవరైనా లాక్కుపోతారేమోనన్న భయం ఆమె చూపుల్లో కదలాడుతోంది.

"ఏందయ్యా అది..? ఆ బిడ్డ ఆమె బిడ్డనేనయ్యా! ఆమె అసుంటిది కాదయ్యా!" అంది ఆ పిన్నత్త.

"ఆ గౌనేమిటి? మీరు పిల్లలకు అటువంటి గౌనులే వేస్తారా?" తిరిగి టికెట్టు కలెక్టరు ప్రశ్నించాడు.

"ఓ అమ్మాయింట్లో పనిసేత్తే ఈ అంగీ ఇచ్చింది! నీ కాలు మొక్కుతా బాబా?" అంది చుక్క దీనంగా.

"అవునయ్యా!" అంటూ పిన్నత్త వంత పలికింది.

అంతలో చంటిపిల్ల ఏడుపు ఆగిపోయింది.

కళ్ళు తేలేసింది. కాళ్ళు చేతులు నిలేసింది. వంట్లో ప్రాణంలేని బొమ్మలా అయిన ఆ పిల్లను చూసి చుక్క కెవ్వమంది.

"అదేందే... అలా అయిపోనాదీ?" అంటూ చుక్కతో అక్కడున్న ఆడవాళ్ళు, వారితో పాటు టికెట్టు కలెక్టరు కూడా కంగారుపడ్డాడు.

ఆడ, మగ పిల్లలు చుట్టుముట్టారు.

టికెట్టు కలెక్టరు వారిని అటు ఇటు జరగమని, పిల్ల చెయ్యి పట్టుకు చూశాడు. చేతిలో నాడి సన్నగా కొట్టుకుంటూనే ఉంది. పిల్లను పట్టుకుని చుక్క వెక్కివెక్కి ఏడవడం మొదలుపెట్టింది.

"ఉండవమ్మా... ఏడుపు ఆపు!" అంటూ అతను పిల్ల ముఖం మీద నీళ్లు జల్లాడు. మెల్లిగా చంటిపిల్ల కాళ్ళు, చేతులు కదిలాయి.

"అలా ఏడుస్తూ కూర్చుంటే పిల్ల బతుకుతుందా? ఎలాగో అలాగ కాసిని నీళ్లు తాగించు" అంటూ కసురుకున్నాడు.

ఈసారి చుక్క తిరిగి ఆ పింగాణీ కప్పులో నీళ్లు పోసి పిల్ల నోరు తెరిచి నోట్లో పోసింది. చంటిపిల్ల నెమ్మదిగా చప్పరించడం మొదలు పెట్టింది. మెల్లిగా అరకప్పు నీళ్లు తాగగలిగింది. పిల్ల ముఖంలో జీవకళ కదలాడింది.

చుక్క మనస్సు కాస్త కుదుట పడింది.

ఏదో స్టేషన్ రాగానే టికెట్టు కలెక్టరు దిగి ఓ గ్లాసుడు పాలు తెప్పించి ఇచ్చాడు. చుక్క పాలగ్లాసు అందుకుని పిల్లనోట్లో పోయడం మొదలుపెట్టింది.

ఆకలితో నకనకలాడుతున్న ఆ పిల్ల మూతలు పడ్డ కళ్ళతోనే గ్లాసుడు పాలు తాగేసింది. చుక్కతోపాటు అందరూ ఆశ్చర్యంగా పిల్లవైపు చూశారు. ఏ ప్రాణైనా పుట్టగానే ప్రపంచం తెలియకపోయినా ఏడవడం తెలుస్తుంది, ఆకలి తెలుస్తుంది. చుక్క మనస్సు మరికాస్త కుదుటపడింది.

మెల్లిగా రైలు కదిలింది.

టికెట్టు కలెక్టరు మరో కంపార్టుమెంటు ఎక్కినట్టున్నాడు. ఈ కంపార్టుమెంటులోకి రాలేదు. చుక్క మగడు ఎక్కడనుంచో పరుగెత్తుకుంటూ వచ్చి చుక్క పక్కన చతికిలపడ్డాడు.

"ఏందిరా? ఏడబోయినావురా?" పినతల్లి సిన్ని అడిగింది.

చుక్క మాత్రం మగని వైపు కోపంగా చూసింది. అడగవలసిన ప్రశ్నలన్నీ ఆ చూపుల్లోనే గంగడికి కనిపించాయి. అతనికి అంతా అయోమయంగా అనిపించింది.

"ఏమయిందే పిన్నీ!" అంటూ పినతల్లిని అడిగాడు.

జరిగినదంతా వివరించింది ఆమె.

"అయ్యో! అంతపని జరిగినాదా? నేనేమి సేసేది..? మందిని నెట్టుకుంటూ రైలు ఎక్కలేకపోయినా. రైలు కదలినాది.. సివరు డబ్బాలో ఎక్కేసినా? రైలు ఆగిందో, లేదో ఈడ కొచ్చినా?" అంటూ చుక్క వైపు చూశాడు.

ఆ చూపుల్లో జాలి ఉంది. చుక్కకు అతన్ని చూడగానే జాలేసింది. చుక్క కళ్లలో నీళ్లు తిరిగాయి. చంటిపిల్ల మీద పడకుండా కళ్లు ఒత్తుకుంది. పిల్లను గుండెలకు హత్తుకుని నుదుటి మీద ముద్దుపెట్టుకుంది.

"ఈ బిడ్డ నాబిడ్డే?" చుక్క వెక్కివెక్కి ఏడ్చింది.

"నువ్వేడిస్తే నే సూడలేనే! సుక్కా... ఏడవబోకే?! నువ్వేడిత్తే నాకూ ఏడుపొత్తదే?' అంటూ గంగడు చుక్క కన్నీళ్లు తన పైగుడ్డతో వత్తాడు. చుక్కకు ఏదో గుర్తొచ్చినట్లు కంగారుగా గోనెమూట విప్పింది. అందులోనుంచి పిల్లకు ఓ గౌను తీసింది.

"దిక్కుమాలినోళ్ళు... మళ్లీ ఎవరొత్తరో?" అంటూ పిల్లకు తొడిగిన తెల్లగౌను తీసి పసుపు ఎరుపు రంగులలో గవ్వలు కుట్టిన ఆ గౌను తొడిగింది. అదే రంగులున్న కుచ్చు టోపీ పెట్టింది. కాళ్లకున్న వెండిపట్టీలు విప్పి ఆ తెల్లగౌనుతోపాటు ఆ సంచిలోకి తోసి తిరిగి మూటకట్టింది.

"ఏంటే ఇదంతా? ఎవరొత్తరే?" అదంతా అర్థంగాని గంగడు అడిగాడు.

"ఆ టిక్కెట్టాయన అన్నీ అడిగిందు కదా! మల్లా ఇంకొకాయనొత్తే తిరిగి అడుగుతుందుగదా!" అన్న చుక్క వివరణ వినగానే– "నిజమే మల్లా!" అన్నాడు గంగడు.

చుక్క పిల్లను మరోసారి చూసుకుంది. ఆమె మనస్సు గతం వెంట కదిలింది.

చుక్క, గంగడు మహబూబ్‌నగర్‌లో ఉండగానే పెళ్ళయింది.

లంబాడీ తండాలో అందరితోపాటు ఇళ్లు కట్టేపని చేసుకునే వారు. కట్టే ఇళ్లకు కాస్త దూరంలోనే వాళ్ళ గుడిసెలుండేవి. గుడిసె అంటే అదో చిన్న తడికెలగూడు. తడికె మీద వాన కురిస్తే లోపలికి నీరు దిగకుండా ఓ ప్లాస్టిక్ కవరు. వంగుని లోపలకి వెళ్లి కూచోవాలి తప్ప- నుంచునే ఎత్తుండదు. అదే పడక గది, అదే హాలు, అన్నీ అదే! పిల్లలు పుట్టేది, పెరిగేది అందులోనే. బయట కలోగంజో కాచుకుని జీవితాలు వెళ్ళబుచ్చుతారు.

కానీ, కొందరు లంబాడీలకు పక్కా ఇళ్లు, భూములు కూడా ఉన్నాయి. ఈ తండాలో ఎవరికీ అంతటి సంపాదన లేదు. అక్కడ పనైపోతే కాంట్రాక్టరు వెంబడి పొట్ట చేత పట్టి బయలుదేరవలసిందే! అదీ వారి జీవనగమ్యం.

ఆ వరుసలోనే వారు కాంట్రాక్టరు వెంట సికింద్రాబాదు చేరుకున్నారు!

అంతస్తుల భవనాలు కట్టాలి. పని చాలాకాలం నడుస్తుందని అందరూ మురిసిపోయారు. అక్కడికి దగ్గరలోనే ఆ స్థలానికి ఎదురుగా అందరూ తమ గుడిసెలు వేసుకున్నారు. ఒక్కపూట పని చెయ్యకపోతే తిండి గడవని బతుకులవి. అయినా మమతలు, మమకారాలు వారిని వెంటాడుతూనే ఉంటాయి. కోరికలు బుసలు కొడుతూనే ఉంటాయి. వాటిని గుండెల్లోనే కుదేసుకుని బతుకుతారు.

పెళ్ళై నాలుగు వసంతాలు గడిచిపోయాయి.

చుక్క ఏ చంటిపిల్ల కంటపడినా ఎత్తుకుని ముద్దు చేస్తోంది. తన వడిలోకి అటువంటి చంటిపిల్ల ఎప్పుడు వస్తుందా అని మురిసిపోతోంది.

కాలం గడుస్తోంది.

ఆమెకు కడుపులో తిప్పడం, వికారం ప్రారంభమయ్యాయి, పుల్లని రుచి కోసం నాలుక తంటాలుపడుతోంది. మామిడి పిందె కనబడితే పరుగులు పెడుతోంది. చుక్కలోని కొత్త నలతని ఆమె పిన్నత్త ఇట్టే గ్రహించింది.

"రాయే! సుక్కా! ఆసుపటాలికి పోదారి" అంటూ ఆమె చుక్కను వెంటపెట్టుకుని దవాఖానాకి బయలుదేరింది.

మొన్నటివరకు వారికి ఆసుపత్రికి వెళ్లి లేడీడాక్టరుకి చూపించుకోవాలని, పురుడు అక్కడే పోసుకోవచ్చని తెలియదు. ఇప్పుడు వారికి కూడా కొన్ని విషయాలు తెలుస్తున్నాయి. ఆ అవకాశాలను ఉపయోగించుకోవడానికి ప్రయత్నిస్తున్నారు. ఆసుపత్రి మెట్ల మీద మిట్ట మధ్యాహ్నం వరకు అలా పడిగాపులు పడి కూర్చున్నారు.

పొద్దు ఓ పక్కకు వాలుతుంటే లేడీ డాక్టరున్న గదిలోకి అత్తా, కోడలు వెళ్ల గలిగారు.

ఆవిడ చుక్కను పరీక్ష చేసి మూడవ మాసమని చెప్పింది.

చుక్క మనస్సు సంతోషంతో రెపరెపలాడింది. ఆ లేడీ డాక్టరు బలానికి కొన్ని మందులిచ్చి, గర్భిణీ స్త్రీలు తీసుకొనవలసిన జాగ్రత్తలు చెప్పి, పైగా– అలా చేస్తే పండంటి బిడ్డ పుడతాడని మరీ తెలియజేసింది.

చుక్క మనసులో ఏవో కొత్త కోరికలు అడ్డదిడ్డంగా అల్లుకున్నాయి. శరీరంలో ఏవో కొత్త పులకింతలతో అత్త వెంట ఇల్లు చేరుకుంది. ఆరాత్రి సిగ్గు దొంతరలలో మగనికి ఆ విషయం చెప్పి అతని వొడిలో వాలిపోయింది.

నెలలు నిండే వరకు చుక్క గంపనెత్తిన పెట్టి కూలిపని చేస్తూనే ఉంది.

ఆరోజు సాయంకాలం చుక్కకి నొప్పులు ప్రారంభమయ్యాయి. గంగడు, పిన్నత్త కలిసి ఆమెను ఆసుపత్రికి తీసుకువెళ్లారు.

వెళ్లిన రెండు గంటల్లోనే నొప్పులు ఎక్కువై చుక్కలాంటి ఆడపిల్ల పుట్టింది.

చుక్కది ఛామనచాయ రంగే అయినా పల్చటి బుగ్గలలో, నూ పువ్వులాంటి ముక్కులో, చారడేసి కళ్లతో, నొక్కుల జుట్టుతో కళకళలాడుతూ ఉంటుంది. చంటిపిల్లకూడా అవే రూపురేఖలతో చూడముచ్చటగా ఉంది.

పడకలు ఖాళీ లేక చుక్కని వరండాలో నేల మీద పరుపులేసి పడుకోపెట్టారు. చుక్కేకాదు.., ఆ వరండాలో చుక్కలాంటి బాలింతలు ఎందరో పడుకుని ఉన్నారు, వారికి అంత కాంతి ఎందుకని కాబోలు అక్కడి లైట్లు కూడా తక్కువ కాంతినీ అందిస్తున్నాయి.

ఆ నీడలోనే గంగడు పసిబిడ్డను చూసి మురిసిపోయాడు.

ఆసుపత్రిలో రాత్రివేళ మగవారిని ఉండనివ్వరు. గంగడు, భార్యాబిడ్డలను వదలలేక కొంపకి తిరిగి వెళ్లిపోయాడు.

ఆ బాలింత పక్కనే పిన్నత్త నడుం వాల్చింది. పగలల్లా కష్టించి పని చేసిన వారందరికి మత్తు నిద్ర ఆవరించింది. రాత్రి కళ్ళు తెరచిన కీచురాళ్ళు ఒకటే రొద చేస్తున్నాయి.

అర్ధరాత్రి దాటింది.

అందరూ గాఢనిద్రలో ఉన్నారు. అంత నిద్రలోనూ చుక్క కొత్త మమకారం కడుపులో ఇమిడి గుండెలు కుదుపుతుంటే చంటిగుడ్డును గుండెలకు హత్తుకుని మరీ పడుకుంది.

అంతలో... ఎవరో వచ్చి చంటిగుడ్డును చుట్టిన చుక్క చేతులను పక్కకు తొలగించి బిడ్డను అందుకుని పరుగెత్తుకుపోతున్నారు.

ఎవరో తట్టిలేపినట్టుగా చుక్క ఉలిక్కిపడి లేచింది.

నిజంగానే పక్కలో చంటిబిడ్డ లేదు.

"నా బిడ్డో..." అంటూ కెవ్వున అరిచింది. మొదట పిన్నత్త ఆపై వరండాలో పడుకున్న అందరూ లేచారు.

చుక్క పక్కన చంటిబిడ్డ లేదు. ఆ విషయం అందరినీ కలచివేసింది. అందరూ ఎవరికి తోచిన విధంగా వారు అటుఇటు పరుగులెట్టారు. కాపలా వ్యక్తి టార్చిలైటు చేతపట్టి మరీ వెతకడం మొదలుపెట్టాడు. వేసిన గేటు వేసినట్టే ఉందనుకున్నారు. కాని, గేటు తీసి ఉంది. అందరూ అటు వెళ్లారు.

దూరంగా ఒక అడ మనిషి చేతిలో చంటిపిల్లతో పరిగెత్తడం అందరూ చూశారు. ఆమెను మాత్రం పట్టుకోలేకపోయారు.

చుక్క "నా బిడ్డో!నా బిడ్డో!!" అంటూ గుండెలు బాదుకుని ఏడుస్తోంది.

అంతలో... పోలీసులు, ఆసుపత్రి అధికారులు అక్కడకు వచ్చారు. పోలీసులు చుక్కతో పాటు అందరినీ వివరాలు అడిగారు.

"నీ ముఖానికి ఇంత చక్కటి బిడ్డ ఎందుకే? తిండి పెట్టగలవా? గుడ్డ ఇవ్వగలవా?" అన్న ఆయా మాటలు చుక్క చెవుల్లో గింగురుమన్నాయి. చుక్క ఆ విషయం పోలీసులకి చెప్పింది. పైగా... 'ఆ ఆయా నా బిడ్డనెత్తుకు పోయిం'దనే వెక్కివెక్కి ఏడుస్తూ చెప్పింది.

డ్యూటీలో ఉండవలసిన ఆయా ఎక్కడ వెతికినా కనబడలేదు. అక్కడున్న వారికే కాదు, పోలీసులకీ అనుమానమొచ్చింది.

"ఆమె ఎక్కడున్నా వెతికి పట్టుకుంటాం. నీ బిడ్డను నీకు అప్పచెప్పే పూచీ మాది!" అంటూ అక్కడకు వచ్చిన అధికారులు, పోలీసులు చుక్కకు ధైర్యం చెప్పి అక్కడనుంచి వెళ్లిపోయారు.

మరునాడే పుట్టెడు దు:ఖంతో చుక్క ఆసుపత్రి నుంచి గూటికి చేరుకుంది. మధ్య, మధ్యలో వీలు చిక్కినప్పుడల్లా ఆసుపత్రికి, పోలీసుస్టేషన్‌కి చుక్క మగనితో పాటు ప్రదక్షిణాలు చేస్తూనే ఉంది. పిల్ల జాడ మాత్రం దొరకలేదు.

కాలచక్రం తిరుగుతూనే ఉంది. సంవత్సరం ఇట్టే తిరిగి వచ్చింది.

సికింద్రాబాదులో ఇళ్లు కట్టడం పూర్తయింది. హైదరాబాదు మూసారాంబాగ్‌లో పనుందని కాంట్రాక్టరు చెప్పడంతో లంబాడీ కుటుంబాలన్నీ అక్కడకు చేరుకున్నాయి.

చుక్క గంగడుల మనసంతా సికింద్రాబాదు మీదే ఉన్నా వారు అందరితో పాటు ఆ ప్రాంతం వదలక తప్పలేదు.

"ఓ పిన్నత్తా! లస్కర్‌కాడికి పోయి సూసివత్తమే! బిడ్డ ఏడైన కంటపడతదే!" అంది ఓరోజు చుక్క బాధగా.

"ఏందే? ఎర్రిదానా? ఏడాది పిల్లనేడ గుర్తుపడతవే? పోరి నెత్తుకుపోయినోళ్ళు ఆడనే ఎందుకుంటరే? ఏడనైనా పోయి బతుకుతారే? ఈడైన కంటపడతరే? అయినా... ఇగ నీకుండాలె రాత!" అంది పిన్నత్త అనుభవంతో.

పిన్నత్త మాటల్లో నిజముందని తెలిసినా చుక్క ఆశ చావలేదు. బిడ్డ కోసం అలా వెతుకుతూనే ఉంది.

ఒకరోజు పని ముగించుకుని గూటికి చేరాలని పోతుంటే అటే వస్తున్న ఆయా కంటపడింది. చుక్క ఆమెను ఇట్టే గుర్తుపట్టింది.

పక్కనున్న మగనితో ఆ సంగతి చెప్పింది.

గంగడు పక్కనున్న పిన్నమ్మతో ఆ విషయం చెప్పాడు. ముగ్గురి గుండెలు వేగంగా కొట్టుకుంటుంటే ఆమెను అనుసరించడం మొదలుపెట్టారు. ఆమె కంటపడకుండా ఆమెను ఇంటి వరకు వెంబడించారు.

ఆయా తలుపు తట్టగానే ఒకామె తలుపు తీసింది. ఆమె చేతిలోని పిల్ల ఆయా మీద వాలిపోయింది. ఆయా ఆ పిల్లను ముద్దు పెట్టుకుని భుజాన వేసుకుంది.

"ఓ పిన్నత్తా! నా బిడ్డనేనే? సూడవే?" చుక్క గుండెలు బాదుకుంటూ చెప్పింది.

"గొడవ సెయ్యబోకే? ఈడ మనమున్నమని సూసినాదంటే బిడ్డ మరి మన కంటబడకుండా ఏడనో దాసేత్తదే?" ఆమె మాటలకి భయపడి చుక్క మరి నోరు మెదపలేదు. అయినా... ఏడుపు ఆగలేదు. కట్టలు తెగిన నదిలా ప్రవహిస్తూనే ఉంది.

"సీకటయినాది! పోయి మల్లీ వద్దారి?" ఆమె ఇద్దర్నీ తొందరచేసింది.

ముగ్గురూ తిరుగుముఖం పట్టారు. వాళ్ళు ఆయా ఇంటి మీద ఓ కన్నేసి ఉంచారు. ఆమె ఎప్పుడు ఇల్లు చేరేదీ, ఎప్పుడు ఇల్లు వదిలేదీ అన్నీ తెలుసుకున్నారు. సమయంకోసం ఎదురుచూడ్డం మొదలుపెట్టారు.

ఆరోజుతో ముసారాంబాగ్‌లో పని కూడా పూర్తయింది! కొన్నాళ్లు తిరిగి మహబూబ్‌నగర్‌లోనే ఉండవలసి వచ్చింది. అందరూ వేసుకున్న గుడిసెలు పీకి మూటలు కట్టారు. సామానులు మరో మూటలో సర్దారు. అందరూ అడ్డదారిన కాచిగూడ స్టేషన్‌కి బయలుదేరారు.

చుక్కా, గంగడు మాత్రం వీరి వెంట లేరు. ఆయా ఇంటి వైపు కదిలారు. ఆడుకుంటూన్న చంటిపిల్లను చంకనేసుకుని ఆయా ఇల్లు దాటి పరిగెత్తారు. రైలు కదిలే సమయానికి కాచిగూడ స్టేషన్ చేరుకున్నారు. ఆ స్టేషన్‌లోని రణగొణ ధ్వనికి నిద్రపోతున్న చంటిపిల్ల కెవ్వున అరిచి ఏడుపు మొదలుపెట్టింది. ఆ ఏడుపుతోనే చుక్క రైలు ఎక్కింది.

రైలు కీచుమంటూ ఆగడంతో చుక్క ఉలిక్కిపడి ప్రస్తుతంలోకి వచ్చింది. జరిగినదంతా ఒక కలలా అనిపించింది.

"ఏదైనా నా బిడ్డ నాకు దొరికింది... ఈ బిడ్డ నా బిడ్డే!" చుక్క చంటిపిల్లను గుండెలకు హత్తుకుంది.

"అలా కూకుండిపోయావేటి? రైలు కదులిద్ది? దిగు?దిగు!" పిన్నత్త తొందర చేసింది. చంటిపిల్లను చంక నెత్తుకుని, నెత్తిన మూటతో చుక్క కూడా రైలు దిగింది.

అందరూ గేటు దాటి ఊళ్లోకి వెళుతున్నారు.

చుక్క ఓ చెట్టు మొదట్లో కూర్చుండిపోయింది. గంగడికి చుక్క ప్రవర్తన అంతు పట్టలేదు అయినా... ఏం చెయ్యడానికీ తోచలేదు. తలమీద నున్న బరువు మూట పక్కన పడేసి గంగడు భార్య పక్కనే చతికిలపడ్డాడు. అప్పటికీ రాత్రి పది దాటింది. చుట్టూ చీకటి. అక్కడక్కడ కరెంటు దీపాలు ఆకాశంలోని చుక్కల్లా మిణుకు మిణుకుమంటున్నాయి.

"ఇదిగో! ఈ బిడ్డ మన బిడ్డే! సూసినావా?" అంది చుక్క.

" నేనేడ సూత్తినే? ఆయేల సీకట్లో సూసినా? ఈ యేల ఈ సీకట్లో సూత్తున్నానే?" అంటూ గంగడు పిల్లను ఒళ్లోకి తీసుకుని తనివితీరా ముద్దులు పెట్టుకుని భోరున ఏడ్చాడు.

"ఏడవబోక... మన బిడ్డ మన కాడికి సేరినాది? ఈ బిడ్డను మనం సాకగలమా! కడుపునిండా పాలు ఇవ్వలేము. కూడు పెట్టలేము. ఈ బిడ్డ తిండి లేక మనలాగే మాడిపోద్దేమీ? ఏడ్చి ఏడ్చి బిడ్డ గుటుక్కుమంటే ఏటి సేసేది?" చుక్క పిల్లను పట్టుకుని వలవలా ఏడ్చింది.

అంతలో ఏదో పాసింజరు బండి ఎదురువస్తోంది.

"అదిగో... ఆ బండి ఎక్కి తిరిగి పోదారి..!" అంటూ చుక్క పిల్లను చంక నేసుకుని రైలు వైపు వేగంగా అడుగువేసింది. ఆమె వెనకే బరువు మూటతో గంగడు నడిచాడు.

ఇద్దరు జనరల్ బోగి ఎక్కారు. ఈ రైలుకు అంత జనం లేరు. నిద్రపోతున్న చంటిపిల్లను తను కూర్చున్న బెంచీ మీద పక్కనే పడుకోపెట్టింది. మెళకువ లేకుండా నిద్రపోతున్న చంటి పిల్ల వైపు భయంగా చూసింది. ఊపిరి పీలుస్తుందో, లేదోనని ముక్కు దగ్గర వేలు పెట్టి చూసి ధైర్యంతో తాను ఊపిరి గట్టిగా పీల్చుకుంది.

ఇంకా వెలుగు బాగా రాలేదు. కాచిగూడా స్టేషన్‌లో రైలు ఆగింది. పిల్లను ఎత్తుకుని చుక్క కంగారుగా రైలు దిగింది. ఆమె ననుసరించాడు గంగడు.

"ఏడకి పోదారి?" గంగడు ఎటు వెళ్లాలో తెలియక అడిగాడు.

"ఇంకేడకి... ఆయా ఇంటికే?" చుక్క నిబ్బరంగా సమాధానమిచ్చింది.

"అదేటి? అంత కట్టపడినాక తిరిగి ఇదేటి?"

"ఏటి? ఆలోసన సెయి! ఈ బిడ్డను పెంచలేము! సదువు సెప్పించలేము. పండడానికి మెత్తటి పరుపు ఏడనుంచి తెచ్చేది? మనతో రాల్లు కొట్టి బతకాలా? ఆయా బాగా సూత్తది, సదువు సెప్పిత్తది! నీడ పట్టున పెంచుతాదీ! నడు నడు..." అంటూ మగనిని తొందరచేసింది.

బిడ్డకు తిరిగి తెల్లగౌను తొడిగి, కాళ్లకు గజ్జెల పట్టెలు పెట్టింది. ఆఖరిసారిగా తనివితీరా గుండెలకు హత్తుకుంది, గుండె బండరాయి చేసుకుంది. పిల్లను ఆయా ఇంటి ముందు పడుకోపెట్టి వెనుతిరిగింది.

కటిక నేల తగలగానే చంటిపిల్ల గుక్కపెట్టి ఏడుపు మొదలుపెట్టింది.

తల్లి పేగు కదిలి పిల్లను అందుకోవాలని రెండడుగులు వేసిన చుక్క ఆగిపోయింది. కర్తవ్యం కాళ్లకు సంకెళ్లు వేసింది. అలాగే చూస్తూ కొయ్యబొమ్మలా నిలబడిపోయింది.

ఆయా కాబోలు... తలుపు తీసుకువచ్చి ఏడుస్తున్న చంటిపిల్లను అందుకుంది. చుక్కకు కన్నీటిపొరల మధ్య ఏదీ కనబడలేదు.

కన్నపేగు నులుముతుంటే నడవలేని చుక్కను గంగడే పట్టుకుని ఆ ఇంటికి దూరంగా నడిపించాడు.



# కాలం వెంట మనిషి



"అయ్యో! అయ్యో! ఇదేం విడ్డూరం ! దమయంతి కోడలికి ఈ వేషాలేమిటమ్మా! ఆ రంగు పట్టుచీరలేమిటీ? ఆ నగలేమిటీ? ఎక్కడ, ఎలా ఉండాలో అలా ఉండాలి! ఆమాత్రం తెలీపోతే ఎలా?"

"ఆ పిల్లకేం తెలుసమ్మా? ఆ తల్లికి బుద్ధుండొద్దూ? కూతురికి ఆమాత్రం చెప్పకపోతే ఎలా?"

– కుంతలను చూసిన ఆడవారంతా ఏదో మాట అంటూనే ఉన్నారు.

"ఆ నవ్వులేమిటో.., ఆ పకపకలేమిటో.., కాస్త బుద్ధీ, జ్ఞానం ఉండవద్దమ్మా! కాస్త వినయం, విధేయతా ఆ తల్లి చెప్పొద్దా? పైగా- తగుదునమ్మా... అంటూ ఈ శుభకార్యానికి ఎందుకు ఆ కూతుర్ని వెంటబెట్టుకు వచ్చినట్టూ? ఇదే నా కూతురైతేనా... గదిలో పెట్టి తలుపుకి తాళం వేసేదాన్ని!"

కొందరు ఆడవాళ్లు కుంతలకు వినబడాలనే అన్నారు. కూతుర్ని చూసిన వాళ్ళంతా అలా తలోమాట అంటుంటే వినలేని ఈశ్వరీదేవి మనస్సు విలవిల్లాడింది.

'అది రానంటూనే ఉంది. బంధువుల మాట విని బలవంతాన తీసుకొచ్చినందుకు అవమానం బాగా జరిగింది!' అని పదేపదే అనుకుంది.

కూతురు ఆ మాటలు వింటే మరెంత బాధపడుతుందోనని భయపడింది.

కానీ, అంత పనీ జరిగింది. కుంతల చెవిన కూడా ఆ మాటలు పడ్డాయి. అవమానంతో కుంతల తల వంగిపోయింది. మనస్సు భరించలేని బాధతో గజగజా వణికింది. ఇంక అక్కడ కూర్చోలేక తడబడే అడుగులతో సామాను పెట్టుకున్న గదిలోకి వెళ్లిపోయింది. అక్కడ ఉన్న మంచం మీద పడుకుని వెక్కి వెక్కి ఏడవడం మొదలుపెట్టింది.

కూతురు వెంటే గదిలోకి వచ్చిన ఆ తల్లి- కూతుర్ని ఆ స్థితిలో చూసి కంగారుపడింది. పల్లెటూరి వారికి ఆచారాలు, కాస్త చాదస్తాలు కూడా ఎక్కువని ఆమెకు తెలుసు. కానీ, ఈరోజుల్లో కూడా ఇంకా అలాగే ఉంటారని ఆవిడ ఊహించుకోలేకపోయింది. తన దుఃఖాన్ని దిగమింగుకుని కూతుర్ని ఓదార్చడానికి ప్రయత్నించింది.

"అమ్మా! కుంతలా! ఇక్కడ ఇలాంటివన్నీ మామూలే! వారి మాటలు పట్టించుకుని ఏడుస్తావెందుకమ్మా! వారి మాటలు విననట్టే ఉండాలి! ఈ మనుషులే అంత! ముందు లేచి కూర్చోమ్మా!"

ఈశ్వరీదేవి కూతుర్ని బలవంతంగా లేపి, మంచంమీద కూర్చోపెట్టి కళ్ళు తుడిచింది. తన కళ్ళు తుడుచుకోవడమే మర్చిపోయింది.

ఆరాత్రి కుంతల గది వదిలి బయటకు రాలేదు. తల్లి ఎంత బతిమాలినా భోజనం కూడా చెయ్యలేదు. ఆ మంచం మీద అలాగే పడుకుని నిద్రపోయింది.

మరునాడు తెల్లవారకుండానే ఆ ఇంట్లో సందడి ప్రారంభమయింది.

కాంతిశర్మను వడక పెళ్లికొడుకుని చేస్తున్నారు. సన్నాయి మేళం అందరి హృదయాలనూ పులకింపజేస్తోంది. కొత్త ఉత్సాహాన్ని అందిస్తోంది.

కుంతల పిన్నత్తగారి కూతురు అంజని వచ్చి తొందరచేసింది. ఆమె బలవంతంతో కుంతలకు మనస్సులో భయంగా వున్నా, ముస్తాబై ఆమె వెంటే బయటకు వచ్చింది.

మెరూన్ పట్టుచీరలో, బంగారు నగలతో, పచ్చటి శరీరంతో కుంతల అందరినీ ఇట్టే ఆకర్షించింది. అంజని ఆమెను చేయిపట్టి తీసుకువచ్చి పేరంటాళ్ళందరూ కూర్చున్నచోట ఓ వారగా కూర్చోపెట్టింది. అంజని ఎవరో పిలవడంతో వెళ్లిపోయింది.

కుంతల పమిట భుజాల మీదుగా లాక్కుని ముడుచుపోయి కూర్చుంది. ఆమె ముఖంలో ఎక్కడా నవ్వు లేదు. ఆప్యాయంగా చూసే ఆ కళ్ళలో భయం తొంగిచూస్తోంది. ఆమెను చూసిన కొందరు మూతులు తిప్పుకున్నారు. వారిలో వారే చెవులు కొరుక్కున్నారు.

"అయ్యో! ఇంత బంగారుబొమ్మలా ఉన్న ఈ పిల్లకు ఈ రాతేమిటో? తోలుకింద రాత దొంగరాతంటారు. ఇదేనేమో?!" అనుకున్నారు. కుంతల అవేమీ గమనించే స్థితిలో లేదు. భయంభయంగా ఆమె మనసు కొట్టుమిట్టాడుతోంది.

తలకు చమురు పెట్టి సేవించిన ముత్తయిదువలు స్నానం చేయించి కాంతిశర్మను తీసుకువచ్చారు. ఆ పసుపు పీట మీద తిరిగి కూర్చోబెట్టారు. తెల్లని పంచె, కండువాతో, నుదుట ఎర్రని నామంతో ఆ పసుపు పీట మీద నవమన్మథునిలా వెలిగిపోతున్నాడు. కర్రరోలుతో పసుపుకొమ్మలు వేసి ముత్తయిదువులు పసుపు కొడుతున్నారు. కొందరు మంగళగీతాలు ఆలపిస్తున్నారు. అందరితోపాటే కుంతల మనస్సు కొత్త ఉత్సాహంతో గంతులు వేసింది. గతంలో జరిగిన అవమానాలన్నీ మరిచిపోయింది.

కాంతిశర్మ వైపు ఆసక్తిగా చూస్తోంది.

"ఆ పసుపు, కుంకుమ ఉన్న పళ్లెం అందుకోండమ్మా!" అన్న మాటలు కుంతలకు వినబడ్డాయి.

ఆమె తన పక్కనే వున్న ఆ వెండి పళ్ళాన్ని రెండు చేతులతో ఎత్తి ఆమెకు అందించబోయింది.

"అయ్యో! అయ్యో! నువ్వా?! ఆ పళ్లెంలో కుంకుమ, పసుపు ఉన్నాయి. నువ్వు ముట్టుకోకూడదని తెలియదా! అయినా... అందరిలో ఇక్కడ కూర్చున్నావెందుకు? దూరం జరుగు?" అంటూ ఆవిడ కుంతలను ఈసడింపుగా చూసింది.

ఆ చూపులో లోకంలోని అవమానాలన్నీ తెచ్చి కుంతల నెత్తిన గుమ్మరించి నట్లయింది. ఆవిడ విసురుగా కుంతల చేతిలోని ఆ వెండి పళ్ళాన్ని లాక్కుని విసవిసా ముందుకు వెళ్లిపోయింది.

ఆ అవమానం కుంతల భరించలేకపోయింది. కళ్ళల్లో నీళ్లు తిరిగాయి. గాలి తీసిన బెలూనులా ఆమె ముఖం ముడుచుకుపోయింది. ఒక్కక్షణం ఇంక అక్కడ ఉండలేక లేచి గదిలోకి వెళ్లిపోయింది. ఆ గది ఒక్కటే ఆమెకు ఆ ఊళ్ళో శరణ్యంలా అనిపించింది.

నోరున్న ఆ మనుష్యుల కంటే నోరులేని ఆ గదే నయమనుకుంది. కాంతిశర్మకు కూడా ఆవిడ మాటలు వినబడ్డాయి. గదిలోకి వెడుతున్న ఓ మెరుపు తీగలా కుంతల అతని కంటబడింది.

'ఇంత చక్కటి బొమ్మకు ఈ అవమానాలేమిటో?' అతని మనస్సు బాధతో మూలిగింది. ఆ మాటలన్నావిడను చెడామడా తిట్టాలనుకున్నాడు. కానీ, అది సమయం కాదని అతనికి తెలుసు. ఏ మాటన్నా ఎదురుతిరిగి తననే తిడతారు. అందుకే నోరు మెదపలేకపోయాడు. కానీ, అతని మనసు నిండా ఏడుస్తూ వెళ్ళిపోతున్న ఆమె రూపమే నిలిచిపోయింది.

"నేను చదువుకుంటానమ్మా! అప్పుడే నాకు పెళ్ళి వద్దు!" అని కుంతల పేచీ పెట్టినా తల్లిదండ్రులు వినిపించుకోలేదు. పెళ్ళిచూపులు ఏర్పాటుచేశారు.

పొడవుకు తగ్గ లావుతో, చక్కటి రూపురేఖలతో మిసమిసలాడుతున్న కృష్ణశర్మను చూడగానే కుంతల ఎగిరి గంతేసింది. పైగా... ఆర్మీ ఆఫీసరంటే ఆమెకు అసలే మోజు. అంతవరకూ పెళ్ళి వద్దన్న కుంతల పెళ్ళికి తొందరపడింది.

కృష్ణశర్మకు కుంతల మరింత నచ్చింది. పెళ్ళి మహా వైభవంగా జరిగిపోయింది. పెళ్ళయింది మొదలు... ఆ కొత్త దంపతులకి కాలమే తెలియలేదు. ఒకరి కళ్ళల్లో మరొకరు తప్ప వారికి ప్రపంచమే కనపడలేదు.

ఆ మరునాడే కొత్త దంపతులను చూసి కళ్ళు కుట్టినట్టుగా, 'జమ్మూ-కాశ్మీర్‌లో యుద్ధం ప్రారంభమైందని, వెంటనే బయలుదేరి రమ్మ'ని టెలిగ్రాం వచ్చింది. కొత్త వధువుతో, కొత్త అనుభవాలు చవిచూడకుండానే కృష్ణశర్మ ప్రయాణమై వెళ్ళిపోయాడు.

ఆ కొత్త ప్రేమ బంధంలోని విరహాన్ని భరించలేక కుంతల విలవిల్లాడింది. మనసంతా కృష్ణశర్మ చుట్టూ పరిభ్రమిస్తుంటే కుంతల కాలేజీకి వెళ్ళి మునుపటిలా చదువుకోలేకపోయింది. ఎక్కడ చూసినా కృష్ణశర్మ రూపమే కనబడుతుంటే నీరు దొరకని పూలమొక్కలా వాడిపోయింది. ఆమెను చూడలేని పెద్దలంతా విలవిల్లాడారు.

వెళ్ళిన వారంరోజులకే మిలిటెంట్ల బాంబుదాడిలో కృష్ణశర్మ చనిపోయినట్లు వచ్చిన వార్త అందరినీ శోక సముద్రంలో ముంచివేసింది. కుంతల పెళ్ళి మూడునాళ్ల ముచ్చటైంది.

శవపేటిక వచ్చిందని తెలియగానే కుంతలను అత్తవారింటికి తీసుకురాక తప్పలేదు. అది అతని శవమేనని కూడా వచ్చిన వాళ్ళు చెప్పడం వల్ల తెలిసిందే కానీ, లేకపోతే గుర్తుపట్టేట్టు లేదు. బాంబు దాడిలో అస్తవ్యస్తంగా కాలిపోయింది. కుంతలకి అంతా అయోమయంగా అనిపించింది.

భర్త శవం చుట్టూ బలవంతంగా ప్రదక్షిణాలు చేయించారు. పాదాలకు నమస్కారం చేయించారు. అందరితోపాటే అతని నోట్లో బియ్యం పోయించారు.

కుంతల అందరిలా భోరున ఏడవలేదు.

వారు చెప్పింది చెయ్యనని మొరాయించలేదు. మనసు లేని ఒక మరబొమ్మలా వారు చెప్పింది చేస్తోంది. కృష్ణశర్మ తల్లి దమయంతిగారి ఏడుపుతో మనుష్యులు, పశుపక్ష్యాదులే కాదు, రాళ్లూ రప్పలూ కూడా కరిగిపోతాయనిపిస్తోంది.

పదవ రోజుకు కృష్ణశర్మ స్నేహితుడు కాంతిశర్మ రాగలిగాడు. కృష్ణశర్మ పెళ్ళికి కూడా అతను రాలేకపోయాడు.

"దేశాన్ని రక్షిస్తానని పంపిస్తే దేశమే నన్ను భక్షించిందిరా నాయనా!" అంటూ దమయంతిగారు అతన్ని పట్టుకుని బావురుమంది.

"ఏడవకు పెద్దమ్మా! కృష్ణశర్మ నన్ను పంపించాడు. మీకు నేనున్నాను. నేనే మీ కొడుకుననుకోండి! ఏడవకు పెద్దమ్మా!" అంటూ ఆమె కన్నీళ్లు తుడిచి ఓదార్చాడు.

కృష్ణశర్మ పోలికలతోనే ఉండే అతన్ని తనివితీరా చూసుకుని ఆవిడ పొంగి వచ్చే ప్రేమతో అతని శరీరమంతా రెండు చేతులతో నిమిరింది.

ఆమె కన్నీళ్లను అతను తుడిచాడు.

పదవరోజు తతంగం ఎవరూ తప్పించలేకపోయారు. ఆమె గాజులు పగులగొట్టించి, బొట్టు చెరిపించారు. ఒంటరిగా ఓ మూలగదిలో కూర్చోపెట్టడమే కాదు, తెల్ల చీర ముఖం మీద గిరవాటు పెట్టారు. జరగవలసిన కార్యక్రమాలన్నీ జరిగిపోయాయి. కానీ ఆచారాలను గురించి ఆలోచించే శక్తి కానీ, వాటిని కాదనే శక్తి కానీ అక్కడున్న వారికి ఎవరికీ లేదు.

'మీద వచ్చిపడిన తరువాత అనుభవించక తప్పదు'... అన్నట్టుగా ఇరవై సంవత్సరాల కుంతల అన్నీ అనుభవించింది. ఆమె తల్లిదండ్రులు ముక్కుపచ్చలారని కుంతలను చూసి కుమిలిపోయారు. కానీ ఏమీ చెయ్యలేకపోయారు.

కాంతిశర్మ మాత్రం చూసి సహించలేకపోయాడు. సమయం చూసి అవధానిగారికి, దమయంతిగారికి తన మనసులోని మాట బయటపెట్టాడు.

"పెదనాన్నగారూ! పెద్దమ్మా! మీరు ఆ అమ్మాయికి చాలా అన్యాయం చేస్తున్నారు. ఆమె జీవితాన్ని మీరిలా నాశనం చెయ్యడం భావ్యం కాదు" అన్నాడు.

"నిజమేర్రా! మేము చేసేది అన్యాయమే! కానీ, ఆ పిల్ల తలరాతని ఎవరు మార్చగలరు? అంతేకాదు. నా కడుపు శోకాన్ని ఎవరు మాన్పగలరు?" అందావిడ.

"పెద్దమ్మా! అది ఆ పిల్ల తలరాత కాదు. మనం రాసిన రాత. పోయిన కృష్ణశర్మ తిరిగిరాడు. కానీ, ఆమె జీవితం చక్కదిద్దడం మీ చేతుల్లో ఉంది. ఆ పిల్లను మరిక్కడకు రానీకండి. ఆ పిల్లను బాగా చదివించమని ఆమె తల్లిదండ్రులకు చెప్పండి" అతను ఆవేశంతో కాదు, నిదానంగానే చెప్పాడు.

అవధానిగారు మాత్రం ఏమీ సమాధానం చెప్పలేదు.

"ఇవి మూఢాచారాలనుకో? మరేమనుకో? వీటిలో పుట్టాం. వీటిలోనే పెరిగాం. వీటిలోనే చనిపోతాం. మేం బతికుండగా మరో రూపంలో ఆమెను చూడలేం!" అంటూ ఆవిడ వెక్కివెక్కి ఏడ్చింది.

"అలా అనకు పెద్దమ్మా! పట్నాల్లో ఈనాడు ఈ మూఢాచారాలు వదలాలి పెద్దమ్మా!" అన్నాడు బాధగా. అతని కంఠంలోని ఆర్తిని ఆమె గ్రహించే స్థితిలో లేదు.

"ఇక వీరిని మార్చడం నా తరం కాదు. ఇంతకంటే ఆ వీరేశలింగం పంతులుగారి కాలమే నయం. నూరు వత్సరాలు దాటినా, కాలం మార్లేదు" అనుకున్నాడు బాధగా.

కృష్ణశర్మతోపాటే అతను కూడా ఆర్మీలో ఆఫీసరుగా చేరాడు. రెండిళ్లవతలే అతని ఇల్లు. శెలవు అయిపోవడంతో అతను వెళ్లిపోయాడు.

"అంత ధైర్యం మనమెందుకు చెయ్యలేకపోయామా?" అని కాంతిశర్మ మాటలు విన్న కుంతల తల్లిదండ్రులు మధనపడ్డారు.

కుంతలను తీసుకుని 13వ రోజు తిరిగి వచ్చేశారు.

సంవత్సరం ఇట్టే గడిచిపోయింది. కృష్ణశర్మ సంవత్సరీకాలు పూర్తయ్యాయి.

కుంతల ఎప్పుడూ అత్తింట్లో అడుగుపెట్టలేదు. కాంతిశర్మను దత్తత చేసుకుంటారని, ఉపనయనం జరుగుతుందని కుంతలను తీసుకురమ్మని బంధువులందరూ పదేపదే చెప్పారు. ఇంకా బాగుండదని కుంతలను తీసుకుని తల్లిదండ్రులు వచ్చారు.

కుంతలకు అక్కడకు వెళ్లడం ఇష్టం లేదు. ఆమెకు ఆ పదిరోజులు గుర్తుకు వచ్చి గజగజ వణికిపోయింది. అందుకే రానని మొండికేసింది. మనసులో... ఆ తల్లిదండ్రులకు ఇష్టం లేదు. కానీ బంధువులేమైనా అనుకుంటారని తీసుకు వచ్చారు.

అవధాని, దమయంతిగారలు కూడా అక్కాచెల్లెళ్ల, అన్నదమ్ముల బలవంతంతోనే కాంతిశర్మను దత్తత చేసుకోడానికి అంగీకరించారు.

ఏకైక కుమారుడు కృష్ణశర్మ మరణించడంతో ఆ దంపతులిద్దరూ ఒంటరిగా ఆ ఇంట్లో ఉండలేకపోతున్నారు. పైగా పున్నామ నరకం నుంచి కాపాడే కొడుకు లేడనే బెంగ కంటే ముసలి తనంలో ఎవరు చూస్తారనే బెంగ వారిని మరింత కుంగదీసింది. అందుకే

కృష్ణశర్మలాగే రూపురేఖలున్న కాంతిశర్మను దత్తత చేసుకోమని ఆ దంపతుల్ని బంధువులంతా బలవంతం చేశారు. కాంతిశర్మను దత్తత చేసుకుని ఆస్తి అంతా అతని పేర రిజిస్ట్రేషన్ చేయించాలి.

కానీ, కొడుకు చనిపోయిన కోడలికి కొంత ఏదైనా ఆస్తి ఇవ్వాలని కొందరి సలహా. అందుకే ఆమెను రమ్మని పదేపదే కబురు పెట్టారు. కానీ, వారి ఆస్తిలో భాగం కూతురి పేర పుచ్చుకోవడం కుంతల తల్లిదండ్రులకి ఏమాత్రం ఇష్టం లేదు. ఆమెను చదివించి, మరో వివాహం చెయ్యాలన్నదే వారి ఆశయం. అవేమీ పైకి అనకుండానే కుంతలని తీసుకువచ్చారు.

అనుకున్నట్లుగానే కాంతిశర్మ దత్తత, ఉపనయన కార్యక్రమాలు ఘనంగా జరిగిపోయాయి. అవధాని, దమయంతి దంపతులు చనిపోయిన కొడుకు తిరిగి బతికి వచ్చినంత సంతోషపడ్డారు.

చిన్నతనంలోనే తల్లిదండ్రులను పోగొట్టుకున్న కాంతిశర్మకు తల్లిదండ్రులు లభించినట్లయింది. అతను మరింత ఉత్సాహంగా ఉన్నాడు.

భర్త పోయిన 10 వ రోజున కుంతలను చూసి బాధపడ్డ కాంతిశర్మ తిరిగి ఇన్నాళ్లకి కుంతలను చూడగలిగాడు. ఆమె వేషంతోపాటు రూపురేఖలలో వచ్చిన మార్పును చూసి చాలా సంతోషించాడు. ఆమెను పలకరించాలనుకున్నాడు. కానీ, అతనికి అవకాశం చిక్కలేదు.

"పనిలో పని- అబ్బాయికి పెళ్ళి కూడా చేసి పంపిస్తే మంచిది!" అన్నారు కొందరు పెద్దలు.

బంధువులంతా సమర్థించారు. అవధాని, దమయంతి దంపతులకు కూడా సమంజసంగా అనిపించింది. కొడుకు పెళ్ళి చెయ్యడానికి నిశ్చయించుకున్నారు.

శుభకార్యానికి వచ్చిన బంధువుల్లో ఇద్దరమ్మాయిలు అన్నివిధాల కాంతిశర్మకు తగిన జోడు అనుకున్నారు.కాంతిశర్మ మాత్రం వారిని పెళ్ళి చేసుకోవడానికి అంగీకరించలేదు.

"నీ మనసులోని మాట చెప్పరా!" అంటూ దమయంతిగారు బతిమాలింది.

"నేను... ఆమె అంగీకరిస్తే.. కుంతలను పెళ్ళిచేసుకుంటా!" అన్నాడు.

కాంతిశర్మ మాటలు విన్న వారంతా ఏదో వినకూడని మాట విన్నట్లుగా ఉలిక్కిపడ్డారు.

ఒకరి ముఖాలు మరొకరు చూస్తూ అలాగే ఉండిపోయారు.

ఒక్కసారిగా నిశ్శబ్దం ఆవరించింది.

"కుంతలను మీరే ఒప్పించాలి. ఆమె కాదంటే నేనిప్పుడు పెళ్లే చేసుకోను!" అతని పట్టుదల చూసి నిజంగానే ఆ దంపతులు ఆశ్చర్యపోయారు. 'ఆమె ఎంతైనా మన కోడలే!' అని వారు అంగీకరించారు.

కుంతల తల్లిదండ్రులు మాత్రం- "అది కలా? నిజమా?" అనుకున్నారు.

కొందరు మూతులు తిప్పారు.

అయినా వారిని కాంతిశర్మ లెక్కచెయ్యలేదు.

కుంతల ముందు కాదన్నా, తర్వాత తలూపింది. ఆమె అంగీకారంతో వారి వివాహం నిరాడంబరంగా జరిగిపోయింది.

కాంతిశర్మ వెంటే ప్రయాణమైంది కుంతల.

కాలం వెంట మనిషి నడిస్తే సమస్యలే ఉండవనుకున్నారు బంధువులు. అందరి మనస్సులో తెలియని ఆనందం వెల్లివిరిసింది.



- 'పత్రిక' మాస పత్రిక... , *2002*

# ఊరగాయ జాడీ



"ఏమండోయ్ మిమ్మల్నే... వింటున్నారా?"

"ఎవర్నే... నన్నేనా? ఏమిటో చెప్పకుండానే- ఏం విని ఏడవమంటావే?"

"అలాగే చెప్పి ఏడుస్తా కానీ, ముందీ ఊరగాయ జాడీలన్నీ అటకెక్కించాలండీ! కాస్త ఇటు రండీ!"

"నాది మడి బట్ట కాదు కదే! నేనెలా ఊరగాయ జాడీలు అటకెక్కించి ఏడిశేది?"

"నూతి దగ్గరకు వెళ్లి రెండు బకెట్ల నీళ్లు గుమ్మరించుకు రండీ!"

వెంకటరత్నమ్మగారు వంటింట్లోంచే సావిట్లోకి వినబడేంత గట్టిగా చెప్పింది.

"నీ మాట బంగారంగానూ... ఆ మాట ముందే చెప్పి ఏడవచ్చుగదే!" సావిట్లో కఱ్ఱ కుర్చీలో కూర్చున్న హనుమంతరావుగారు నూతి వైపు అడుగులేశారు.

"ఏమిటో! ఎన్నాళ్లు ఈయనతో కాపురం చేసినా మాటకు ముందు ఏడవడం ఏమిటో అర్థమై ఏడవడం లేదు!" అంతలో ఆవిడ మాట ఆవిడకే గుర్తుకొచ్చి-

"అయ్యో రాతా! ఆయన ఏడవడం నా వెంటపడినట్టుంది!" నాలిక కరుచుకుని నేలమీద చతికిలబడింది.

"ఈ మడీ, దడీ ఏమిటో! రోజురోజుకీ దీని చాదస్తం మరీ పెరిగిపోతోంది!"

అనుకుంటూ హనుమంతరావుగారు నూతిలోంచి రెండు బకెట్ల నీళ్లు తోడుకుని తల మీద గుమ్మరించుకున్నారు. అంగవస్త్రం గట్టిగా పిండి దానితోనే వళ్ళంతా తుడుచుకున్నారు.

అంతలో పనిపిల్ల బుచ్చి అక్కడకు వచ్చింది.

ఆయనది నున్నటి గుండే అయినా జానెడు పిలక. ఆ పిలక చూసే బుచ్చి ఆయన్ని ఓ ఆట పట్టిస్తూ ఉంటుంది.

"మీ పిలక బాగా తడిసిందో లేదో! రెండు బక్కెట్ల నీరు తోడి పొయ్యమన్నారేటి!" అంటూ బుచ్చి ఆయనకు దగ్గరగా వెళ్లబోయింది.

"పో!పో! దూరం! దూరం!"

... అంటూ ఆయన పిలక మరోసారి ఝాడించి ముడి వేసుకుంటూ వంటింటి వైపు అడుగులేశారు.

"అయ్యా! తడిపంచె ఆరేయాలా! ఈడే ఉంచమంటారా?" ఈసారి బుచ్చి మాటలకు మరింత కోపం వచ్చిన ఆయన వెనక్కి వచ్చి బెదిరించి వంటింట్లోకి వెళ్లిపోయారు.

పన్నెండేళ్ల బుచ్చి నవ్వుకుంటూ అక్కడి నుంచి వెళ్లిపోయింది.

మొన్నటివరకూ పాతకాలంనాటి నల్లటి గుండల్లోనే ఊరగాయలన్నీ పెట్టుకునేవారు. నూనె పీల్చి వేస్తాయని కొత్తగుండల్లో ఊరగాయ పెట్టరు.

వెంకటరత్నమ్మగారి కోడలు ఊరగాయలు పెట్టుకోవడానికి జాడీలు కొని ఇచ్చింది. పైగా.. ఆ జాడీలు పెట్టుకోవడానికి ఓ అలమారు కూడా వంటింట్లో కట్టించింది.

మొదట్లో వెంకటరత్నమ్మగారికి జాడీల్లో ఊరగాయలు పెట్టుకోవడం ఇష్టం లేదు. రానురాను కొత్త అలవాటే పాతై బాగానే అనిపించింది.

ఇప్పుడావిడ కళ్ళకి ఆ జాడీలు అలమారులో సర్దిన బుట్టబొమ్మల్లా అనిపిస్తున్నాయి.

"ఇదేమిటి, ఈ జాడీలన్నీ మళ్లీ ఈ నేలమీద ఇలా పెట్టి ఏడిశావేమిటే!" ఆయన ఆశ్చర్యంగా అడిగాడు.

"మన వెంకటాచలంగారి అమ్మాయి పెళ్ళి కదండీ... మనిల్లే విడిదిట! వచ్చిన చుట్టాలంతా మన మడి ఊరగాయలు తినిపోతారండీ! అందుకే ఈ జాడీలన్నీ ఎవరికంటా పడకుండా అటకెక్కించేద్దామండీ!"

"ఓసి నీ తెలివి కాకులెత్తుకెళ్లా! ఎంతెంత ఆలోచనలే నీవీ! ఇంతకీ... ఆ పెళ్ళి ఎప్పుడేడిసిందిటా?"

"అవ్వ! అవ్వ! ఎవరేనా వింటే నవ్విపోతారండీ! శుభమాని వాళ్ళు పెళ్ళి చేసుకుంటుంటే... ఏడవడాలేమిటండీ? ముందా జాడీలు అటక మీద పెట్టండీ!"

"అదిసరే కానీ! ముందా జాడీలు నాకందించి ఏడు?"

– అంటూనే ఆయన నిచ్చెనెక్కి ఆవిడ అందించిన జాడీలు అందుకుని నిచ్చెన పైకి ఎక్కుతున్నాడు. నిచ్చెన నేల మీద గుంటల్లో ఉన్నా ఆయన బరువుకీ, జాడీ బరువుకి నిచ్చెన కదులుతూనే ఉంది.

"గట్టిగా పట్టుకుని ఏడవ్వే! లేకపోతే నేను నేల మీద పడి చస్తానే!" ఆయన భయంతో అరుస్తూనే ఉన్నాడు.

"గట్టిగానే పట్టుకున్నానండీ, మీ ప్రాణానికి నా ప్రాణం అడ్డండీ!" ఆవిడ సమాధానం చెబుతూనే ఉంది.

మొత్తం మీద ఆవకాయ, మాగాయ, మెంతికాయ, తొక్కుడు పచ్చడి, చింతకాయ పచ్చడి, ఉసిరికాయ పచ్చడి... మొత్తం ఆరు జాడీలు అటక మీద పెట్టాడాయన.

ఆయాసంతో కిందికి దిగేటపుడు నడుం కలుక్కుమని ఆయన కెవ్వుమన్నాడు.

ఆ అరుపునకు ఆవిడ గుండె జారింది. మెల్లిగా ఆయన చెయ్యి పట్టి నడిపించి హాల్లో పట్టెమంచం మీద కూర్చోపెట్టింది.

"అయ్యో! నడుం విరిగి ఏడిసినట్టుందే!" అయన బాధతో మూలిగాడు.

"నడ్డే కదండీ! కాస్త ఓర్పు పట్టండీ! జాడీ విరగలేదు కదండీ! కాస్త సున్నం, బెల్లం పట్టు వేస్తే అదే సర్దుకుంటుంది లెండి!"

ఆవిడ వంటింట్లోకి వెళ్లి ఓ గిన్నెలో సున్నం, బెల్లం వేసి బాగా నూరింది. కాస్త నూనె వేసి మరోసారి చూపుడువేలితో పాకంలా కలిపింది.

దాన్ని తెచ్చి ఆయన వీపు మీద పట్టు వేసింది.

"అహః..! కాస్త గట్టిగా రాసి ఏడవ్వే..!" ఆయన బాధగా అడిగాడు.

"అలాగే రాసి ఏడుస్తాలెండి!" ఆవిడ ఆయన వీపుమీద ఎడం చేత్తో గట్టిగా నొక్కి కుడిచేత్తో మరింత గట్టిగా రాసింది.

"అమ్మో! కూసంత ఊరగాయ పెడతారనుకున్నా! అంతా అటకెక్కించేశారేంటి?" అప్పుడే ఇక్కడకు వచ్చిన బుచ్చి అడిగింది.

"ఇదిగో బుచ్చీ! నువ్వెక్కడికి పోతావ్! ఊరగాయ ఎక్కడికి పోతుందే! ఈ మాటు అటక నుంచి దింపినప్పుడు పెడతాలే!" అంది వెంకటరత్నమ్మగారు.

"అయ్యె నడ్డి నే పడతానమ్మో! మీరెల్లి పని చూసుకోండి!" అంది నవ్వుతూ బుచ్చి.

"ఓసి... నీ మొగుడు నిన్నెత్తుకెళ్లా! పోతావా, లేదా?" ఆయన మంచం మీంచి లేవబోయాడు.

మళ్లీ నడ్డి కలుక్కుమనడంతో తిరిగి మంచం మీద వాలాడు.

బుచ్చి పకపకా నవ్వుతూ అక్కడి నుంచి పరుగెత్తింది.

రెండవ నాటికి ఆయన మామూలుగా లేచి తిరగగలిగాడు.

తరచు స్నానాలు, తడి బట్టలు, నీళ్లలో తిరగడంతో వెంకటరత్నమ్మగారి పాదాలు, వేళ్లు పుళ్లు పడి ఉన్నాయి.

ఆరోజు ఆవిడ పాదాలు మరింత బిగపట్టి నడవలేక నడుస్తోంది.

"అదేమిటే? అలా అడుగులు ఎత్తెత్తి వేస్తున్నావేమిటే!" ఆయన మాటల్లో ఆతృత తొంగిచూసింది.

"ఏముందీ? కాళ్లూ, వేళ్లూ మంటలు. రోజూ ఉంటే రోగమే కదండీ!" ఆవిడ కళ్ళల్లో నీళ్లు తిరిగాయి.

ఆయన చూడకుండా పమిటకొంగుతో కళ్ళు తుడుచుకుంది.

"నీ స్నానాలు, మడులు, చాదస్తాలు మండిపోనూ! ఈ తడి బట్టల గోల వదలవే. అబ్బాయి నీకెన్నిసార్లు చెప్పాడే... ఇవన్నీ కాస్త వదలమనీ! ఈ జన్మకి నువ్వు మారవే! ఏదీ ఇటురా... చూస్తానూ?" అన్నాడు ఆయన– విసుగు, జాలి మిళితమైన స్వరంతో.

ఆవిడ కుంటుతూ దగ్గరకు రాగానే ఆవిడ చెయ్యి పట్టి మంచం మీద పక్కనే కూర్చోపెట్టుకున్నాడు. ఆమె పాదాలు పట్టి చూశాడు.

రెండు పాదాలు పుళ్ళుపడి రక్తం చిమ్ముతున్నాయి.

వేళ్లయితే ముట్టుకుంటే చేతుల్లోకి ఊడొచ్చేట్టున్నాయి. పైగా– వేళ్లకున్న వెండి మట్టెలు ఆ పుళ్లలో ఇరుక్కుపోయి ఉన్నాయి. ఆమె వద్దని మొత్తుకుంటున్నా ఆయన వినిపించుకోకుండా ఆ మట్టెలు తీసి పక్కన పెట్టాడు.

కారే రక్తాన్ని దూదితో తుడిచి గుడ్డ కట్టాడు.

'వెర్రిబాగుల్ది! ఎలా వెడతాయో రోజులు!' అనుకున్నాడు మనసులో. ఆయన గుండెలో ఎక్కడో కలుక్కుమంది. చెమర్చిన కళ్లను భుజం మీదితుండుతో తుడుచుకున్నాడు.

"ఓసి మొండిదానా? ఇంతనొప్పి ఎలా భరిస్తున్నావే?" అంటూనే ఆయన వంటింట్లోకి వెళ్లి సున్నం నీళ్ళు, కొబ్బరినూనె కలిపి, బాగా రంగరించి నవనీతం తయారుచేసి పట్టుకొచ్చాడు.

"నా కాళ్లకి మీరు రాయడమేమిటండీ! నేనే రాసుకుంటానండీ!" ఆమె ఎంత చెప్పినా వినకుండా ఆమె పాదాలకి, వేళ్లకి బాగా పట్టించాడు.

ఆమె బాధకి కాస్త ఉపశమనం కలిగినట్లయింది.

ఆమెను బలవంతంగా పడుకోబెట్టాడు.

వత్తుల స్టౌ అంటించి కాఫీ పెట్టి ఆమెకు ఇచ్చాడు. ఆయన ఇంటికెదురుగా ఉన్న పినతల్లిగారింట్లో భోజనం చేసి వచ్చాడు.

"అన్నట్లూ... కోడలు నీ కాళ్ల పగుళ్ళకి అయింట్‌మెంట్ కొనిపించింది కదే!" ఆయనకు చటుక్కున గుర్తుకువచ్చింది.

అలమారు తీసి అయింట్‌మెంట్ ఆవిడ పాదాలకి, వేళ్లకి బాగా రాశాడు. కాళ్ల మంటలు కాస్త తగ్గడంతో ఆవిడకు నిద్రపట్టింది.

మరునాడు తెల్లారకుండా ఆవిడ లేచి కూర్చుంది.

"ఈ పూట నీకు మడి, దడి కద్దు. అత్తెసిరి నే పడేస్తానుండు!"

ఆయన ఎంత చెప్పినా ఈవిడ వినలేదు. రెండు చెంబుల వేన్నీళ్లు గుమ్మరించుకుని ఆరేసిన పట్టుచీరతో వంట చేసింది. భోజనాలయ్యాక ఆవిడ వచ్చి సావిట్లో బల్లమీద కూర్చుంది. దానికి మడి బల్లనే పేరు.

ఆయన కోడలు కొనిచ్చిన హవాయి చెప్పులు పట్టుకొచ్చి ఆవిడ కాళ్ల ముందు పెట్టాడు.

"ఇదేమిటండీ!" ఆవిడ ఆశ్చర్యంగా అడిగింది.

"కాళ్ళు పుళ్లు పడకుండా నీ కోడలు చెప్పులేసుకు తిరగమందిగా! ఇవి మడికి కూడా పనికి వస్తాయిట. వేసుకో..!" ఆయన బలవంతం చేశాడు.

"అమ్మో! ఈ చెప్పులేసుకుని నేను నడవలేనండీ!" అంది భయంగా.

ఆయనే ఆవిడ కాళ్లకి చెప్పులెక్కించబోయాడు.

ఇక తప్పదనుకున్న ఆవిడ బల్ల దిగింది.

కాళ్లకి చెప్పులు తొడుక్కోవడానికి ప్రయత్నించింది. ఆవిడకు సరిగా చేత కాకపోతే ఆయన సహాయం చేశాడు.

మొత్తం మీద చెప్పులు కాళ్లకి వేసుకోగలిగింది.

"నడు... నడు..." అంటూ ఆయన తొందరపెడితే ఆవిడ చిన్నపిల్లలా తప్పటడుగులు వేసింది.

ఆయన చప్పట్లు కొట్టాడు.

"అబ్బో... పట్నం మనిషిలా ఉన్నావే!"

ఆయన ముసిముసి నవ్వులకు ఆవిడ పూచిన తంగేడయింది. ఆవిడ చెవి కమ్మల కాంతులు ఆవిడ చెక్కిళ్ళ మీద గంతులేశాయి.

పట్నంలో చదువుకుంటున్న ఘనశ్యామ్ రెండురోజుల సెలవుకి ఇంటికొచ్చాడు.

ఆరోజు హనుమంతరావుగారు పొరుగూరు వెళ్లారు. రాత్రికి కాని ఇంటికి రారు. ఘనశ్యామ్ ఉల్లిపాయ పకోడీలు చేయమని తల్లిని బతిమాలాడు.

కొడుకు కొని తెచ్చిన ఉల్లిపాయలతో పకోడీలు చేసింది. తల్లిని కూడా తినమని కొడుకు ఎంత బతిమాలినా ఆవిడ వినలేదు.

"నీ తండ్రికి లేని రుచులు నాకెందుకురా?" అంది.

మిగిలిన పకోడీలు తండ్రి కంటబడకుండా అతను గదిలో దాచుకున్నాడు.

ఆవిడ ఉల్లి తరిగిన కత్తిపీటని పీచుతో మట్టిపెట్టి తోమింది. ఆ నూనె పెంటలో పారబోసింది. ఉల్లి తుక్కు పెంటలో కాక మండే పొయ్యిలో పోసింది. పకోడీలు వేసిన చోట శుభ్రంగా కడిగేసింది. ఇంట్లో ఎక్కడా పకోడీలు వండిన జాడ లేకుండా చేసింది.

అంతలో... హనుమంతరావుగారు కాలరుద్రుడిలా మండిపడుతూ లోపలికి వచ్చారు.

"ఏరా! నీకెన్నిసార్లు చెప్పినా బుద్ధి లేదురా? ఆ మల్లయ్య కొట్లో ఉల్లిపాయలు కొని తెస్తావురా? ఏది మీ అమ్మ? ఎక్కడ ఏడిసిందిరా?" కొడుకు సమాధానం కోసం ఎదురుచూడకుండానే చెప్పులు విప్పి వంటింటి వైపు వెళ్లాడు.

ఉల్లిపాయ పకోడిల వాసనకు ఆయన ముక్కుపుటాలు ఎగిరాయి. ఆయన కోపం తారాస్థాయికి చేరింది.

"నీకు బుద్ధిలేదా? గడ్డి తింటున్నావా?" అంటూ నానా తిట్లు తిట్టాడు. కోపం పట్టలేక ఆయన కొట్టడానికి చెయ్యెత్తాడు. అతనిలో ఏదో వివేకపు పొర లాంటిది కదిలి కొట్టలేక చెయ్యి దించుకున్నాడు.

"బుద్ధిలేని దానా? వాడికి తినాలని ఉంటే రెండు రూపాయలు పడేసి బజారులో కొనుక్కుని తినమన లేకపోయావా? ఛీ! ఛీ!"అంటూ భుజం మీది కండువా దులుపుకుంటూ అక్కడ నుంచి గదిలోకి వెళ్లిపోయాడు.

ఆవిడ అలాగే కాసేపు నిలబడిపోయింది.

సమాధానమిస్తే తాటాకు మంటలా ఆయన కోపం భగ్గుమంటుందని ఆమెకు బాగా తెలుసు.

కొడుకు మాత్రం తండ్రి కంట పడకుండా తప్పించుకున్నాడు.

రెండురోజుల వరకూ ఆయన కోపం చల్లారలేదు.

జ్ఞాపకం వచ్చినప్పుడల్లా సాధిస్తూనే ఉన్నాడు. మూడవరోజు కొడుకు వెళుతుంటే అనేక జాగ్రత్తలు చెప్పాడు.

కారే కన్నీళ్లు దాచుకుంటూ ఘనశ్యామ్ తండ్రి పాదాలకు నమస్కరించి బయలు దేరాడు. కొడుకు వెడుతుంటే ఆ తల్లి గుండె చెరువయింది.

ఆరోజు వెంకటాచలంగారింట్లో పెళ్లి.

చుట్టాలంతా ఎక్కడెక్కడివారు తరలి వచ్చారు.

విడిది కూడా వీరిల్లే మూలంగా సన్నాయి, బాండు మేళాలతో ఆ ఇల్లు కళకళ్లాడింది.

భార్యాభర్తలిద్దరూ పెళ్లివారితో కలిసి మరింత హడావుడిగా తిరిగారు.

వెంకటాచలంగారి కుటుంబానికి వీరికి దగ్గర బంధుత్వాలున్నాయి. అందుకే వచ్చిన చుట్టాలందరూ ఇద్దరికి కావలసిన వారే!

"అదేమిటే మరదలా! మీ ఇంట్లో మడి ఊరగాయలు లేవా ఏమిటి?" వరసకు పిన్నత్తగారి కూతురు ఉండబట్టలేక అడిగింది.

"అయ్యో వదినా! ఏం చెప్పనే? కుంచెడు కారంతో ఆవకాయ పెట్టానా? నాలుగు నెలలు తిరక్కుండానే ఓ బద్ద కూడా లేకుండా ఉష్ కాకి అయిపోయిందనుకో!" వెంకటరత్నమ్మగారు మరింత తెలివిగా సమాధానమిచ్చింది.

"అవునా మరదలా? నీ చేతి ఆవకాయ రుచి చూసే అదృష్టం మాకు లేదన్నమాట!" అందావిడ మరేమీ అనలేక. తెచ్చిపెట్టుకున్న నవ్వుతో ఆవిడ మెల్లిగా అక్కడ నుండి జారుకుంది. రెండవరోజు రాత్రికే వచ్చిన పెళ్లి వారందరూ తిరుగు ప్రయాణమయ్యారు.

ఉరుముల వాన వెలిసిన ప్రకృతిలా ఆ ఇల్లు నిశ్శబ్దమైంది.

"చూశారాండీ! మనం ఊరగాయలు అటకెక్కించకపోతే ఈపాటికి జాడీలన్నీ ఖాళీ అయ్యేవండీ!" అంది వెంకటరత్నమ్మగారు ఊపిరి పీల్చుకుంటూ.

"నీ తెలివి బంగారంగానూ. నీ ప్లాను గట్టిగా ఏడిసిందిలే!" అన్నాడు నవ్వుతూ.

ఆ రాత్రికే వాన ప్రారంభమైంది. వెంకటరత్నమ్మగారి గుండెలు గుభిల్లుమన్నాయి.

"ఏమండోయ్! వినండీ! అటక మీద వానపడుతుందండీ. ఊరగాయ జాడీలన్నీ తడిసిపోతాయండీ!" నిద్రపోతున్న భర్తని కంగారుగా లేపింది.

"మడికట్టుకోవాలిగా! తెల్లారేకా చూసి ఏడుద్దాంలే!" ఆయన కళ్ళు పూర్తిగా విప్పకుండానే సమాధానమిచ్చాడు.

ఆ రాత్రంతా వానపడుతూనే ఉంది.

వెంకటరత్నమ్మగారి కంటికి సరిగా నిద్రలేదు.

వెలుగు రాగానే తిరిగి భర్తను పిలిచింది. ఎంత లేపినా ఆయన లేవలేదు. ఆయన వంటి మీద చెయ్యివేసి చూసి ఆవిడ కెవ్వుమంది.

ఆయన వళ్ళు కాలిపోతోంది.

సాధారణంగా ఆయనకు ఆచారిగారే వైద్యం చేస్తారు. ఈసారి ఇంగ్లీషు డాక్టర్‌కి కబురు పెట్టింది. ఆయన వచ్చి ఆవిడ కంగారు చూసి సూది ఇచ్చి మందులు రాసి వెళ్లాడు.

హనుమంతరావుగారి జ్వరం తగ్గాలని ఎందరో దేవుళ్లకి మొక్కింది. డాక్టర్ రాసిచ్చిన మందులు తెప్పించి ఎంతో శ్రద్ధగా వాడింది.

మూడవ రోజుకి జ్వరం తగ్గి ఆయన లేవగలిగాడు.

ఆ రెండు రోజులు ఆవిడ నోటికి ముద్దపోలేదు. కంటికి కునుకు రాలేదు. ఆవిడ చిక్కి సగమయింది.

"అయ్యో! ఈ రెండురోజుల్లో ఇలా చిక్కిపోయావేమిటే! రేప్పొద్దున్న నేను ఏమైనా అయితే ఎలా బతికి ఏడుస్తావే! వెర్రిదానా?" ఆయన కళ్ళు చెమర్చాయి. కంఠం జీర వచ్చి మరి మాట పైకిరాలేదు. వెంకటరత్నమ్మగారు జలజల వస్తోన్న కన్నీళ్లని పమిటకొంగుతో తుడుచుకుంది.

ఆరోజు ఆయన స్నానం చేసి, తడి పంచె కట్టి నిచ్చెనెక్కి ఒక్కొక్క జాడీ దింపుతున్నాడు. ఆవిడ తలకు స్నానం చేసి, తడిచీరతో కింద నిలబడి జాడీ అందుకుని వారగా పెడుతోంది.

నిచ్చెన కదిలినప్పుడల్లా ఆయన "గట్టిగా పట్టుకుని ఏడవ్వే! లేకపోతే నేను కిందపడి ఏడుస్తానే!" ఆయన అరుస్తూనే ఉన్నారు.

"మీ ప్రాణానికి నా ప్రాణం అడ్డండీ! గట్టిగానే పట్టుకున్నా!" అంటూనే ఉంది.

ఆయన అనుకున్నంతా జరిగింది...

పక్కకు నిచ్చెన జారడం, ఆయన జాడీతో సహా నేలమీద పడడం జరిగిపోయింది. జాడీ ముక్కలై ఎర్రగా ఊరగాయ నేలంతా పరుచుకుంది. ఆయన నేలమీద కుప్పలా పడి మరి లేవలేకపోయాడు.

అంత కంగారులోనూ ఆవిడ జాడీల మూతలు తీసి చూసుకుంది.

ఊరగాయంతా బూజు పట్టేసింది. ఆవిడ గుండె జారింది.

కళ్ళు తిరిగి నేల మీద పడబోయి తమాయించుకుంది. అప్పుడు అచేతనంగా పడి ఉన్న భర్తను సమీపించి ఘొల్లుమంది.

అది విన్న వీధిలో జనం పరుగెత్తుకుంటూ వచ్చారు. ఆయన ముఖం మీద నీళ్లు జల్లి తుడిచారు.

ఆయనలో కాస్త చలనం వచ్చింది.

మెల్లిగా లేవతీసి ఆయన్ని మంచం మీద పడుకోబెట్టారు. ఎవరో పరుగెత్తికెళ్లి డాక్టర్ని తీసుకొచ్చారు.

"ఏం ఫరవాలేదండీ! ఏం పెద్ద దెబ్బలు తగల్లేదు. కాలు బెణికింది అంతే!" అంటూ డాక్టర్ ఆయన కాలికి కట్టుకట్టాడు. చెక్కుకు పోయి రక్తం వస్తున్న చోట మందులు రాసి ఇంజక్షన్ ఇచ్చి వెళ్లిపోయాడు.

ఆయన కళ్ళు తెరిచాడు.

వచ్చిన వాళ్ళంతా వెళ్లారు. ఆవిడ కాఫీ కలిపి ఆయన చేత మెల్లగా తాగించింది. ఆవిడ దు:ఖం ఆగలేదు. వెక్కి వెక్కి ఏడ్చింది. తను పడినందుకు కాదు. ఊరగాయలు పాడైనందుకు ఏడుస్తోందని ఆయనకు తెలుసు.

జాడీలు దింపేటప్పుడే ఆయన ఊరగాయలన్నీ బూజు పట్టాయని చూశాడు. ఆవిడను బాధ పెట్టడం ఇష్టం లేక చెప్పలేదు.

ఆ దంపతులకి ఇద్దరే సంతానం.

పెద్దకొడుకు రఘురామ్ అమెరికా నాలుగేళ్ల క్రితం వెళ్లాడు. అతనికి ఊరగాయలంటే ఇష్టం. వెళ్లేటప్పుడు కావలసిన ఊరగాయలన్నీ పట్టుకెళ్లాడు.

ప్రతి సంవత్సరం కొడుకు వచ్చి ఊరగాయలు పట్టుకెళతాడని ఆవిడ ఆశ. అతను మళ్లీ రానేలేదు.

"ఏమండీ! ఊరగాయలన్నీ బూజు పట్టాయండీ! అబ్బాయి డిసెంబర్‌లో వస్తే ఊరగాయలు ఎలాగండీ!" ఆవిడ భర్తను పట్టుకుని బావురుమంది.

"వాడికి కొన్న ఊరగాయలు కూడా ఇష్టమే. వాడికి కావలసిన ఊరగాయలన్నీ కొనిద్దాం!" అన్నాడు ఓదార్పుగా.

"జాడీ పగిలిపోయిందండీ!" అంది బేలగా.

"కొత్త జాడీ అంతకంటే పెద్దసైజు కొనుక్కుందాం!" అన్నాడు.

కొడుకు డిసెంబర్‌లో రావడం లేదని మాత్రం ఆయన చెప్పలేకపోయాడు. కొడుకు రావడం లేదని రాసిన ఉత్తరం ఆవిడ కంటపడకుండా దాచుకుని అప్పుడప్పుడు చదువుకుంటున్నాడు. కన్నీళ్లు తుడుచుకుంటున్నాడు. ఆవిడ మనసుకు కాస్త ఊరట కలిగింది.

వెంకటరత్నమ్మగారు కన్నీళ్లు పమిట కొంగుతో ఒత్తుకుంది. కారే ముక్కుని తుడుచుకుంది. చిలకముక్కులా ఎర్రబడిన ఆమె ముక్కు మీద బేసరి, నిమ్మగుత్తి చెరో వైపు తళుక్కుమన్నాయి.

బుచ్చి మాత్రం బూజు పట్టిన ఊరగాయల వైపు బిత్తరపోయి చూసింది.



- **'ఆంధ్రభూమి'** వార పత్రిక... *13 జూన్, 2002*

# మమకారంలో మచ్చలు




"నేనప్పుడే పెళ్లిచేసుకోను నాన్నా..!"

"అదేమిటమ్మా..!"

"కొన్నేళ్లపాటు ఉద్యోగం చేసుకుంటూ హాయిగా ఉండాలనుకుం

"ఏంటమ్మా...అలా అంటావూ? మేమా పెద్దవాళ్ళమయ్యాం! ముసలి ముంచుకువస్తూనే ఉంది. ఎప్పుడు రాలిపోతామో తెలీదు. ఈలోపుగా నిన్ను కదమ్మా!"

" ఉద్యోగం వచ్చింది కదా! అదే జీవితంలో అసలు సెటిల్‌మెంట్! అయినా నాన్నగారూ... అన్నయ్య చదువుకి ఉన్నదంతా ఖర్చుపెట్టారు! వాడు చేతికందొచ్చి ఆదుకుంటాడనుకున్నారు. పెళ్ళి చేసుకుని వాడు దూరంగా వెళ్లిపోయాడు. నేను చదువుకోడమే చాలా కష్టమయింది. ఇప్పుడు ఉద్యోగం దొరికింది. ఆర్థిక ఇబ్బందుల్నించి బయటపడి కొన్నాళ్లు హాయిగా బతుకుదాం! నా పెళ్ళికి తొందరపడకండి నాన్నగారూ!"

"నువ్వు చెప్పింది నిజమేనమ్మా!"

"అన్నలాగే నేను కూడా పెళ్ళిచేసుకుని చేతులు దులుపుకుని వెళ్లిపోతే మీ గతేమిటి నాన్నగారూ?"

కూతురు మాటలకు రామనాధంగారి గుండె కదిలింది. కళ్ళలో ఉబికివచ్చిన కన్నీళ్లని తుండుతో తుడుచుకున్నాడు.

అర్చన కళ్ళు తుడుచుకుంటూ అక్కడ నుంచి లేచి లోపలికి వెళ్లిపోయింది.

"చూశావా! నువ్వు అడగమన్నావు అడిగాను. అది అప్పుడే పెళ్ళి చేసుకోనంటోంది! బలవంతంగా ఏ పనీ చేయించలేం కదా?!" అన్నాడు భార్యతో రామనాధం.

"నిజమేనండీ! కొన్నాళ్లపాటు దాన్ని హాయిగా బ్రతకనీయండి. ఈ సంసారమూ, పిల్లలూ అన్నీ ఎలాగూ తప్పవు!" శాంతమ్మ భర్తకు సమాధానమిచ్చింది.

మొదటినెల జీతం అందుకున్న అర్చన చేతిలో స్వీట్ ప్యాకెట్‌తో నవ్వుకుంటూ ఇంటికి తిరిగి వచ్చింది.

"నోరు తెరవండీ... తెరవండీ!" అంటూ చిన్నపిల్లలా ఇద్దరి నోట్లో అర్చన స్వీట్స్ పెట్టి చప్పట్లు కొట్టింది. ఆ ముసలి దంపతులిద్దరూ స్వీట్స్ తింటూ చిన్నపిల్లల్లా తిరిగి చప్పట్లు కొట్టారు.

"నే వెళ్లి నెలకి కావలసిన సరకులన్నీ పట్టుకొస్తాను. నే వచ్చేటప్పటికి మీరిద్దరూ రెడీగా ఉండాలి... తెలిసిందా అమ్మా!"

అర్చన మాటలకి ఆ తల్లిదండ్రులిద్దరూ తెల్లబోయారు.

"అదేమిటమ్మా! ప్రతీనెల నాన్నగారేగా సరుకులు తెస్తారు? అనవసరంగా నువ్వెందుకమ్మా వెళ్లడం?" ముందు తేరుకున్న తల్లి ప్రశ్నించింది.

"ఆ కొట్టువాడు నాన్నగారి అమాయకత్వం చూసి పదిశాతం బిల్లు ఎక్కువ వేస్తున్నాడని నా అనుమానం. అందుకే నేనే దగ్గరుండి పట్టుకొస్తానమ్మా!"

"అది సరేనమ్మా! మమ్మల్ని రెడీగా ఉండమన్నావు... అదెందుకు?" తండ్రీ ఆతురతగా ప్రశ్నించాడు.

"అది సస్పెన్స్ నాన్నగారూ? నేను వచ్చేటప్పటికి మీరిద్దరూ రెడీగా ఉండండి! వింటున్నావా అమ్మా!"

"సరే... అలాగేనమ్మా!"

ఆ తల్లిదండ్రులిద్దరి మనస్సుల్లోనూ సంతోషం వెల్లివిరిసింది. ఇంటి బాధ్యత చేపట్టిన కూతుర్ని తృప్తిగా చూసుకున్నారు.

అరగంటలో సరుకులు, కూరలు తీసుకుని అర్చన తిరిగి వచ్చింది. అర్చన చెప్పినట్లుగానే తల్లిదండ్రులిద్దరూ సోఫాలో కూర్చుని ఉన్నారు.

"ఎంతయిందమ్మా! పట్టుకెళ్లిన డబ్బు చాలిందా?"

"అవన్నీ తిరిగివచ్చాక సావకాశంగా చూసుకుందాం నాన్నగారూ?"

"కాస్త టీ తాగుతావా అమ్మా!"

"ఇప్పుడేం వద్దు! నడవండి బయటికి వెళుతున్నాం!"

చేతిలో ఉన్న కూరలు, సరకుల సంచీలు వంటింట్లో పెట్టి వచ్చింది అర్చన. ఆమె తొందరచెయ్యడంతో మారుమాటాడకుండా ఆ దంపతులిద్దరూ తాళాలు తీసుకుని బయటకు వచ్చారు.

ఇంటికి తాళం పెట్టి ఆటో పిలుచుకువచ్చింది అర్చన. ముగ్గురూ ఎక్కగానే ఆటో బయలుదేరింది.

నాంపల్లి, పబ్లిక్‌గార్డెన్స్, రవీంద్రభారతి, సెక్రటేరియట్ మీదుగా నెక్లెస్‌రోడ్డు దగ్గరకు వచ్చి ఆటో ఆగింది.

"దిగండి... అమ్మా! నాన్నా!"

ఆ దంపతులిద్దరు అయోమయంగా ఒకరి ముఖాలు ఒకరు చూసుకున్నారు వారు ఆటో దిగగానే పైసలిచ్చి పంపించేసింది అర్చన.

ఆ ప్రాంతమంతా లైట్లతో వెలిగిపోతోంది. అక్కడ కూచిపూడి నృత్య ప్రదర్శ జరుగుతోంది.

కన్నులపండువుగా ఉన్న ఆ ప్రదేశాన్ని చూసిన వారి మనస్సులు ఆనందం తేలియాడాయి.

ఆ ఆనందం వారి ముఖాల్లో కొట్టొచ్చినట్లు కనబడుతోంది.

"దేవేంద్రలోకంలా ఉందమ్మా ఇది? ఆమె దేవకన్యలా నాట్యం చేస్తోం గానం గంధర్వగానంలా ఉందమ్మా!"

సంతోషంతో రామనాథంగారి కంఠం వణికింది.

నగరంలో 30 ఏళ్ల నుంచి ఉంటున్నా... ఆయనెప్పుడూ ఇలాంటి కార్యక్రమాలకు వెళ్లలేదు. రవీంద్రభారతిలో ఎన్నో కార్యక్రమాలు జరుగుతాయని తెలుసు. వెళ్లే తీరికా చిక్కలేదు, చేతిలో డబ్బూ లేదు.

... చాలీచాలని జీతంతో కొడుకును చదివించాడు, కూతుర్ని చదివించాడు. ఇప్పుడు ఇద్దరే పిల్లలున్నా భార్యకు ఆరు కాన్పులయ్యాయి. ఇద్దరు పిల్లలు పుట్టి చనిపోయారు. మరో ఇద్దరు చనిపోయే పుట్టారు. ఎలాగో ఒక ఇల్లు మాత్రం కట్టగలిగారు. అందుకే ఇప్పుడు ఆయనకు అంత సంతోషంగా ఉంది. ఆవిడకు మరింత సంతోషంగా ఉంది. అప్పుడే రెక్కలు వచ్చిన పక్షుల్లా ఎగిరి గంతులెయ్యాలనుకున్నారు.

అర్చన ఇద్దరికీ ఐస్‌క్రీమ్ కప్పులు చేతుల్లో పెట్టి తానొకటి తీసుకుంది.

తిరిగి ఇంటికి సంతోషంగా తిరిగివచ్చారు. జీవితమంటే ఇంత తీయగా ఉంటుందని మొదటిసారి ఆ దంపతులకు తెలిసింది.

రాత్రి భోజనాలయిన తరువాత పద్దులన్నీ చూసుకున్నారు.

సరకులు అర్చనే దగ్గరుండి పొట్లాలు కట్టి తేవడంవల్ల సుమారు 50 రూపాయలు మిగిలాయి. నెలకి 500 రూపాయలు చొప్పున అప్పులు తీర్చవచ్చని నిర్ణయించుకున్నారు.

ప్రతినెలా అప్పు తీర్చడం మొదలుపెట్టింది అర్చన. నెలకి 2 సార్లు తల్లిదండ్రుల్ని ట్యాంక్‌బండ్, పబ్లిక్‌గార్డెన్స్, మ్యూజియం, జూలాజికల్ పార్కు... అలా ఎక్కడికో అక్కడికి తీసుకువెళుతూనే ఉంది. మాదాపూర్‌లో ప్రోగ్రామ్ జరిగినప్పుడు అక్కడికి అప్పుడప్పుడు తీసుకువెళుతోంది.

ఎంతో సరదాగా గడుస్తున్నాయి రోజులు.

"అదేమిటే... ఆవిడగారు పెళ్లి చేసుకోదా? బ్రహ్మచారిణిగానే ఉండిపోతుందా?" ఆఫీసులో ఆడా, మగా గుసగుసలు ప్రారంభించారు.

"బ్రహ్మచారి ముదిరినా, బెండకాయ ముదిరినా కష్టమంటారు? మరి, ఆ ఆడ బ్రహ్మచారి సంగతేమిటో?" ఆఫీసులో ఓ వయసు మళ్లిన గుమాస్తాగారి కామెంట్.

అలాంటి మాటలు విని అర్చన ఫ్రెండ్స్ కాస్త బాధపడేవారు కాని, అర్చన ఆ మాటలు లెక్కచెయ్యలేదు.

ఇంటి దగ్గర కూడా అదే పరిస్థితి ఏర్పడింది. తెలిసినవాళ్ళంతా అర్చన పెళ్ళి సంగతి ఆ తల్లిని అడగడం మొదలుపెట్టారు.

"ఇంకా అమ్మాయికి పెళ్ళి చెయ్యరా? ఎవరినైనా ప్రేమిస్తోందేమో కనుక్కున్నారా?" కొందరి ప్రశ్నలు.

"అయినా... కూతురు సంపదను మరిగిన ఏ తల్లిదండ్రులూ పిల్లకు పెళ్ళి చేస్తారండీ?" కొందరి విసుర్లు.

ఆ మాటలకు ఆ తల్లి హృదయం తల్లడిల్లుతోంది.

"మా అమ్మాయి- తగిన వరుడు దొరికితే కాని పెళ్ళి చేసుకోనంటోంది?"

"మా పిల్ల బంగారుబొమ్మ! చేతినిండా సంపాదన! మా పిల్లకేం లోటు? వెతుక్కుంటూ వాడే వస్తాడండీ!" రామనాథంగారు మాత్రం సమాధానం చెబుతున్నారు.

చెల్లెలు బాగా సంపాదిస్తోందని తెలిసిన కొడుకు, కోడలు, పిల్లల్ని తీసుకుని ఒకరోజు బయలుదేరి వచ్చారు.

"నువ్వింత సంపాదకురాలివవుతావని నేననుకుంటూనే ఉన్నానమ్మా!" అన్నాడు అన్న రజనీకాంత్.

"నేననుకోలేదన్నయ్యా! అమ్మా, నాన్నల అదృష్టం వల్ల నాకీ ఉద్యోగం వచ్చింది!" సమాధానమిచ్చింది అర్చన.

కోడలు సంగతి చెప్పనే అక్కరలేదు. అవసరమున్నా, లేకపోయినా అర్చనను పొగుడుతూనే ఉంది.

ఆమె మాటలకి అర్చన మరింత చికాకుపడుతోంది.

"ఏరా అబ్బాయీ? చెల్లెలికి ఓ చీర కొనిపెట్టకపోయావురా?"

"అదే సంపాదించుకుంటోంది. దానికి నే కొనివ్వడం దేనికమ్మా! అయినా ఇలాంటి సెంటిమెంట్స్ నాకు లేవమ్మా!" తల్లికి సమాధానమిచ్చాడు ఆ సుపుత్రుడు.

"పోనీ.., మీ అమ్మకైనా ఓ చీర తేకపోయావురా?" తండ్రి ఉండబట్టలేక అడిగాడు.

"చెల్లెలు సంపాదిస్తోంది కదా! అదే కొంటుంది కదా! అందుకే మళ్ళీ నే కొనడమెందుకని తేలేదు నాన్నా!"

రామనాథంగారి మనస్సు చివుక్కుమంది. కొడుకు ఎంత స్వార్థపరుడో ఆయనకు తెలుసు! అయినా ఆ కొడుకు మీద ఏదో తెలియని మమకారం అలా అడిగించింది. అర్చన అన్న పిల్లలకి వెళ్ళేటప్పుడు ఏదైన కొనివ్వాలనుకుంది.

"అర్హతలేని వారికి ఏదిచ్చినా వ్యర్థమే అవుతుంది. ఏదీ కొనివ్వకమ్మా!" అని తండ్రి చెప్పినా అర్చన వినలేదు... అన్న కొడుకు, కూతుళ్ళకి బట్టలు కొని ఇచ్చింది.

అప్పుల సంగతి, ఇంటి సంగతి అడక్కుండానే భార్యాపిల్లలతో తిరిగి వెళ్ళిపోయాడు రజనీకాంత్. ఆ కొడుకు ఏ బాధ్యతా లేకుండా అలా వెళ్ళిపోతుంటే ఆ తల్లిదండ్రుల కళ్ళలో నీళ్లు నిలిచాయి.

ఇన్నాళ్లూ మొహంచూడని రామనాధంగారి చెల్లెలు భద్రకాళమ్మ హఠాత్తుగా ఇంటికొచ్చింది. ఆవిడ కొడుకు బి.ఎ. తప్పి ఓ ప్రైవేటు కంపెనీలో ఉద్యోగం చేస్తున్నాడు. సొంతిల్లు. కాస్త భూములు ఉన్నాయి. ఉద్యోగం రాక మునుపు అర్చనను కోడలిగా చేసుకోమని రామనాధం నోరు విప్పి అడిగారు.

"మా అబ్బాయికి వేలకువేలు కట్నాలిస్తామంటూ ఎంతోమంది వస్తున్నారన్నయ్యా!" భద్రకాళిగారి చేత చెప్పించాడు ఆమె భర్త.

ఇప్పుడు ఆవిడ ఎందుకు వచ్చిందో రామనాధంగారు, భార్యతోపాటు అర్చన కూడా ఇట్టే అర్థంచేసుకున్నారు. ఆవిడను కావాలనే తప్పించుకు తిరుగుతోంది అర్చన.

"అన్నయ్యా! నీ మేనల్లుడు రాజా, అర్చనను తప్ప ఎవరిని చేసుకోనంటున్నాడురా?" ఉండబట్టలేక ఆవిడ ఆ ప్రస్తావన ఎత్తింది.

"అర్చన అప్పుడే పెళ్లి చేసుకోనంటోందమ్మా!" సమాధానమిచ్చాడు. రామనాధం.

"అర్చన పెద్ద ఉద్యోగస్తుణ్ణి కాని చేసుకోనంటోంది వదినా?" భర్తకు వత్తాసు పలికింది ఆవిడ.

"అదేమిట్రా... పిల్లకు పెళ్ళి చెయ్యరా ఏమిటి? అయ్యో! అయ్యో! కావలసినవాళ్ళం... సంబంధం కలుపుకోవాలి కాని, అలా వంకలు పెడితే దానికి పెళ్ళి ఎలా అవుతుందిరా?" సాగదీసింది భద్రకాళి.

"అది బాగా చదువుకున్నపిల్ల, దాని మంచి చెడ్డలు దానికి తెలుసు? మనలా చదువుకోనిది కాదుగా?"

ఆ దంపతుల మాటలకి ఆవిడ పెట్టె సర్దుకుంది. ఎంత చెప్పినా భోజనం కూడా చెయ్యలేదు. పెట్టె తీసుకుని కోపంగా విసవిసా నడుచుకుంటూ వెళ్లిపోయింది. ఆ దంపతులిద్దరూ ఊపిరి పీల్చుకున్నారు. సాయంకాలం ఆఫీసు నుంచి వచ్చిన అర్చన ఆ సంగతి విని పకపకా నవ్వుకుంది.

అర్చనకు ప్రమోషన్ వచ్చింది.

క్రమంగా అప్పులన్నీ తీర్చేసింది. ఆ రోజు వారి సంతోషానికి అంతులేదు. ఆ రోజు హోటల్లో ముగ్గురు భోజనాలు చేసి వచ్చారు. ఆ రాత్రి ప్రశాంతంగా నిద్రపోయారు.

ఆ ఊళ్లో కొత్తగా బ్యాంక్ ఆఫీసర్‌గా వచ్చిన సంతోష్, అర్చన స్నేహితురాలు ప్రేమకుమారికి దగ్గర బంధువు. రెండుసార్లు ఆమె ఇంట్లోనే అర్చన అతన్ని చూసింది.

ఇద్దరికీ పరిచయం చేసింది ప్రేమకుమారి. అర్చనను పెళ్లి చేసుకోమని ఆమె సంతోష్‌కి చెప్పింది. ఒకరినొకరు ఇష్టపడ్డారు కూడా!

అంతవరకు పెళ్ళి సంగతే ఆలోచించని అర్చనలో కొత్త కోరికలు తలెత్తాయి. వసంతంలో ప్రకృతిలా ఆమె మనసు పులకరించింది.

ప్రేమ మొలకెత్తితే ఆపేదెవరు?

ప్రేమకుమారే దగ్గరుండి పెద్దల సమక్షంలో పెళ్ళి కుదిర్చింది.

పెళ్ళి ఆర్భాటం లేకుండా సింపుల్‌గా జరిగింది. హోటల్లో అందరికీ డిన్నర్ ఇచ్చారు. పెళ్ళికి అర్చన అన్న, వదిన, పిల్లలు వచ్చారు.

తల్లితండ్రుల్ని తీసుకువెడతానని రజనీకాంత్ పట్టుపట్టాడు.

అర్చన హనీమూన్‌కి ఆగ్రా వెళ్లడానికి ప్రయాణం పెట్టుకుంది. తనతోపాటు తల్లితండ్రుల్ని కూడా తీసుకెళ్లి తాజ్‌మహల్ వారికి చూపించాలని ఆమె కోరిక! అన్నగారితో అదేమాట చెప్పింది. అన్నగారు తిరిగి వెళ్లిపోయాడు.

హనీమూన్‌కి వెళుతూ ఆ ముసలి దంపతులు కూడా ఎందుకని అందరూ విస్తుపోయారు. అర్చన అందరికీ సమాధానం చెప్పదలచుకోలేదు. సంతోష్‌కుమార్ కూడా మొదట అంగీకరించలేదు. తర్వాత తన తల్లిని కూడా తీసుకువెళ్లాలని పట్టుపట్టాడు.

తాజ్‌మహల్ చూసి రామనాథంగారు, శాంతాదేవి ముగ్ధులయ్యారు.

ప్రయాణం ఎంతో బాగుంది. కాని, సంతోష్‌కుమార్ తల్లి ఆ దంపతుల్ని చూసి ఏవో సూటీపోటీ మాటలు అంటూనే ఉంది. కూతురు డబ్బుతో బతుకుతున్నారని హేళన చేసింది. అర్చన అవన్నీ తెలిసినా ఆవిడకు ఏ సమాధానం చెప్పలేదు. మొదటినుంచి కాస్త డబ్బున్నచోట పెరగడం వల్ల ఆ అహంకారం ఆమెలో ఉందని గ్రహించింది. సంతోష్‌కుమార్ మాత్రం అర్చనతో ఎంతో సంతోషంగా ఉన్నాడు. అత్తమామల్ని కూడా తగిన విధంగా ఆదరించాడు.

ఊళ్లో ఉద్యోగమయినా అర్చన, సంతోష్‌కుమార్‌లు వేరుగా కాపురం పెట్టా౹ మామగారు లేకపోవడం వల్ల అత్తగారు వచ్చి వాళ్ళతోనే ఉంది. అర్చన మీద అభిమానవె ఆమె సంపాదన మీద గౌరవమో కాని, అర్చనను బాగానే చూసుకుంటోంది అత్తగారు ఇంట్లో వంటపని ఆవిడే చేస్తోంది.

ఒకరోజు రజనీకాంత్ వచ్చి బలవంతంగా తల్లితండ్రుల్ని తీసుకుని వెళ్లాడు. అందులో కొడుకు స్వార్థం ఏముందో వారికి అంతుపట్టలేదు. కాని, ఇల్లు తనపేర రాయించుకోడానికే తీసుకువెళ్లాడని తెలుసుకోడానికి అట్టేకాలం పట్టలేదు.

ఒకరోజు దస్తావేజుల మీద సంతకం పెట్టమని బలవంతం చేశాడు. ఎంతలేదన్నా 30 లక్షల విలువ చేసే ఇల్లది. పైగా... అప్పంతా కూతురు తీర్చింది.

అందుకే 10 లక్షల వాటా ఆమె పేర రాని, మిగతా రెండు వంతులు కొడుకు పేర రాశాడు. అంతకంటే ఏమీ చెయ్యలేని రజనీకాంత్ అందుకు అంగీకరించాడు. రెండుపూటలా వంటపని, ఇంటిపని అత్తగారికే అప్పచెప్పింది ఆ కోడలు. వయసు మళ్లిన ఆవిడ ఆ భారం మోయలేకపోయింది. వెళ్లిన ఆరునెలలకే మంచానపడింది ఆ తల్లి.

"నా భార్య ఒక్కతే చెయ్యలేకపోతోంది నాన్నగారూ!" ఒకరోజు ఆ సుపుత్రుడు తండ్రితో అన్నాడు.

"ఇన్నాళ్లూ వంటరిగా ఒక్కతే అన్ని పనులు మీ అమ్మే కదరా చేసింది! ఇప్పుడు నీ భార్య చేస్తూంటే తెలిసొచ్చిందిరా?" రామనాధంగారు కాస్త గట్టిగానే అడిగారు.

"అందుకే మిమ్మల్ని వృద్ధుల ఆశ్రమంలో చేర్పిస్తాను. అక్కడ అమ్మకు పనీ ఉండదు, ఒంటరితనమూ ఉండదు! హాయిగా కాలక్షేపమూ అవుతుంది!" అన్నాడు.

తండ్రి ఏమంటున్నాడో వినిపించుకోకుండానే ఇద్దరినీ వృద్ధుల ఆశ్రమానికి పంపించేశాడు. అలవాటయిన మనవలిద్దరు మాత్రం బావురుమన్నారు.

అర్చన తండ్రి ఆశ్రమం నుంచి రాసిన ఉత్తరం చదువుకుంది. ఆమె గుండె చెరువయింది. సంతోష్‌కుమార్‌కి ఆ విషయం చెప్పింది. అతను కూడా చాలా బాధపడ్డాడు.

అర్చన తల్లితండ్రులను చూడ్డానికి బయలుదేరి వెళ్లింది. తల్లితండ్రుల్ని చూడలేకపోయింది. ఇద్దరిముఖాలూ వాడిపోయి ఉన్నాయి. సగం చిక్కిపోయారు. తాజ్‌మహల్‌ని చూస్తున్నప్పుడు కళకళలాడిన వారి ముఖాలు గుర్తుకువచ్చాయి. ఇంక అక్కడ ఉండలేక వారిని వెంటతీసుకుని బయలుదేరి వచ్చేసింది.

అత్తమామల్ని ఎంతో సంతోషంగా, ఆప్యాయంగా పలకరించాడు అల్లుడు.

"అర్చనా! వాళ్ళని కూడా ఇక్కడే ఉంచుకుందాం!" అన్నాడు.

'ఎంత మంచివాడు సంతోష్‌కుమార్!' అనుకుంది అర్చన.

ఆ సంతోషం అట్టేసేపు నిలవలేదు. 'వాళ్లు ఇక్కడ ఉండటానికి వీలులేద' ని పట్టుపట్టింది అత్తగారు. అర్చన తెల్లబోయింది.

"కూతురింట్లో ఉండడమేమిటి?' అంటోంది మా అమ్మ! నేనేం చెయ్యలేను అర్చనా! తండ్రిలేని వాడిని... ఆమెను కష్టపెట్టడం నాకిష్టముండదు!" అన్నాడు సంతోష్‌కుమార్.

"అలా అంటే ఎలా? మీ తల్లిని మీరు చూస్తున్నట్లే నా తల్లితండ్రుల్ని చూడవలసిన బాధ్యత నాదికాదా? మీ అమ్మగారికి నచ్చచెప్పండి!" అని అతన్ని ఒప్పించడానికి ఎంతో ప్రయత్నం చేసింది అర్చన.

"నా తల్లి మనసును కష్టపెట్టలేను" అన్నాడు సంతోష్.

"మాకోసం మీరిద్దరూ గొడవలు పడవద్దమ్మా! వయసు మళ్లిన వాళ్ళం... ఎలాగో అలాగ బతుకుతాం!" తల్లిదండ్రులు ఎంతగానో బతిమాలారు. అర్చన వినలేదు.

"సంతోష్... ఇక మనం విడిపోకతప్పదు! మా అమ్మానాన్నలను తీసుకుని మా ఇంటికి వెళ్లిపోతున్నాను. నువ్వు రోజూ మా ఇంటికి రావచ్చు. నేనూ వస్తూఉంటాను. మీ అమ్మను నువ్వు వదలలేవు. మా అమ్మా, నాన్నలను నేను వదలలేను."

అర్చన మాటలు విన్న సంతోష్ ఉలిక్కిపడ్డాడు.

"అదేమిటి అర్చనా? తల్లితండ్రుల కోసం భర్తను, కాపురాన్నీ వదులుకుంటావా?"

"అవును సంతోష్... అదే ప్రశ్న నిన్ను నేను అడుగుతున్నాను!"

అర్చన సమాధానానికి తెల్లబోయాడు సంతోష్.

అర్చన తల్లితండ్రులతో తిరిగి ఇంటికి వచ్చింది.

'కొడుకు బలవంతంగా ఇల్లు రాయించుకున్నాడనీ.., నా అనంతరం, నా భార్య అనంతరం ఈ ఇల్లు నా పిల్లలిద్దరికీ సమానంగా చెందుతుం' దని రామనాథంగారు మరో దస్తావేజు రాశారు. ఓ కాపీ కొడుక్కి పంపించాడు కూడా.

సంతోష్‌కుమార్‌కి భార్యమీద ప్రేమఉంది. ఆమె సంపాదన మీద, ఆమె ఆస్తి మీద మమకారముంది. అర్చన దగ్గరకు రోజూ వచ్చివెళుతూనే ఉన్నాడు. నాలుగు రోజులు అలిగినా తరువాత అల్లుడు వచ్చి వెళుతున్నందుకు కాస్త స్తిమితపడ్డారు రామనాథం దంపతులు.

తల్లితండ్రుల యోగక్షేమాలు అడుగుతూ రజనీకాంత్ లెటర్ రాశాడు.

'వారి బాధ్యత తప్పి ఆస్తిలో సగం వాటా వచ్చినందుకు కాబోలు!' అనుకుంది అర్చన.

సంతోష్‌కుమార్, రజనీకాంత్, అత్తగారు కళ్ళముందు తిరిగారు. ఓపిక తగ్గితే అత్తగారూ ఈ ఇంట్లో చేరవలసిందే!

'మమకారంలో కూడా ఎన్ని మచ్చలు?' అర్చన నవ్వుకుంది.



- 'ఆంధ్రప్రభ' ఆదివారం... 13 , 20 ఆగస్టు 2000

# నాకూ ఓ మనసుంది



విశాలి బి.ఎ పాసయింది.

ఉద్యోగం చేసి నెలజీతం అందుకోవాలని చాలా ఉబలాటపడింది.

"నీకు ఉద్యోగం ఎందుకమ్మా! హాయిగా భర్తతో కాపురం చేసుకోక!" తండ్రి మందలించాడు. "ఉద్యోగం చేసి సంపాదించే ఖర్మ నీ కెందుకే? పెళ్ళి చేసుకొని భర్తతో సుఖంగా కాపురం చేసుకో! పిల్లాపాపల్ని కని పెంచుకో! అత్తింట్లో పేరు సంపాదించుకో!" తల్లి మరీమరీ చెప్పింది.

ఆ ఇంట్లో తన మాట ఎవరూ వినరు. తన కోరికల్ని గౌరవించరు. సమయం కోసం ఎదురుచూడాలని నిశ్చయించుకుంది విశాలి.

శ్యామ్ బి.ఇ. ఇంజనీరు. మంచి ఉద్యోగం...

విశాలికి అతనితో వివాహం జరిగింది.

అత్తింట్లో అడుగు పెట్టింది. "అమ్మా... విశాలి! అత్తవారింట్లో అందరికీ తలలో నాలుకలా ఉండాలి. ఎవరు ఏమన్నా తలవంచుకుపోవాలి. ఎదురు చెప్పకూడదు. మంచి కోడలివని పేరు తెచ్చుకోవాలి. తెలిసిందా!" అమ్మమ్మ, నాయనమ్మ, తల్లి పదేపదే చెప్పారు.

"నేను ఒక సంవత్సరం ఉద్యోగం చేసి సంపాదించాలి! నా కాళ్ల మీద నాకు నిలబడాలని ఉంది. నా మాట మీరు విన్నారా? మీ మాట నేనెందుకు వినాలి?" ఎదురు ప్రశ్నించింది విశాలి.

"అదే... ఆ మొండితనమే ఆడపిల్లకి పనికి రాదంట!" తల్లి కోపం చేసింది. వాళ్ళని ఎదిరించి మెప్పించలేనని నిశ్చయించుకుంది విశాలి.

"సరేలే!" అంటూ అప్పటికి మనసును అదుపులో పెట్టుకుంది.

'అత్తవారింట్లో ఎవరేమంటారో! ఏ పని చేస్తే ఏం పాడవుతుందో!' విశాలికి మనసులో కాస్త గుబులుగానే ఉంది. కాని అత్త, మామ మంచివారులాగా ఉన్నారు. ఏ పనీ చెప్పడంలేదు. ఏ పని చేసినా వంకలు పెట్టడం లేదు. పైగా– "చాలా బాగా ఉందమ్మా!" అంటూ మెచ్చుకుంటున్నారు కూడా!

ఆడబిడ్డకు కాస్త చికాకు ఎక్కువ. అన్నింటికీ ఏదో అంటూనే ఉంటుంది. అయినా... విశాలి ఆమె మాటలు అంతగా పట్టించుకోలేదు. అనవసరంగా పుట్టింటివారు అత్తవారి మీద అవి ఇవి ఎందుకు కల్పించి చెబుతారో కూడా అర్థంకాలేదు. ఎంతైనా... 'పుట్టింటివారి ధోరణి ఈ విషయంలో చూడాలి' అనుకుంది.

ఓరోజు సాయంకాలం విశాలి తన మనసులో మాట చెప్పాలనుకుంది.

ఆ రోజు ఎక్కడికో సరదాగా తిరిగి రావడానికి తీసుకువెళతానన్నాడు శ్యామ్. స్నానం చేసి మంచిచీర కట్టుకుంది. అతని కిష్టమైన పకోడీలు వేసి ఉంచింది.

"ఏమండీ... నేనేదైనా ఉద్యోగంలో చేరుతానండీ! నెల తిరగ్గానే జీతం అందుకోవాలని సరదాగా ఉందండీ! ఇంతకంటే మంచి చీరలు కట్టుకోవచ్చు. దానధర్మాలు చేయవచ్చు. పేదపిల్లల్ని చదివించవచ్చు. మన పిల్లల్ని ఎంతో బాగా పెంచుకోవచ్చు!" భర్త ఎదపై వాలి ఎంతో గోముగా చెప్పింది.

శ్యామ్ అంతకంటే తెలివైనవాడు.

" నీకు ఉద్యోగం ఎందుకు విశాలీ... హాయిగా ఇంటిపట్టున ఉండి ఇంటిపనులు చేసుకోవచ్చుగా!" ఆమెను రెండు చేతులతో దగ్గరగా తీసుకుని కళ్ళల్లోకి కళ్ళు పెట్టి చూస్తూ సమాధానమిచ్చాడు.

"అది కాదండీ! నాకు ఉద్యోగం చెయ్యడం సరదా అండీ!" అంది మరింత మురిపెంగా!

ఆమె బుగ్గలు ముద్దాడిన శ్యామ్– "నీకు సరదాగా ఉంటే షికార్లకి వెళదాం! సినిమాలకి వెళదాం! మంచి చీరలు కొని పెడతా! నగలు చేయిస్తా! అంతేకాని, ఉద్యోగం చేయడం... అదేం సరదా? హాయిగా అమాంతం ఇద్దరి పిల్లల్ని కనేసి పెంచూ! అప్పుడసలు టైమ్ మిగలదు. పైగా... మా అమ్మకి, నాన్నకి ఆడవాళ్ళు ఉద్యోగం చెయ్యడం అసలు ఇష్టముండదు. ఇంక ఆ మాట ఎత్తకు!" భార్యను మరింత గట్టిగా పెనవేసుకుని సమాధానమిచ్చాడు శ్యామ్.

'అమ్మో... శ్యాచ్ కూడా అసాధ్యుడే!' అనుకున్న విశాలి తిరిగి వేచి చూడాలనుకుంది. అతని దగ్గర ఆ ప్రస్తావన మరింక తేలేదు.

కొంతకాలం గడిచింది.

విశాలికి ఇద్దరు పిల్లలు పుట్టారు. వాళ్ళు పెరిగి పెద్దవాళ్ళవుతున్నారు.., అత్త మామలు మరో కొడుకు దగ్గరకు వెళ్లారు.

పిల్లలిద్దరినీ స్కూల్లో చేర్పించారు.

సాయంకాలం ఇద్దర్నీ కూర్చోపెట్టుకుని చదువు చెబుతోంది.

పిల్లలతో ఆడుకోడానికి వచ్చిన వాళ్ళని కూడా కూర్చోపెట్టి చదివించడం, లెక్కలు చేయించడం మొదలుపెట్టింది.

"విశాలి గారూ! మీరు పిల్లలకి బాగా చదువు చెబుతారట! మా పిల్లలకి కూడా కాస్త చెప్పండి!" అంటూ ఆ చుట్టుపక్కల తల్లులు పిల్లల్ని తీసుకొచ్చి అప్పచెప్పారు. వద్దన్నా ఫీజు చేతిలో పెట్టి వెళుతున్నారు.

నెలకి తన సంపాదన రెండువేలు. బోల్డంత కాలక్షేపమే కాదూ! తన సంపాదన కోరిక నెరవేరుతోంది కూడా.

భర్తతో అదే మాట చెప్పింది.

"నేను క్యాంపులకి వెడితే నీకంతా చూడడం కష్టం! ఇదే బాగానే ఉంది విశాలి!" అన్నాడు సంతోషంగా.

ఆ చుట్టుపక్కల అందరితో విశాలికి మరింత పరిచయం ఏర్పడింది.

అందరి సహకారంతో పిల్లల కేర్‌సెంటర్ ప్రారంభించింది. ఇంటి వెనుకభాగం ఖాళీగా ఉంది. పిల్లలు ఆడుకోడానికి జారుడు బండలు, ఉయ్యాలలు వేయించింది.

శ్యామ్ సంతోషంగానే అంగీకరించాడు. పిల్లల సంరక్షణ చూడడానికి ఇద్దరు ఆయాలను, ఒక టీచర్ని పెట్టింది. సాయంకాలం పిల్లల ట్యూషన్‌కి మరో టీచర్ని కూడా ఏర్పాటుచేసింది.

తిరిగి వచ్చిన అత్తమామలు విశాలిని చూసి ఆశ్చర్యపోయారు. 'ఇంట్లో ఈ బెడదంతా ఏమిటి?' అని విసుక్కున్నారు.

"పోనీలేమ్మా! మీరు లేరు. పైగా... నేనూ క్యాంపుల కెడుతున్నా! ఇద్దరు చిన్నపిల్లలయితే విశాలి ఒంటరిగా ఉండడం కష్టం కదా! ఆమెకూ కాలక్షేపం ఉండాలి కదా!" శ్యామ్ విశాలిని సమర్థిస్తూ మాట్లాడాడు.

'... కాలక్షేపం అంటారు! కానీ, తనకూ కొన్ని ఆశయాలు ఉంటాయి. తనకూ కొన్ని కోరికలుంటాయి! అవి నెరవేరాలని వాళ్ళు ఎందుకనుకోరు?'... అనుకుంది మనస్సులో.

వాళ్ళకి అప్పుడే సమాధానం చెప్పదలుచుకోలేదు. సమయం రావాలనుకుంది.

అత్తమామల్ని చూడ్డానికి విశాలి తల్లిదండ్రులు కూడా వచ్చారు.

విశాలి నడిపే ఆ కేర్ సెంటర్, ఆమె చెప్పే ట్యూషన్స్ ఆ చుట్టుపక్కల సంచలనాన్ని కలిగించాయి.

విశాలి అత్తమామలకు. తల్లిదండ్రులకు కూడా మనస్సులో ఆశ్చర్యంగానే ఉంది. పైకి అనడానికి నోరు రావడంలేదు.

శ్యామ్‌కి చాలా సంతోషంగా ఉంది. "చాలా మంచిపని చేస్తున్నావు విశాలీ!" అంటూ పదేపదే అంటూనే ఉన్నాడు.

ఆరోజు ఆగస్టు 15.

పబ్లిక్ స్కూలు ప్రిన్సిపాలు వచ్చి విశాలిని ముఖ్యఅతిథిగా ఆహ్వానించింది.

విశాలికి చాలా సంతోషమనిపించింది. అంగీకరించి వాళ్ళని పంపించింది.

కేర్‌సెంటలో 8 గంటలకు జెండా వందనం చేయించింది.

అందరికీ చాకెలెట్లు, లడ్డూలు పంచి పెట్టింది. ఆ చుట్టు పక్కలున్న మురికివాడల్లో పిల్లల్నీ, తల్లుల్నీ, అందరినీ పిలిచింది. అందరికీ స్వీట్లు ఇచ్చింది.

పరిశుభ్రంగా ఎలా ఉండాలో, ఎందుకుండాలో, ఎందుకు చదువుకోవాలో వివరించి పంపించింది.

'మీ కాల్లు మొక్కుతాం తల్లి... మా పిల్లలకి కూడా రెండు ముక్కలు వంటబట్టేటట్టు చెయ్య' మని ప్రాధేయపడ్డారు.

మధ్యమధ్యలో వచ్చి వెళ్లమని సలహా ఇచ్చింది.

తరువాత పబ్లిక్ స్కూలు ఫంక్షన్‌కి బయలుదేరింది.

అత్తమామల్ని, తల్లి తండ్రుల్ని, భర్త శ్యామ్‌ని రమ్మని పట్టుపట్టింది. ముందు వద్దనుకున్నా అదేమిటో చూడాలని బయలుదేరారు.

విశాలిని సగౌరవంగా ఆహ్వానించారు. ఆమె వెంట అత్తమామలు, తల్లి తండ్రులు, పిల్లలతో శ్యామ్ నడిచారు.

అలా గౌరవం పొందడంలో ఏదో చెప్పలేని సంతోషం అందరికీ కలిగింది. విశాలి చేస్తున్న కృషిని ఎంతగానో అభినందించారు. ఆడవాళ్ళు ఆమె బాటలో నడిచి కృషి చేయాలన్నారు.

"దేశమును ప్రేమించుమన్నా! మంచి అన్నది పెంచుమన్నా! సొంతలాభము కొంత మానుకు పొరుగువానికి తోడు పడవోయ్! '... అన్న గురజాడ వారి మాటలు అక్షరాలా నిజం చేసిన మహిళ విశాలి! అందరికీ ఆదర్శం!" అంటూ పేర్కొన్నారు.

ఆమె చేత జెండావందనం చేయించారు. విశాలి కళ్ళల్లో ఆనందభాష్పాలు ముత్యాలై మెరిశాయి.

విశాలిని మాట్లాడమని అందరూ పట్టుపట్టారు.

ఆమేమి మాట్లాడుతుందనుకున్నారు అత్తమామలు. ఆమె ఏమి చెబుతుందో వినాలనుకున్నాడు శ్యామ్!

విశాలి మైక్ దగ్గరకు వచ్చింది.

చిన్నతనంలో తనకు మనసులో ఉద్యోగం చేయాలని ఎంత కోరికగా ఉండేదో వివరించింది. తరువాత తల్లితండ్రులు, అత్త మామలు, భర్త ఏ విధంగా వద్దన్నారో తను మనస్సులో ఏ విధంగా మధన పడిందో తెలియచెప్పింది.

'స్త్రీలకు ఓమనసు ఉంటుందనీ, అందులో ఆలోచనలు, ఆశయాలు, కోరికలు ఉంటాయని, ఎందుకు ఆత్మీయులు గుర్తించ' రని ప్రశ్నించింది.

తనకూ ఓ మనసు ఉందని, అది ఇన్నాళ్ళకు ఆచరణలో చూపించగలిగానని, ప్రతి ఒక్కరూ ఎదుటివారిని గౌరవించడం, వారు చెప్పినది వినడమేకాదు.., తమని తాము గౌరవించుకోవాలని, తనకూ ఓ మనసుందని గుర్తుంచుకోవాలని.., సమాజం కోసం, దేశం కోసం పాటుపడాలని, తన మనసును తాను గౌరవించుకోవాలి, మనసులోని మాటలు

ఆచరణలో పెట్టాలని తెలియచెప్పింది. స్త్రీ కీ మనసు ఉంటుందని అందరూ అనుకోవాలి. గౌరవించాలి. అయినా... మనసుకు స్వేచ్ఛ నివ్వాలని కోరింది.

జనం కొట్టిన హర్షధ్వానాలతో ఆ ప్రదేశమంతా మారు మ్రోగింది.

అత్తమామలూ, తల్లితండ్రులూ విశాలి మాటలకు సిగ్గుపడుతూనే మనసారా దీవించారు.

భర్త శ్యామ్ కూడా ఆమె మాటలకు ఆశ్చర్యపోయాడు. ఆమెకూ ఓ మనసుంటుందని ఇన్నాళ్లూ గుర్తించలేనందుకు సిగ్గుపడ్డాడు.

అందరూ ఇంటికి తిరిగి వచ్చారు. విశాలిని ఇంటెదుమంది గౌరవించారు. అందరూ గర్వపడ్డారు. విశాలి చేసే ప్రతీ పనికి అందరూ సహకరిస్తామన్నారు.

'నాకూ ఓ మనసుంది..!' విశాలి మనస్సు కుదుటపడింది.

కొత్త కొత్త పథకాలతో ముందుకుసాగింది విశాలి.

ఆమెకు తోడుగా ఆ వాడే కదిలింది.



*- '**విజేత**' దిన పత్రిక... 13 డిసెంబరు, 1*

# సంధ్యలో విరిసిన చెంగల్వ



మల్లమ్మ ఇంకా పనికి రాలేదు.

అప్పటికే ఉదయం 11 గం॥లు దాటింది. వీధుల్లో నల్లా చుట్టూ చేరి నీటి కోసం పేర్చి ఉన్న ఖాళీ బిందెలు, మోరీ చుట్టూ గుట్టగా ఉన్న ఖాళీ అంట్ల గిన్నెలు, పక్కనే బకెట్టు నిండా ఇంటెడిమంది స్నానం చేసి వదిలిన తడిబట్టలు..!

– వాటిని చూస్తుంటే లలితాదేవి గుండె వేగం హెచ్చింది.

ఈ గిన్నెలన్నీ ఎప్పుడు తోముకోవాలి?

ఎప్పుడు ఈ బట్టలన్నీ ఉతకాలి..?

ఎప్పుడు వంట చేసుకోవాలి..?

ఒంటిగంటకల్లా అందరూ ఆవురావురంటూ ఇంటి ముఖం పడతారు. వడ్డించిన కంచాలు టేబులు మీద కనపడకపోతే నానా హంగామా చేస్తారు. ఎలాగో ఏమిటో? ఈ పరిస్థితి ఏ గృహిణికీ  ఎదురవ్వకూడదు.

... ఆవిడ మనస్సు మనస్సులో లేదు. ఏమాత్రం గేటు చప్పుడయినా అటే తొంగి చూస్తోంది. అది గాలికని తెలియగానే ఆమె ముఖంలో రంగు మారుతోంది.

'అయినా... చెప్పకుండా ఒక్క పూటా మానదు. ఏం జరిగిందో, ఏమిటో?!

ఒకవేళ తాగొచ్చి మొగుడు కొడితే కోపమొచ్చి పుట్టింటికేమయినా పోయిందేమో?!

ఒకవేళ పిల్లాడికి ఏ జ్వరమయినా వచ్చిందేమో?!

అలా అయినా, ఏ మందులు కొనటానికో పైసలు కోసం వస్తూనే ఉంటుంది. ఏం జరిగిందో ఏమో?'... అని లలితాదేవి పరిపరి విధాల ఆలోచిస్తోంది.

అంతలో– వీధిగేటు తీసిన చప్పుడు అయింది. ఆవిడ అదృష్టాన్ని పరీక్షించుకుంటూ వేగంగా అటు అడుగులు వేసింది.

మల్లమ్మ తీసిన గేటు పెట్టి లోపలికి వస్తోంది.

'అమ్మయ్యా...' అనుకుంటూ లలితాదేవి గుండెల మీద చేతులేసుకొని  సోఫాలో వాలింది.

చంకన  కుర్రాడిని ఎత్తుకొని మల్లమ్మ లోపలికి వచ్చింది.

లలితాదేవి నిదానంగా ఆమె ముఖంలోకి చూసి ఉంటే... కళకళలాడే మల్లమ్మ ముఖం నిండా మబ్బులా ఆవరించిన దీనత్వం కనబడేది.

లలితాదేవికి మనస్సులో అంతవరకూ ఉన్న ఆందోళన పోయి, కోపం చోటుచేసుకొంది. మల్లమ్మ దగ్గరకు రాగానే ఆ కోపం– కొట్టిన సోడాబుడ్డిలోంచి సోడా పొంగినట్లు పైకి పొంగింది.

"ఆలస్యంగా రావద్దని నీకెన్నిసార్లు చెప్పినా బుద్ధి లేదే? గుమ్మం ముందు ముగ్గు లేదు! అంట్లగిన్నెలు చూడు... ఎలా పడి ఉన్నాయో? ఆ బట్టలు ఎలా నానిపోతున్నాయో చూడు! నీకు జీతం తగ్గిస్తేగాని బుద్ధిరాదే!" ఆవిడ  అరుపులకి మల్లమ్మ చంకలోని మూడేళ్ల కుర్రాడు భయంతో తల్లిని పట్టుకొని ఏడుపు ప్రారంభించాడు.

ఆవిడ మాటలకి ,అర్థం తెలియకపోయినా తల్లిని తిడుతోందని మాత్రం అర్థం చేసుకున్నాడు!

చేత్తో వాడి వీపు నిమిరి ఆప్యాయంగా వాడి తల భుజం మీద వాల్చుకొంది.

వాడు ఏడుపు మాని మధ్యమధ్యలో తలెత్తి ఆవిడవైపు చూస్తున్నాడు.

మల్లమ్మ నోరు మెదపలేదు.

ఆమె కళ్లలోంచి నీళ్లు బొటబొటా రాలి బుగ్గల మీంచి వక్షస్థలం మీద పడి చీరకొంగు తడిసింది.

చంకలో కుర్రాడిని నేలకు దించింది.

కప్పుకొన్న చిరుగుల పమిటకొంగుని భుజాల మీంచి కప్పుకొని కళ్ళు తుడుచుకొంది.

పాదాలు నేల్లో కూరుకుపోయినట్లు నిలబడింది.

లలితాదేవి సమాధానం చెప్పని మల్లమ్మను తలెత్తి చూసింది. ఉబ్బిన కళ్ళనుంచి నీళ్లు ఉబికివస్తున్నాయి. నుదుటిమీద కమిలిన దెబ్బలు.

"అలా ఉన్నావేం... మల్లమ్మా? ఏమయిందీ? ముఖం మీద ఆ దెబ్బలేమిటే?" ఆదుర్దాగా అడిగింది.

సోఫాలోంచి లేచి మల్లమ్మకి దగ్గరగా వచ్చి చూసింది.

మల్లమ్మ కంఠం దుఃఖంతో పూడుకుపోయి మాట పైకి రాలేదు.

మల్లమ్మ పాతచీర కొంగు నిండా రక్తపుమరకలు, వీపు నిండా దెబ్బలే!... చిరిగిన జాకెట్టులోంచి దీనంగా దర్శనమిచ్చాయి.

లలితాదేవి కళ్ళు తడి అయ్యాయి. ఆమె మనస్సు విలవిల్లాడింది.

మల్లమ్మ మెల్లిగా గొంతు సవరించుకుంది వచ్చే దుఃఖం దిగమింగింది.

రాత్రి మొగుడు తాగొచ్చి చావగొట్టిన విషయం వివరించింది.

అప్పుడప్పుడు పోచయ్య తాగొచ్చి కొడుతూనే ఉంటాడు. కాని, ఇంతగా మరెప్పుడూ కొట్టలేదు.

"నిన్ను కొట్టటానికి వాడికి చేతులు ఎలావచ్చాయే? గొడ్డును బాదినట్లు బాదేడు కదే?! నీకెప్పుడూ చెబుతూనే ఉన్నా వాడిని పొమ్మనవే! నువ్వూ, నీ కొడుకూ బతకలేరా? నాలుగిళ్లు చేసుకొని హాయిగా బతకొచ్చు గదే!" ఆవిడ గొంతు జీరపోయింది.

"బతకొచ్చునమ్మా, కాని ఆడు మొండోడు... పోడు గదమ్మా! మీరే ఈడికి బుద్ధి చెప్పాలమ్మా! నా పాణాలు మీరే కాపాడాలి!"

మల్లమ్మ కడుపులో బలవంతంగా దాగివున్న దుఃఖమంతా కట్టలు తెంచుకొని పైకి వచ్చింది.

'నాగరికత ఎంత పెరిగినా, దేశాలు ఎంత అభివృద్ధి సాధించాయనుకుంటున్నా ఈ 'ఆడవారి బతుకులు' మాత్రం మారడంలేదు. ఏం బతుకులో.., ఏమిటో!'

లలితాదేవి మనస్సులో అనుకున్న మాటలు పైకే వినబడ్డాయి.

"ముందు లేచి కూర్చో! ఏడిస్తే ఏం లాభం!" లలితాదేవి రెండు చేతులతో మల్లమ్మను లేపి కూర్చోబెట్టింది.

"ఆడు తాగితే మనిషి కాదమ్మా! ఆడిని మీరే మందలించాలమా!" మల్లమ్మ వెక్కివెక్కి మళ్లీ ఏడ్చింది. చంటివాడు కూడా ఆమె ఏడుపుతో శృతి కలిపాడు.

"ముందు ఏడుపు మాని వాణ్ణి దగ్గరకు తీసుకో! ఈ పోచయ్య సంగతి నే చూస్తా! వీడి తాగుడు మండిపోను? వీళ్లకి ఈ తాగుడు జబ్బేమిటి? పైగా... ఆడవాళ్ళని కొట్టే ఈ పోయే కాలమేమిటి?"

ఈ ప్రభుత్వాలు కూడా అంతే! తాగుడు నిషేధమన్నారు- అది మూణ్ణాళ్ల ముచ్చటే అయింది. మళ్లీ మరో ఇన్ని దుకాణాలు తెరిచాయి- "రండిరా! రండి! తాగండిరా! మీ ఆడవారిని మరింత కొట్టండిరా!" అన్నట్టుంది.

"ఆడవాళ్ళని మేమే ఉద్ధరించేస్తాం!" అంటూ చాటింపులలొకటి!

ఏం ఉద్ధరించటమో? ఏమిటో? తాగుడు నిషేధం ఒక్కటి చాలు... ఆడవా ఉద్ధరిం...కి!

అది లేకుంటే మిగతావి వాళ్ళు చేసేదేమిటి?"

... లలితాదేవి ఏం చెయ్యలేక. ప్రభుత్వాన్ని దుయ్యబట్టింది.

"ఇదిగో... మల్లమ్మా! తాగేవాళ్ళని నమ్మకూడదు. వదలేసి పొమ్మనక ఇంకా సంప్రదింపులేమిటి? అప్పుడు కాని జ్ఞానోదయం కాదు వీళ్ళకి!"

"అలా అనకమ్మా... ఈరోజుల్లో తాగనిదెవరమ్మా? పెద్దింటోళ్ళు బాండి, ఇస్కీలు ఎ.సి.ల్లో కూర్చొని తాగుతారమ్మా! ఈళ్ళు ఇలా రోడ్ల మీదే తాగి ఇంటిదాని మీద పడతారమ్మా! ఎలాగైనా మీరే ఆడికి బయం చెప్పాలమ్మా!" మల్లమ్మ తిరిగి బతిమాలింది.

"అన్ని చావుదెబ్బలు తిన్నా నీకు బుద్ధి రాలేదే? ఇంకా వాణ్ణి వెనకేసుకొస్తున్నావు? ఈవేళ ఇక్కడే ఉండిపో! వాడికి బుద్ధి నే చెబుతా!"

"అలా అనకమ్మా! ఆడు తాక్కపోతే మంచోడేనమ్మా! ఆడికి తాగొద్దని చెప్పమ్మా!"

పోచయ్య మీద మల్లమ్మకున్న ప్రేమకు లలితాదేవి ఆశ్చర్యపోయింది.

'నిజమే... వీళ్ళు తాగొచ్చి ఒళ్ళు బద్దలు కొడతారు. కాని, అంతస్తు గలవాడు గుండెలే బద్దలు చేస్తారు!'... లలితాదేవి మనస్సు మూల్గింది.

ఎందుకో... కళ్ళు చెమర్చాయి. అంతరంగాన్ని బయటపెట్టినట్లు మల్లమ్మ చూడకూడదని కళ్ళు తుడుచుకుంది.

మల్లమ్మ గిన్నెలు తోమడానికి సన్నద్ధురాలయింది.

"ఇలా ఉంటే ఆ గిన్నెలేమి తోముతావే? ఈ పూటకి అవసరమైనవి నే తోముకుంటాలే!" అంతవరకు గిన్నెలు తోముకోవడం మహామహా భారమనిపించిన లలితాదేవికి ఇప్పుడెందుకో ఆ పని తేలికనిపించింది.

"ఇవన్నీ మాకు మామూలేనమ్మా! మీరేం తోముకుంటారు?" మల్లమ్మ మోరీవైపు అడుగులేసింది.

మూడేళ్ళ పిల్లాడు ఆమె వెంటే కదిలాడు.

"ఇదిగో మల్లమ్మా! కాస్త మంట తగ్గుతుంది. ఈ ఆయింట్‌మెంట్ రాసుకో!" అంటూ ఆయింటుమెంటు తీసి అందించింది.

"వేడివేడి కాఫీ తాగితే కాస్త సెవనుగా ఉంటుంది. కాఫీ కలిపి పట్టుకొస్తానుండు"

లలితాదేవి లోపలకు వెళ్లి కప్పునిండా కాఫీ పట్టుకొచ్చింది.

మల్లమ్మ శోకదేవతలా గిన్నెల ముందు కూలబడింది. చంటాడు ఆయింటుమెంటు మూత తీసి తల్లి దెబ్బల మీద మందు రాస్తున్నాడు.

'కష్టాలే మనుషుల్ని తీర్చి దిద్దుతాయంటారు. ఇదేనేమో!' తల్లికి మందు రాస్తున్నాడు, తల్లితోపాటు గిన్నెలు కడుగుతాడు, ఇల్లు తుడుస్తాడు!

లలితాదేవి వాడినే చూస్తూ నిలబడింది. మల్లమ్మ తాగడానికి కాఫీ కప్పు అందుకుంది.

అంతలో పోచయ్య– "మల్లీ! మల్లీ!" అనుకుంటూ లోపలకి వచ్చాడు.

"అమ్మా... ఆడిని గట్టిగా అడుగమ్మా! అడుగమ్మా!" మల్లమ్మ కాఫీ కప్పు పక్కన పెట్టి లలితాదేవిని తొందరపెట్టింది.

పోచయ్య ఏం జరగనట్లుగానే మల్లమ్మ వైపు అడుగులేశాడు.

"ఏం పోచయ్యా! నువ్వు అసలు మనిషివేనా! ఆమెనట్టా కొట్టటానికి చేతులెలా వచ్చాయిరా? నాలుగిళ్లు చేసుకొని, నిన్నూ, నీ సంసారాన్ని పోషించేది ఆమేకదా! ఆమె పెట్టిన కూడుతిని ఆమెనే కొడతావా? తగలని చోట తగిలితే, ప్రాణం పోతే ఏం చేసేవాడివి? పైగా... మొగుడు చావగొట్టాడని పోలీసు కంప్లైంటు ఇస్తే ఈపాటికి కటకటాల్లో ఉండేవాడివి? ఇప్పటికైనా బుద్ధి తెచ్చుకో?"

"తప్పైపోయిందమ్మా! మల్లంటే నాకు పాణం అమ్మా! నేను తాగాలని తాగలేదమ్మా!

అందరూ బలవంతంగా నాచేత తాగించారమ్మా! ఆమె ఎదిరిత్తె తెలీని కోపంలో కొట్టినా! తప్పైపోయిందమ్మా!" అంటూ బలిమాలాడు.

మల్లమ్మ ముఖంలో సంతోష రేఖ సన్నగా తొంగిచూసింది.

లలితాదేవికి అతని మాటల్లో నిజం ఉందని పించింది. అవి నోటిలోనుంచి వచ్చిన అబద్ధపు మాటల్లా లేవు. పశ్చాత్తాపంతో కడుపు చించుకు వచ్చిన మాటల్లా అనిపించాయి. తల్లిదండ్రులులేని మల్లమ్మను అన్నీ తానై నెత్తిన పెట్టుకొని చూసుకుంటున్నాడు. దేనికీ వేధించినట్టు మల్లమ్మ ఎపుడూ చెప్పలేదు. మొదటి కాన్పు కూడా అతనే పోసుకున్నాడు.

'తాగితే మనిషికాడు. మల్లమ్మ నిజమే చెప్పింది' అనుకుంది మనస్సులో.

"ఏం పోచయ్యా! చావగొట్టి 'తప్పు చేశాను. క్షమించ' మంటే సరిపోతుందా! ఏ కాలో, చెయ్యో విరిగితే ఏం చేసేవాడివీ? ఇకనైనా ఆ తాగుడు మానేసి బుద్ధిగా ఉండు!" మరోసారి మందలించింది లలితాదేవి.

"మరెప్పుడూ తాగనమ్మా, బుద్ధిగానే ఉంటానమ్మా! పిల్లగాడి మీద ఒట్టమ్మా!" పిల్లాడి నెత్తిన చెయ్యిపెట్టాడు.

"ఇదిగో... మధ్యలో ఆ చంటాడి మీద ఒట్టెందుకు? తాగుడు మాను. అంతేచాలు ఇదిగో... మరో కప్పు కాఫీ కలిపిస్తా!" ఆవిడ తిరిగి లోపలకి వెళ్లబోయి ఆగి, "ఆ కాఫీ ఈపాటికి చల్లారి పోయిందేమో, వెచ్చబెట్టి ఇవ్వనా?" తిరిగి అడిగింది లలితాదేవి.

"చల్లారినా ఫరవాలేదమ్మా! ఇద్దరికీ ఈ కప్పు చాలమ్మా!" పోచయ్య కాఫీ కప్పు అందుకున్నాడు.

మల్లమ్మను మరో చేత్తో లేవదీసాడు.

ఇద్దరూ పక్కగా వెళ్లి కూర్చున్నారు. వారి వెంటే పిల్లాడు నడిచాడు.

మొగుడు బతిమాలగానే అందుకోసమే ఎదురుచూస్తున్న మల్లమ్మ అతని మీద వాలింది.

ఆమె ముఖం 'సంధ్యలో విరిసిన చెంగల్వ'లా విచ్చుకొంది.

ఇద్దరూ చెరో సగం కాఫీ తాగారు.

లలితాదేవి వారిని గమనిస్తూనే ఉంది. వీరు కష్టాలు కూడా ఇలాగే పంచుకుంటారు. ఉన్ననాడు లేనినాడు వారి జీవితాలు ఒకలాగా సాగుతున్నాయి... అనుకుంది.

మల్లమ్మ కాస్త కుదుట పడినట్లు ఆమె ముఖమే చెబుతోంది.

ఆమె గిన్నెలు తోమింది, అతను కడిగి పక్కన పెట్టాడు. చంటాడు ఒక్కొక్కటి తీసి తెచ్చి లోపలపెట్టాడు.

అతను బట్టలుతికాడు, ఆమె ఆరవేసింది. అతను వాకిలి ఊడ్చాడు, ఆమె నీళ్లు చల్లి ముగ్గువేసింది.

ఇద్దరూ ఒకర్నొకరు కొంటెచూపులతో పలకరించుకుంటూనే ఉన్నారు. ముసిముసి నవ్వులతో మురిసిపోతూనే ఉన్నారు.

లలితాదేవి వారిని వింతగా చూసింది.

ఇప్పటివరకు ఇద్దరూ పోట్లాడుకున్నారు. అతను చావగొట్టాడు, ఆమె దుమ్మెత్తిపోసింది. అంతలోనే ఏమీ జరగనట్టు ఇద్దరూ పసిపిల్లల్లా కలిసిపోయారు.

ఎంత నిష్కల్మషమైన ప్రేమ వారిది. అది వారికి వరమేమొ?

అంతలో... ఆమె ఆలోచనలు ఆమె చుట్టూ తిరిగాయి.

ఏం జరిగినా తాను సర్దుకుపోవాలనుకుంటుంది. కాని, భర్తకు కోపంతోపాటు పంతం కూడా ఎక్కువ. ఓ పట్టాన ఆ కోపం తగ్గదు. ఎంత బతిమాలినా వినడు, అరుస్తూనే ఉంటాడు. శత్రువుల మీద కోపం చూపినట్టు కట్టుకున్న భార్య మీద కక్ష కట్టి సాధిస్తాడు.

నాగరికత పెరిగిన కొద్దీ మనుష్యుల మధ్య పంతాలు– పట్టింపులు ఎక్కువవుతున్నాయేమొ? పెళ్ళయిన కొత్తలో తన భర్త ఇలాగే ఉండేవాడు. తను ఎక్కడ ఉంటే అక్కడే ఉండేవాడు. వంట చేస్తుంటే గరిట పట్టుకొని కలిపేవాడు, కూరలు తరుగుతుంటే కత్తి పట్టుకొని కూరలు తరిగేవాడు. కూడా ఇల్లు సర్దేవాడు.

అందుకే అపుడు తన ముఖంలో మబ్బు తునకలే లేవు.

'ఆడుతూ, పాడుతూ పనిచేస్తుంటే అలుపూ–సొలుపు ఎందుకు?' అని ఒక మహాకవి చెప్పినట్లుగా తనకు అపుడు అలుపే తెలీదు. కాని, ఇప్పుడు అందరూ ఉన్నా ఒంటరితనం! ఒకే ఇంట్లో ఉన్న శరీరాలు వేరుగా తిరిగినట్లే మనసులు కూడా వేరుగానే తిరుగుతున్నాయి. ఆ ముసిముసి నవ్వులు ఎప్పుడో ఎగిరిపోయాయి. జీవితం అందుకే భారంగా అనిపిస్తోందేమొ?

ఆవిడ కళ్ళల్లో నీళ్ళు తిరిగాయి. కళ్ళు ఒత్తుకొంది. అనవసరంగా ఎక్కువ ఆలోచిస్తూ ఉన్నానేమో! తిరిగి సర్దుకొని ఊరట చేకూర్చుకొంది. పని పూర్తిచేసుకొని వచ్చిన మల్లమ్మ– "వెళుతున్నానమ్మా!" అంది.

"అన్నం, కూర ఉన్నాయి... పట్టుకెళ్లు!" లోపలకు వెళ్లి అన్నం, కూర పట్టుకొచ్చి అక్కడ పెట్టింది.

"రాతిరి కాడనుండి ఒక ముద్ద తినలేదమ్మా! నేనే అడుగుదామనుకున్నానమ్మా! నీ కడుపు చల్లగా నువ్వే యిచ్చినావమ్మా! చంటాడికి రెండు ముద్దలు తినిపిత్తా. కాసిని నీళ్లియ్యమ్మా!" మల్లమ్మ అలా అనగానే ఆవిడ మంచినీళ్ల చెంబు అక్కడ పెట్టింది.

"రాత్రి నుంచి తిండే లేదా? ఎలా ఉండగలిగారే? అ చంటాడు ఎలా ఉన్నాడే?" ఆవిడ ఆశ్చర్యంగా అడిగింది.

"మా కలవాటేనమ్మా! ఆకలెప్పుడు మా పక్కలోనే ఉంటాదమ్మా!" అన్నం గిన్నె తీసుకొంది మల్లమ్మ. నీళ్ల చెంబు అందుకున్నాడు పోచయ్య. చంటివాడి చేయి పట్టుకొని పారిజాతం చెట్టు కింద కూర్చున్నారు. అన్నంగిన్నె లోనె కలపబోయింది. అదిచూసి చంటాడు చప్పరించాడు. పోచయ్య చూపులు గిన్నెలోని అన్నం చుట్టూ తిరుగుతున్నాయి.

అంతలో... "ఒదినె!" అనుకుంటూ పోచయ్య తమ్ముడు చంద్రయ్య అక్కడ ప్రత్యక్షమయ్యాడు.

"మీరు ఇంటికాడ లేకపోతే ఈడ ఉంటారనొచ్చినా!" అన్నాడు.

చాలారోజుల్నుంచి ఆ ఇంట్లో పనిచెయ్యడం వల్ల ఆ ఇల్లు అందరికీ తెలుసు!

"ఏందిరా ఇప్పుడొచ్చావు? అందరు బాగున్నారా? ఏంది పని?"

"తెల్లారకుండానే బస్సుకి బయలుదేరినా! మీ మరదలికి పొద్దులు. చేతిలో పైసా లేదు. రెండు దినాల నుంచి కూడే లేదు" తలవంచుకొనే అన్నకు సమాధానం ఇచ్చాడు చంద్రయ్య. అతని మాటలు నీరసంగా ఉన్నాయి.

మల్లమ్మ అతని వైపు జాలిగా చూసింది.

"అలా ఎల్లి చేతులు, ముఖం కడుక్కో!" నీళ్లచెంబు అందించింది.

చంద్రయ్య మారుమాటాడకుండా ముఖం, చేతులు కడుక్కొచ్చాడు. ఆకలి కడుపులో నకనకలాడుతోంది. అబ్దుల్‌గంజిలో బస్సు దిగి బోల్డంత దూరం నడిచివచ్చాడు. ఆకలిగా ఉందని పైకి చెప్పలేకపోయాడు. దారిలో కొనుక్కొని తినటానికి జేబులో పైసాలేదు. బస్సు టిక్కెట్టుకే బొటాబొటీగా సరిపోయింది.

"ఇదిగో... రెండు ముద్దలు తిను. కాస్త కడుపు చల్లగా ఉంటుంది!" అన్నం గిన్నె అతను కూర్చున్న చోటికి తోసింది.

"చంటోడికి రెండు ముద్దలు తినుపించు ఒదినె!" అన్నాడు.

గిన్నెలోంచి తీసి మల్లమ్మ రెండు ముద్దలు కొడుక్కి తినిపించింది. రెండు గుక్కల నీళ్లు తాగిపించింది. బెలూనులో సగం గాలి కొడితే పొంగినట్లు వాడి పొట్ట సగం నిండి నిగనిగలాడింది. చంద్రయ్య తినడం మాని గిన్నెలోనె చెయ్యి కడుక్కున్నాడు.

చెంబులో అడుగున మిగిలిన నీళ్లు ఇద్దరూ చెరో గుక్కెడు తాగారు.

గిన్నె, చెంబు కడిగి పట్టుకొచ్చి వారగా పెట్టిన మల్లమ్మ "ఇగ పెడుతున్నానమ్మా!" అని చెప్పి చంటాడిని చంకన వేసుకొని మగనితో కబుర్లు చెప్పుకుంటూ కదిలింది.

లలితాదేవి ఆమెను మరింత ఆశ్చర్యంగా చూసింది. మల్లమ్మ ముఖంలో, మాటల్లో ఆనందం తొంగిచూస్తోంది.

'దానం- ధర్మం, పుణ్యం- పాపం, స్వర్గం- నరకం... వేటికోసమూ తాపత్రయపడని బతుకులు వీరివి. తాను ఆకలితో ఉన్నా, ఆకలితో ఉన్న మరోవ్యక్తికి ఇంత అన్నం పెట్టింది' లలితాదేవి గుండె తడయింది.

కల్లా కపటం లేని నిజమైన బతుకులు వారివి. భర్త చేతిలో చావుదెబ్బలు తిన్నా అంతలోనే సర్దుకొని సంతోషంగా ఇద్దరూ కలిసిపోయారు.

'సంధ్యలో విరిసిన చెంగల్వ... ఈ మల్లమ్మ' అనుకొంది లలితాదేవి.



# వానకారు కోయిల



కాలచక్రం తిరుగుతూనే ఉంది.

వసంతం వెంట గ్రీష్మం, వర్షాకాలం వస్తూనే ఉంటాయి.

వర్షాకాలం మాత్రం ఎంతకాలం నిలుస్తుంది..? తన పని పూర్తికాగానే తన దారిన తాను వెళ్లిపోతుంది.

తామరాకు మీది నీటిబొట్టులా ఇవేమీ పట్టించుకోని మనిషి మనసు మాత్రం ఆశల పల్లకీలో పయనిస్తూ ఉంటుంది.

ఆ వెన్నెల మనసు– 'తిరిగి వసంతం ఎప్పుడు వస్తుందా..?' అని ఎదురుచూస్తోంది.

వసంతం వస్తే కాని సమీర్ రాడు. సమీర్ వస్తే కాని, తన జీవితానికి వసంతం రాదు.

ఫాల్గుణం కదిలి చైత్రం సమీపిస్తోంది.

దూరంగా కోయిల గొంతు సవరిస్తున్న అస్పష్టనాదాలు వినబడుతున్నాయి. గాలి చప్పుళ్ళకే ఉలిక్కిపడే 'వెన్నెల' లేతమనసులో కవోష్ణపు రాగాల జల్లులు :

"పోస్టు..!" అన్న కేక వినబడగానే వెన్నెల ఒక్క పరుగున వీధుల్లోకి వచ్చింది.

పోస్టుమాన్ అందించిన కవరు కంగారులో అడ్డదిడ్డంగా చింపి చదివింది.

"అమ్మా! పక్కవాళ్ళు మళ్లీ వచ్చేస్తున్నారు!" అంటూనే తిరిగి లోపలికి తల్లి దగ్గర వాలింది.

"ఎప్పుడు వస్తున్నారమ్మా?"

"ఎల్లుండి పొద్దుట!" తల్లికి సమాధానమిచ్చింది వెన్నెల.

"ఎల్లుండేనా? ఎన్ని పనులున్నాయి? ముందు ఇల్లు కడిగి శుభ్రం చేయించాలి!" ఆవిడ ఇంకా ఏదో చెబుతూనే ఉంది.

'వెన్నెల' అక్కడ నుంచి కదిలి తన గదిలో మంచం మీద వాలిపోయింది.

వెన్నెల కళ్ళ నిండా కొత్త వెలుగు..!

ఆ వెలుగులో గతం కథ రీలులా తిరిగింది.

... ఆ కథలో అంతటా సమీరే!

పెరటి చెట్టు మీద కూర్చున్న వసంత కోయిల "కూ..! కూ..!" అంటూ కూస్తోంది. పిల్లలు తిరిగి, "కూ! కూ!" అంటున్నారు. వారితో గొంతు కలిపింది వెన్నెల.

మరింత పంతంతో కూస్తోంది కోయిల.

అంతలో పక్కింటిముందు కారు ఆగిన శబ్దం! పిల్లలందరూ వీధి అరుగుల మీద ...రి కారు వైపు ఆశ్చర్యంగా చూశారు.

వారి మధ్యలో నిలబడిన వెన్నెల– తల్లి వెంట కారు దిగుతున్న సమీర్‌ను చూసి ఆశ్చర్యపోయింది. ఫుల్‌సూటులో ఉన్న అతనిలో ఏదో వింత అందం..!

'అమెరికాలో చదువుకుని వస్తే– ఇలా ఉంటారు కాబోలు, అబ్బో..!' అనుకుంది.

పిల్లలు వెక్కిరించడం ఆపగానే కోయిల తిరిగి పాట అందుకుంది.

తలుపులు తీసుకుని లోపలకి అడుగు వేసిన సమీర్– ఆ కోయిలను వింతగా చూశాడు. చిన్నతనంలో ఆ ఊళ్ళోనే కోయిలను చూసిన జ్ఞాపకం!

"పక్షి చిన్నదేకాని, ఎంత అందమైన పాటో... వింతగా ఉంది కదమ్మా!"

"పిట్టకొంచెం... కూత ఘనం అంటారు ఇందుకే!" కొడుక్కి సమాధానమిచ్చిందా తల్లి.

"ఉగాది పచ్చడితోపాటు కాఫీ కూడా ఇచ్చి వచ్చా కదా! ఈ పూట భోజనాలకి మనింటికే వస్తున్నారు!" తల్లి మాటలకి-

"అలాగా..!" అంది వెన్నెల.

"అవునమ్మా! మేమే ఒండుకుంటాం... అంటూ ఒకటే పట్టు! వాళ్ళని వప్పించేటప్పటికి నా తలప్రాణం తోక్కి వచ్చిందనుకో!"

"నిజంగా నీ ప్రాణం అప్పుడే తోకకి వచ్చేసిందామ్మా!" తల్లి మాటలు మళ్లీ అడుగుతూ పకపకా నవ్వింది వెన్నెల.

"సరేలే... నీతో కూర్చుంటే నా పని అయినట్లే!" ఆవిడ వంటింటి వైపు నడిచింది.

"వీళ్ళు కూడా ఈరోజు ఉగాది పచ్చడి తింటారా?"

"అలా అంటావేమిటి సమీర్! ఈ సాంప్రదాయాలన్నింటికీ పుట్టిళ్ళు ఈ పల్లెటూళ్లే! అమెరికాలో అన్ని సరకులు దొరకవు కాని, లేకపోతే అమెరికాలో కూడా ఈ ఉగాది పచ్చడి ఉగాది పండక్కి స్పెషలే అవుతుంది! అయినా... అమెరికాలో కూడా మన ఇడ్లీ, వడ, దోసె, గోంగూర పచ్చళ్ళతో పాటు ఇదీ స్పెషల్ అవుతుంది... చూస్తూండు!"

"నిజమే... నాలాటి వాళ్ళకి అక్కడికి కూడా వీటిని పట్టుకువెడితే కాని తోచదు కదా! ఆ పని మాత్రం చెయ్యకు" అంటూ తల్లికో నమస్కారం పెట్టాడు సమీర్.

తల్లితో పాటు సమీర్ కూడా నవ్వుకున్నాడు.

'దీంట్లో షడ్రుచులు ఉంటాయి! మన భావాలను వెల్లడిస్తాయి. అదే దీని స్పెషల్..! ముందు దీన్ని నోట్లో వేసుకుంటే తప్ప కాఫీ ఇవ్వను తెలిసిందా!"

చెయ్యి చాచి చంటి పిల్లాడిలా మారాం చేస్తూ పచ్చడి తిన్నాడు సమీర్.

ఆ సాయంకాలం పాలేరు వెంకన్న తోడు రాగా మామిడి తోట వైపు వెళ్లాడు సమీర్.

అంతలో... దిక్కులు పులకించేలా ఒక మధుర గానం చల్లని సమీర తరంగంతో పాటు వచ్చి వారి చెవులకు తాకింది.

మామిడి తోటకు ఎదురుగా ఉన్న పూలతోటలో నుంచి ఆ గానం వస్తోంది.

"ధీర సమీరె యమునా తీరె... వసతివనే వనమాలీ!"

పాట వస్తున్న వైపు సమీర్ చురుగ్గా అడుగులు వేసాడు. అతని వెంటే వెంకన్న!

బావి పక్కన ఇత్తడి బిందె సమీర్‌లాగే వెలవెలబోయింది.

కాలాన్ని ఎవరూ ఆపలేరన్నట్లుగా చీకటి చుట్టుముట్టింది.

కళ్ళు మరో వెలుగు తోడుంటే తప్ప- మరేది కాంచలేవు. దారి వెతుక్కుంటూ ఇంటి వైపు నడిచాడు.

అతడు ఏ పని చేస్తున్నా అతని ఆలోచనలన్నీ 'వెన్నెల' వైపే!

ఓ శిల్పి చెక్కిన అపురూపశిల్పంలా సమీర్ కళ్ళ ముందు ఆమె.

కోయిల పాటతో పాటే ఆమె పాట వింటూనే ఉన్నాడు.

అతడి ఊహల చల్లదనంలో వసంతం గడిచి జ్యేష్ఠం ప్రవేశించినా ఆ ఎండల వేడి అతనికి తెలియడం లేదు.

అంతలో... ఒకరోజు వడగాల్పుల మిట్ట మధ్యాహ్నపు వేళ ఊరి చివర గుడిసె లంటుకున్నాయి. నల్లని పొగలు భయంకరంగా ఊరును చుట్టుముట్టాయి.

అందరూ మంటలు ఆర్పడానికి పరుగులెట్టారు.

"అమ్మా! నేను వెడుతున్నా!" సమీర్ వారి వెంటే పరుగెత్తాడు.

ఎప్పుడూ అరుగు దిగని ఆ కొడుకు ఈరోజు అందరితో కలిసి అలా పరుగెడుతుంటే ఆ తల్లి శ్యామలాదేవికి ఆశ్చర్యంగా అనిపించింది. పరిసరాల ప్రభావం మనిషి మీద ఎంతగా ఉంటుందో అర్థంచేసుకుంది.

అంతలో... ఆషాఢ మాసపు మబ్బులు ఆకాశాన్ని చుట్టుముట్టాయి.

ప్రకృతిలో ఏదో గందరగోళం! పుడమితల్లికి ఏవో పులకింతలు..!!

ఆరోజు చినుకులు పడి ఆగిపోయాయి. సమీర్ తోటవైపు బయలుదేరాడు.

మామిడి చెట్ల మధ్యలో నిలబడి పాడుతోంది. యమునా తటిలో వేణువులా పరిసరాలను పులకింప చేస్తోంది ఆమె గానం! తనను చూస్తే ఎక్కడ పాట ఆపివేస్తుందోనని సమీర్ మెల్లిగా అడుగులు వేస్తూ చెట్టుచాటున నిలబడ్డాడు. కొంచెం తడిసిన ఎండుటాకుల మీద మనిషి పాదాల చప్పుడు ఇట్టే పసికట్టింది.

"హలో... వెన్నెలగారూ! మీరు నాకు పాట బాకీ ఉన్నారు. బాకీ తీరేవరకు కదలను!" అన్నాడు సమీర్ నవ్వుతూ.

"పాడుమంటే పాట రాదు. నేను పాడినప్పుడే మీరు వినాలి!" ఆమె కిలకిలా నవ్వుతుంటే ఆమె మనసు అద్దంలా ప్రతిబింబించింది.

వారి పరిచయం మరింత గాఢమయింది.

ఇద్దరూ రాజహంసల జంటల్లా ఆ తోటలో పరుగులు పెట్టారు.

పువ్వులతో ఆడుకున్నారు.., పిట్టలతో ఎగిరి గంతులేశారు.

సమీర్ వెళ్లవలసిన రోజులు దగ్గర పడుతున్నాయి.

వెన్నెల ఆకాశాన్ని ఆవరించాయి. ఉరుములతో మెరుపులతో వానలు ప్రారంభమయ్యాయి.

"అమ్మా! కోయిల పాట వినపడదేం?!" సమీర్ అమాయకంగా అడిగాడు.

"వేసవిలో మామిడి చిగుళ్ళు తిని పదును పెట్టుకున్న కంఠంతో పాడే కోయిల కంఠం మూగ బోయింది. అందుకే పాట లేని కోయిలను 'వాన కారు కోయిల' అంటారు బాబూ!" తల్లి మాటలు సమీర్‌కి ఆశ్చర్యంగా అనిపించాయి.

ఆ సాయంసంధ్యలో సమీర్ తోటలో వెన్నెలను కలిశాడు.

"వెన్నెలా! నాకు బాకీ ఉన్నా పాట పాడవా?" ప్రేమగా అడిగాడు సమీర్.

ఆ మాటల్లో జాలి ఉంది, అభ్యర్ధన వుంది.

వెన్నెల సమాధానం చెప్పలేదు.

"నేను వెళ్లిపోతున్నానని బాధపడుతున్నావా? వాన కారు కోయిల్లా నీ గొంతు మూగబోయిందా?"

"అవును సమీర్... వసంతం లేనిదే కోయిల పాట లేదు. కోయిల పాట లేనిదే వసంత శోభ లేదు!"

వెన్నెల మనస్సులో సుళ్ళు తిరుగుతున్నది ప్రేమా? ప్రణయమేనని ఆ కన్యకు తెలియదు.

సమీర్ సమీపంలో ఉండాలి! అంతే!

"వెన్నెలా! శిశిరం తరువాత వసంతం రాక మానదు. ఈ వర్షాకాలం తరువాత శరదృతువు రాక మానదు. వసంతంలో మళ్లీ కలుసుకుందాం!" సమీర్ బయలుదేరాడు.

అతను తిరిగి ఆ పరిసరాలకు రాగలుగుతాడో, లేదో అతనికే తెలియదు.

వెన్నెలను కలుసుకుంటాడో లేదో అంతకంటే తెలీదు. ఇంకా ఏదీ జీవితంలో నిర్ణయించుకోలేదు.

సుప్రభాత వేళలో సమీర్ తల్లితో ప్రయాణమయ్యాడు. ఎదురుగా తల్లి అక్క చెల్లి, తమ్ముళ్ళ మధ్యలో వెన్నెల. సమీర్ అందరికీ "టా! టా!" అంటూ చేయి ఊపాడు.

కారు ముందుకు కదిలింది. సన్నని జడివానలో వెన్నెల కన్నీళ్లు ఎవరికీ కనబడలేదు. సమీర్ తల పక్కకు తిప్పాడు. తల్లి చూడకుండా కళ్ళు తుడుచుకున్నాడు.

వెన్నెల ఎదురుచూస్తూనే ఉంది. వసంతం సమీపిస్తోంది.

శుభవార్తను మోసుకుంటూ వచ్చిన ఉత్తరాన్ని పోస్టుమాన్ అందించాడు.

ఆశించిన శుభవేళలో కారు ఆ ఇంటి ముందు ఆగింది. వెన్నెల ఊపిరి బిగపట్టి చూస్తోంది. సమీర్ కారు దిగాడు.

వెనకే తల్లి దిగింది.

ఎంతో మంది గ్రామవాసులు స్వాగతం పలికారు. ఆ గ్రామంలోనే ఫ్యాక్టరీ పెట్టి సమీర్ ఉండిపోతాడన్న వార్త ఊరంతా పరిమళంలా వ్యాపించింది.

అందుకే స్వాగతం చెప్పడానికి ఊరంతా కదిలివచ్చింది.

ఆ దృశ్యాన్ని చూస్తూ ఆనందం పట్టలేక ఆ మూగబోయిన 'వానకారు కోయిల' అలాగే నిలబడిపోయింది.

సమీర్ చూపులు ఆమెను చుట్టుముట్టాయి.

సమీర్ తల్లి సంతోషానికి అంతులేదు.

"అమ్మా! ఇంక నేను అమెరికా వెళ్లను. మన భూములు చూసుకుంటూ ఎరువులు ఫ్యాక్టరీ ప్రారంభిస్తానమ్మా!"

అంతక్రితం ఎంత చెప్పినా వినని కొడుకు– ఇప్పుడు ఆ పల్లె వెళ్లి వచ్చిన తరువాత అక్కడే స్థిరపడతానంటే దానికి 'వెన్నెలే' కారణమని ఆవిడ ఇట్టే అర్థంచేసుకుంది.

చిక్కి సగమయిన వెన్నెలను ఆప్యాయంగా చూసుకుంది.

"కోయిలవై పాడాలి! వసంతం వచ్చేసిందమ్మా!" వెన్నెలను దీవించింది మనసులోనే.



# మానవత్వం పరిమళించిన వేళ



తూర్పు వాకిట వెలుగు పొడ సూపలేదు.

ఇంకా జనం నిద్రలోనే ఉన్నారు. అక్కడక్కడ "భౌ! భౌ!" మంటూ కుక్కలు మాత్రం అరుస్తూనే ఉన్నాయి.

వీధి తలుపు మీద 'టకటకా' కొట్టిన శబ్దానికి కోటమ్మ ఉలిక్కిపడి కళ్ళు తెరిచింది.

"ఎవరో తలుపు కొడుతున్నారు!" మొగుడు కిట్టయ్యను– "లే! లే!" అంటూ గట్టిగా కుదిపింది. అతను కళ్ళు తెరవకుండానె కదిలి అటు తిరిగి మళ్లీ పడుకున్నాడు.

అలా అర్ధరాత్రి, అపరాత్రి తలుపు కొట్టేది ఎవరో కోటమ్మకి బాగా తెలుసు.

భయంతో శరీరం వణికింది. అలా తలుపు మీద 'టక టక' శబ్దం అవుతూనే ఉంది. పోలీసులు లాఠీతో కొట్టే శబ్దమది. ఇక తలుపు తీయక తప్పదనుకున్న కోటమ్మ పాత పట్టెమంచం దిగి తలుపు వారగా పడుకున్న అత్తను సమీపించింది.

"అత్తమ్మా! ఆళ్ళు వచ్చినట్టున్నారు... లెగు!" అంది నెమ్మదిగా.

"ఏందిట?" ఎప్పుడో మెళకువ వచ్చినా పక్కమీద పడుకునే ఉన్న మల్లమ్మ-మెల్లిగా గొంతు తగ్గించి అడిగింది.

"తెల్వదు..!"

తలుపు మీద మరింత గట్టిగా శబ్దమయింది.

"తలుపు తియ్యే? ఏంది భయం!'" రావులమ్మ మరింత గొంతు తగ్గించి చెప్పింది.

"జరిగేదేదో జరుగుతుంది! తప్పించుకోలేం!" అనుకున్న కోటమ్మ లైటు వేసి తలుపు తీసింది.

"కిట్టయ్య ఎక్కడా..?" ఎదురుగా నిలబడ్డ ఎస్సై గద్దించాడు.

కోటమ్మకి నోరు పెగల్లేదు. ఉన్నాడంటే ఏ ప్రమాదమో, లేదంటే ఏ ప్రమాదమో తెలియలేదు.

"ఆడు పండుకుండు!" రావులమ్మ కోడలి వెనక నుంచే సమాధానమిచ్చింది.

"ఇదిగో ముసలీ! నీ మాట ఎవరు నమ్ముతారే? వెళ్ళి వాడిని పిలుచుకురా? లేదా లాఠీ విరుగుతుంది జాగ్రత్త!"

కిట్టయ్యను లాఠీలతో చావకొట్టడం ఆ అత్తాకోడళ్లు ఎన్నోసార్లు చూశారు.

బాధతో మెలికలు తిరుగుతూ కిట్టయ్య పెట్టే ఆర్తనాదాలు వారి చెవుల్లో ఇంకా గింగురుమంటూనే ఉన్నాయి.

భయంతో అత్తా, కోడళ్ల శరీరాలు వణికాయి.

రావులమ్మ లోపలకి వెళ్ళి కిట్టయ్యతో తిరిగి అక్కడకు వచ్చింది. కిట్టయ్యను చూడగానే క్రూరమృగంలా గర్జిస్తూ ఎస్సై అతని జుట్టు పట్టుకుని బయటకు లాక్కొచ్చాడు.

"ఏరా కిట్టిగా... ఆ పంతులు గారింట్లో దొంగతనం చేసింది నువ్వేనా? చెప్పురా?" అంటూ మోకాళ్ల మీద లాఠీతో బలంగా కొట్టాడు.

"నేనేరి కాడ దొంగతనం సెయ్యలేదు బాబా! ఆ రాతిరి ఇంటికాడే ఉన్నా!" లాఠీ దెబ్బలతో మోకాళ్ళ చిప్ప పగులుతుంటే... భరించలేని బాధతో కిట్టయ్య మొత్తుకుంటూ చెప్పాడు.

"ఆడు ఇంటికాడే ఉన్నాడయ్యా! దొంగతనానికి పోనే లేదు బాబూ!" రావులమ్మ మళ్లీ మళ్లీ చెప్పింది.

"ఓ! ముసలీ! నీ మాట లెవరు నమ్ముతారే! నీ మొగుడో గజదొంగ! వాడి వెంట పోయి దొంగతనాలు చేసింది చాలక- కొడుకును కూడా దొంగగా తయారుచేశావు! నీ చరిత్ర ఎవరికి తెలియదే! ఎక్కువ వాక్క- నోరు మూసుకో!" ఎస్సై గద్దిస్తూ ఆమె మీదికి లాఠీ ఎత్తాడు.

ఈలోపు ఇద్దరు కానిస్టేబుళ్ళు అక్కడకి చేరుకున్నారు.

ఎస్సై చెప్పినట్టుగా ఇల్లంతా వెతికారు. కాని, ఎక్కడా వారికి ఏమీ దొరకలేదు.

'పాపం... వీడు దొంగతనం చెయ్యలేదేమో!' అనుకున్నారు వాళ్ళు. ఈసారి ఎస్సైకి కూడా కాస్త అనుమానమొచ్చింది.

"ఈడు దొంగతనం నిజంగా చెయ్యలేదా? పేరు మోసిన దొంగలంతా సెంట్రల్ జైల్లో ఉన్నారు. ఈడొక్కడే బయట ఉన్నా వీడే దొంగతనం చేస్తే నగలేమైనట్టు?" ఎస్సై పదేపదే ఆలోచించాడు.

'స్టేషన్‌కి తీసుకెళ్లి తన్నితే, గాని అసలు సంగతి తెలీదు!' అనుకున్న ఎస్సై-

"ఆడిని స్టేషన్‌కు తీసుకురండి!" అనగానే కానిస్టేబుళ్ళు కిట్టయ్యను తీసుకె స్టేషనులో కటకటాల వెనుకకు తోసి తాళంపెట్టారు.

కిట్టయ్య తండ్రి దొంగలముఠాలో ఉండి దొంగతనాలు చేసేవాడు.

ఆ చుట్టుపక్కల పేరు మోసిన దొంగల ముఠా అది. రావులమ్మ కూడా మొగనితో వెళ్లి దొంగతనాలు చేసేది.

వారితో పాటు ఎన్నోసార్లు లాఠీ దెబ్బలు తింది. జైలుశిక్షలు అనుభవించింది.

ఒక ఊరనక అలా తిరుగుతూనే ఉన్నారు.

కిట్టడు చిన్నతనంలోనే మొగడు రంగడు చనిపోవడంతో రావులమ్మకు బతకడమే కష్టమయింది. లాఠీ దెబ్బలతో పళ్ళు ఊడిపోయాయి. మోకాలి చిప్పలు పగిలిపోయాయి. కుంటుతూ నడుస్తుంటే అందరూ 'మంధర' అని పిలుస్తూ ఆమె వెంటపడి వేధించడం మొదలుపెట్టారు.

ఇంక అక్కడ ఉండలేని రావులమ్మ ఏం చెయ్యడానికీ తోచక దిక్కులేనిదానిలా ఆ వూరు వదిలి వచ్చేసింది.

కొత్త ఊరులో పొలాల్లో కూలిపని చేసుకుంటూ కిట్టయ్యని పెంచింది. వాడు దొంగ కాకుడదనుకుంది.

కాని, కిట్టడు ఎంత భయపెట్టినా చిన్నతనం నుంచి చిన్నచిన్న దొంగతనాలు చేస్తూనే ఉన్నాడు. వాడు దొంగలు ముఠాలో చేరలేదు.

వంటరి దొంగ కిట్టయ్యకు పెళ్ళయి కోటమ్మ కాపురానికొచ్చింది.

ఆమె కాస్త చదువుకుంది. పెళ్ళైన మొదటిరోజె కిట్టయ్య దొంగ అని ఆమె పసికట్టింది. రాత్రి వెళ్లి చీరలు, రవికలు, పంచెలు, దుప్పట్లు అలా ఏవేవో చేతికందినవి తెచ్చి ఇంట్లో పడేసేవాడు. మరునాడు అమ్మి డబ్బు తెచుకుని వచ్చేవాడు.

మధ్యలో బంగారు, వెండి నగలతో పాటు- డబ్బు కూడా తెచ్చి ముంతలో పెట్టి పెరట్లో గొయ్యి తీసి పాతేసేవాడు.

అతన్ని మార్చాలని కోటమ్మ ఎంతో ప్రయత్నించింది.

ఆమె మిషను కుట్టేది. చుట్టుపక్కల ఇళ్ళలో పాచిపనులు చేసేది. అందరికీ తలలో నాలుకలా ఉండేది.

క్రమంగా ఓ సొంత పాక సంపాదించుకోగలిగారు.

కిట్టయ్య రోజూ దొంగతనానికి వెళ్లకపోయినా అతను పోలీసుల దృష్టిలో దొంగే! వారి రికార్డులలో అతని పేరు ఉంది.

ఎన్నోసార్లు పట్టుబడి కిట్టయ్య పోలీసుల చేతుల్లో లాఠీ దెబ్బలు తిన్నాడు. జైలు శిక్షలూ అనుభవించాడు.

కిట్టయ్యకు ఓ కూతురు పుట్టింది.

కూతురు మీది ప్రేమతో కోటమ్మ బలవంతంతో కిట్టయ్య దొంగతనాలు తగ్గించాడు. అలవాటు పడిన చెయ్యి అప్పుడప్పుడు అర్ధరాత్రివేళ మంచం వదలి, ఇల్లు వదలి దొంగతనాలు చేస్తూనే ఉన్నాడు.

పోలీసుల లిస్టులో అతని పేరు మొదటే ఉంది.

తెల్లారి అత్తా, కోడలు పోలీసుస్టేషన్‌కి బయలుదేరి వెళ్లారు.

కిట్టయ్య కటకటాల గదిలో ఓ బల్లమీద పడుకుని ఉన్నాడు. తల్లిని, భార్యని చూడగానే లేచి కూర్చున్నాడు.

"అయ్యా! ఆడు ఏ దొంగతనం సెయ్యలేదు. ఆడు ఇంటికాడనే ఉన్నాడయ్యా! ఇదిగో ఈ సంటిదాని మీద ఒట్టయ్యా!" అంటూ ఎస్సైని ఎన్నోవిధాల బతిమాలింది తల్లి.

"ఇదిగో ముసలీ! పంతులుగారింట్లో పోయిన నగలు దొరకాలా! అప్పుడే ఈడిని వదిలేది!" ఎస్సై మాటలకి కోటమ్మ కంగారు పడింది.

రావులమ్మకి ఏం చెయ్యాలో తోచలేదు.

"కిట్టయ్య దొంగతనం సెయ్యలేదు. ఇంటికాడ పడుకునే ఉన్నాడు. ఆరింట పోయిన నగలు ఎట్టా తేగలడు?" కోటమ్మ, రావులమ్మలు ఆలోచిస్తూనే ఉన్నారు.

అంతలో... కంప్లైంటు ఇవ్వడానికి కూతుర్ని వెంటబెట్టుకుని పంతులుగారు అక్కడకు వచ్చారు. ఎస్సై చెప్పినట్టుగా పంతులుగారు కాగితం మీద రాసి సంతకం పెట్టారు.

"మీకు ఎవరి మీదైనా అనుమానమా?" ఎస్సై అడిగాడు.

"లేదు బాబూ!" పంతులుగారు సమాధానం చెప్పాడు.

"అయితే... దొంగలే వచ్చి ఉండాలి! మీ ఇంట్లో నగలు ఉన్నట్లు తెలిసి ఉంటుంది?" అన్నాడు ఎస్సై.

"తెలియడానికేముంది బాబూ! రేపు తెల్లవారితే ఈ అమ్మాయి వివాహం. ఇంట్లో ఉన్న పాత ఇత్తడి సామానంతా అమ్మి మంగళసూత్రాలు, బంగారు పుస్తెల తాడు, పెళ్ళికొడుకి ఉంగరం చేయించాము. మొత్తం 4 తులాల బంగారం! ఆ వస్తువులు లేకపోతే అమ్మాం పెళ్ళే ఆగిపోతుంది. ఈ ఊళ్లో తలెత్తుకు తిరగలేము. ఈ పిల్ల, మేము ఆత్మహ చేసుకోవలసిందే? ఇంక ఏ గత్యంతరమూ లేదు బాబూ!" ఆయన కళ్ళు నీటిత నిండిపోయాయి. మాట తడబడింది.

ఆయన మాటలకి ఆయన కూతురు వైష్ణవి పమిటకొంగుతో కళ్ళొత్తుకుంది. అక్కడున్న వారందరూ కూడా అదే స్థితిలో ఉన్నారు.

"అంత మాటనకండి పంతులుగారూ! ఎక్కడున్నా దొంగని పట్టుకుని మీ నగలు మీకిప్పిస్తాం!" అన్నాడు ఓ కానిస్టేబులు.

"ఎంతోమంది పెళ్ళిళ్ళకు ఒకనాడు మంగళ సూత్రాలు చేయించి ఇచ్చాను. ఎన్నో దానాలు, ధర్మాలు చేశాను. పాము కాటుకు మందేసి పోయిన ప్రాణాలు తిరిగిపోశాను. ఏ పుణ్యమూ మమ్మల్ని ఆదుకోలేదు. ఏనాడు చేసిన పాపమో ఇది. ఏ పుణ్యమూ మావెంట రాలేదు. మీరే మమ్మల్ని కాపాడాలి!" అన్న పంతులుగారి మాటలు అందరినీ కలచివేశాయి.

ఆ మాటకి రావులమ్మ ఆయన్ని పరిశీలనగా చూసింది.

"సందేహం లేదు! ఆ పంతులుగారే! కిట్టయ్యను ఆనాడు పాము కాటేస్తే ఆ విషం తాను పుక్కిటపట్టి తన కొడుకును కాపాడిన దేవుడు ఆయనే!" ఎల్లమ్మ బాధతో ఉక్కిరిబిక్కిరయింది.

వెంటనే కొడుకు దగ్గరకు పరుగెత్తింది.

"ఒరే కిట్టయ్యా! ఇప్పటికైనా నిజం చెప్పరా? ఆ పంతులుగారు ఎవరో కాదు! నిన్ను పాముకాటు నుండి కాపాడిన దేవుడురా!" అంది రావులమ్మ వెక్కివెక్కి ఏడుస్తూ!

"ఓయమ్మా! నేసెప్పేది నిజమే? నీ మీద ఒట్టే... నేనే పాపం సెయ్యలేదే! నా బిడ్డ మీద ఒట్టే!" అన్నాడు బాధగా... అతని కళ్ళలో నీళ్లు నిలిచాయి.

"ఆరికి ఎంత కట్టం వచ్చినాదిరా? మరి ఎట్టాగరా? సెప్పరా?" అంటూ రావులమ్మ కొడుకును బతిమాలింది.

"నే సత్తె పెమాణం సేసి సెప్పుతున్నా! నాకు ఏ పాపం తెల్వదే? అయినా... ఓపని సేద్దారి... ఆయన పానం కాపాడుదారే? ఆయన పాణం గుటుక్కుమనకుండా సూద్దారే?" అన్నాడు కిట్టయ్య.

"మనం ఏటి సేగలంరా! అది బంగారమాయె!" అంది తల్లి.

"మం ఏటైనా సేయగలం! మన పానాలు కాపాడినాయన పానాలు మనం సూసుకోవాలి గందా! నావి కంటె కాసులు ఉన్నాయిగా! ఆటిని మార్చేసి ఏటేన సేద్దారి!" అంది కోటమ్మ.

"అట్టా సేద్దారి!" అంది ఎల్లమ్మ.

కిట్టయ్య ముఖంలో సంతోషం వెల్లివిరిసింది.

తల్లి చంకలో ఉన్న చంటిపిల్ల బుగ్గల్ని రెండు చేతులతో తాకాడు. తాను కటకటాల్లో ఉన్న సంగతి మరచి చంటిదాన్ని ఎత్తుకున్నంత సంబరపడ్డాడు.

అత్తా, కోడలు అలా కిట్టయ్యతో మాటాడుతుంటే ఎస్సైకి చాలా కోపం వచ్చింది.

"ఏమిటా గుసగుసలు? ఏం జరుగుతోందక్కడ? నడవండి!" అంటూ హూంకరించాడు.

అత్తా, కోడలు వెనుదిరిగి పంతులుగారి పాదాల మీద పడ్డారు.

"పాము కాటు నుంచి మా కిట్టయ్యని కాపాడింది మీరే బాబూ! ఆడు మీ ఇంట దొంగతనం సెయ్యలేదు బాబూ! ఆ పని ఏరు సేసిండో తెల్వదు బాబూ!" అన్నారు.

"లెండి! లెండి! అంతా ఆ భగవంతుని లీల!" అంటూ ఆయన ఎస్సైవైపు తిరిగాడు.

"అస్తమించే పొద్దులా ఉన్నాను... నగలు దొరికితే పెళ్ళికి వచ్చి అక్షింతలు వేయండి. లేకపోతే అనాథ ప్రేతాలుగా దగ్గరుండి మా శవాలకు దహన సంస్కారాలు చేయించండి నాయనా!" అంటూ ఆయన వెనుదిరిగారు. ఆయన వెనకే కూతురు అడుగులేసింది.

పంతులుగారి మాటలకి అందరి హృదయాలూ బాధతో అల్లకల్లోలమయ్యాయి. అక్కడున్న వారందరూ ఒకరు చూడకుండా ఒకరు కళ్ళొత్తుకున్నారు.

కిట్టయ్య మనస్సు కుదుటపడింది. తాను ఆ ఇంట్లో దొంగతనం సేయకపోయినా ఆరిని కాపాడాను అనుకున్నాడు కిట్టయ్య.

ఎస్సై కిట్టయ్యని విడిపించాడు.

"మరెప్పుడూ ఇటు రాబోకురా!" అంటూ మందలించాడు.

కిట్టయ్య ఓ మనిషే! మానవత్వం పరిమళించిన వేళ ఆనందం వెల్లి విరుస్తుంది. కిట్టయ్య– తల్లి, పెళ్ళాం వెంట తృప్తిగా పంతులుగారింట్లో పెళ్ళికి బయలుదేరారు.



–'ఆంధ్రప్రభ' ఆదివారం... 8 డిసెంబర్, 2002

ఎలాగైనా కొడుకుని ఇంజనీరు చెయ్యాలన్నదే వారి ఆశయం.

రెండవసారి పురిటికి వచ్చిన అపర్ణ తమ్ముణ్ణి చూసి మరింత సంబరపడింది.

"మీ మామయ్య ఇంజనీరు అవుతాడురా! నువ్వు కూడా బాగా చదివి మీ మామయ్యలా ఇంజనీరే అవ్వాలిరా!" మూడేళ్ల కొడుక్కి తల్లి మాటలు అర్థంకాకపోయినా తలాడించాడు.

సంబరంతో గంతులేశాడు.

ఆ చిన్నారి మేనల్లుణ్ణి చూసి సంతోషం ఆపుకోలేక మనోహర్ ఆ పసివాణ్ణి రెండు చేతులతో ఎత్తి గిరగిరా తిప్పాడు.

"అదేమిటమ్మా! తమ్ముడికి ఇంజనీరింగులో సీటు వస్తే స్వీట్స్ అయినా తెప్పించవేమ్మా!"

"అపర్ణా! నీకు తెలీంది ఏముందమ్మా... బజారులో స్వీట్సు ధరలు ఆకాశంలో ఉన్నాయి. మనమేం కొనగలం? ఇంట్లోనే ఏదో స్వీటు తయారుచేస్తాలే!"

'అసలే నెలాఖరు!' అన్నమాట ఆవిడ పైకి అనలేకపోయింది.

అయిదు నిమిషాలలోగా సేమ్యా, పాయసం తయారుచేసి అందరికీ పట్టుకొచ్చి ఇచ్చింది.

"ఎంతో రుచిగా ఉందమ్మా!" అంటూ అందరూ తిన్నారు.

పక్కింటాయన పిలవడంతో బయటకు వచ్చాడు మనోహర్.

"ఎమ్‌సెట్‌లో ర్యాంకు వచ్చిందటగా... సంతోషమయ్యా!"

"అవునండీ!" అన్నాడు మనోహర్ వినయంగా!

"మీ అత్తయ్య స్వీట్సు ఇచ్చిందయ్యా!" అంటూ స్వీట్సు పేకెట్టు మనోహర్ చేతిలో పెట్టాడు.

"అత్తయ్యా..!" మనోహర్ ఆశ్చర్యాన్ని మనసులోనే దాచుకున్నాడు.

స్వీట్సు వద్దన్నా ఆయన వదిలి పెట్టలేదు. ఇంక తప్పదని పుచ్చుకున్నాడు.

ఎదురుగా తలుపు చాటునుండి ఆయన కూతురు చిరునవ్వు నవ్వుతూ చూస్తోంది. మనోహర్‌కి ఆమెను చూడగానే ఒళ్ళు మండింది.

ఆయనకు 'థాంక్స్' కూడా చెప్పకుండా విసవిసా నడుచుకుంటూ మనోహర్ లోపలకి వచ్చేశాడు.

చేతిలో ఉన్న స్వీట్సు పాకెట్టు అక్క చేతిలో పెట్టాడు.

"ఆయన స్వీటు ఇస్తే ముఖంలో ఆ విసుగేమిట్రా!" ఆశ్చర్యంగా అడిగింది అక్క

ఆవిడ తిరిగి లోపలకి వెళ్లిపోయింది. ఆయనకు ఆఫీసులో కొలీగ్స్ మాటలే గుర్తుకు వస్తున్నాయి.

"మీ అబ్బాయికి మూడువేల ర్యాంకు వచ్చిందటగా! గవర్నమెంటు కాలేజీల్లో సీటు రాదు. ఎక్కడో ప్రైవేటు కాలేజీలో చదివించాలి. సంవత్సరానికి ఓ అరలక్ష ఫీజు అనుకో! దానికి సాయం మెస్‌లు, రూము రెంటులు, పోకెట్టు మనీలు... మరెన్నో! ఈరోజుల్లో ఇంజనీరు చదువులంటే మాటలా..?! ఇంక, పిల్లాడు కాస్త జులాయి అనుకో! ఇంక, మనీ సంగతి చెప్పనక్కరలేదనుకో!"

"మూడువేల ర్యాంక్ రావడం సంబరం కాదు! మీ మొహం... మీరేం చదివించగలరయ్యా!" అనే అర్థం జానకీ రాంగారికి వారి మాటల్లో ధ్వనించింది.

అంతకంటె ఏం చెయ్యలేక ఓ వెర్రినవ్వు ముఖానికి పులుముకుని జానకీ రాంగారు ఇంటికి తిరిగివచ్చారు. ఆలోచించినకొద్దీ వారి మాటల్లో యదార్థముందనిపించింది.

"ఎక్కడనుంచి అంత డబ్బు నాలుగేళ్ళు తేగలడు? తలకు మించిన భారం!" ఆలోచించినకొద్దీ అతనికి భవిష్యత్తు ఆమడంత దూరంలో ఉన్నట్లు అనిపించింది.

"అదేమిట్రా... అంత డల్‌గా ఉన్నావు?" కాలేజీ నుంచి వచ్చిన రెండవ అక్క సువర్ణ తమ్ముణ్ణి పలకరించింది.

"లేదక్కా... నేను ఎమ్‌సెట్ మళ్లీ రాద్దామనుకుంటున్నా!"

"మళ్లీనా? ఆ నిర్ణయమెందుకురా?"

"నాకు ప్రైవేటు కాలేజీలో కాని సీటు రాదు... సంవత్సరానికి ఎంత లేదన్నా అరవై, లేక డెబ్భై వేలు ఖర్చవుతుందిట! అంత డబ్బు నాన్నగారు ఎలా తేగలరు? కొద్దో గొప్పో నా చదువుకోసం దాచినదంతా ఇంటర్ చదువుకి, కోచింగ్ ఫీజులకీ సరిపడింది. మనకు తెలియంది కాదుగా!"

"మళ్లీ చదవలేవు సరే... మళ్లీ ఇలాగే ర్యాంకు వస్తే ఏం చేస్తావు? అంతకంటె ఈ అవకాశం వినియోగించుకోడం మంచిదిరా?"

"అది కాదక్కా! నాన్నగారికి భారం అవడం నాకిష్టం లేదక్కా! పైగా... ఇదే ఏ అమెరికా వంటి దేశాలైతే పగలు చదువుకుని సాయంకాలం, హోలిడేస్‌లోను ఏ హోటళ్ళలోనో, ఏ పెట్రోలు బంకుల్లోనో, ఏ బార్ షాపుల్లోనో ఉద్యోగాలు చేసుకుంటారు? ఇక్కడ ఆ అవకాశాల్లేవు. పోకెట్టు మనీ కూడా తల్లితండ్రుల దగ్గరే పుచ్చుకోవాలి? నాకు బాధగా ఉందక్కా! ఎక్కడైనా ఉద్యోగం చేసుకుంటు తిరిగి ఎమ్‌సెట్ రాస్తే మంచి దనుకుంటున్నా!"

– ఇంక చెప్పడం పూర్తయినట్లు ఆయన పేపర్లో తలదూర్చారు. మనోహర్‌కి ఉత్సాహం మళ్లీ పొంగి వచ్చింది. తల్లితో ఆ మాట చెప్పడానికి వంటింటి వైపు సుడిగాలిలా వెళ్లాడు. తండ్రి మాటలన్నీ గుక్క తిప్పుకోకుండా తల్లితో చెప్పాడు.

"నువ్వు బాగా చదువుకోరా! మాకంతే కావాలి!" అంది.

మనోహర్‌ని కౌన్సిలింగ్‌కు పిలిచారు. జానకీ రాంగారు కొడుకును వెంటపెట్టుకుని వెళ్లారు. విజయవాడలో ఓ ప్రైవేటు కాలేజీలో సీటు వచ్చింది. మొదటినుంచి మనోహర్‌కి మెకానికల్ ఇంజనీరింగ్ చదవాలని కోరిక!

జానకీ రాంగారికి కూడా అదే ఇష్టం! అందులోనే సీటు వచ్చింది. సంతోషంగా ఇంటికి తిరిగివచ్చారు. అప్పటికే జానకీ రాంగారి తల్లిదండ్రులు వచ్చి ఉన్నారు.

మనోహర్ సంతోషంగా తాతా, నానమ్మలకు నమస్కరించాడు.

మనవడికి ఇంజనీరింగులో సీటు వచ్చినందుకు వారు ఆశీర్వదించారు.

సీతాలక్ష్మిగారు ఎంత జాగ్రత్తగా ఖర్చు పెట్టినా నెల గడవడం కష్టమయింది. చిల్లరంతా వెతికితే ఓ ఏభై రూపాయలు అయింది. 3 కిలోల బియ్యం, పెరుగు, కూరగాయలు తెప్పించింది. అన్నం చమిడి మెత్తబడిపోయింది. అన్నం వడ్డించడానికి సిగ్గుపడింది. వంటింట్లోకి వచ్చిన భర్తతో అదే మాట చెప్పింది.

"నువ్వేం చేస్తావు? బియ్యం షాపుల్లో కొంటేనే మంచి బియ్యం దొరుకుతాయి. ఈ చిల్లర షాపుల్లో అదే ధర పుచ్చుకుంటారు కాని, మోసం చేసి నాసిరకం ఇస్తారు. ఈ పూటకి కానీ! సాయంకాలం మంచివి తెప్పిస్తాలే... వడ్డించు!" అన్నారు జానకీ రాం.

పళ్ళెంలో చల్లారపెట్టిన అన్నం కాస్త బాగానే ఉందనిపించింది. వెంటనే లేని ఉత్సాహం తెచ్చుకుని ఆ ఇల్లాలు భోజనాలు వడ్డించింది.

అంతలో... అపర్ణ భర్త వెంకటేశ్వరరావు తలుపులు తోసుకుంటూ లోపలకి వచ్చాడు. కాళ్ళూ, చేతులు కడుక్కుని భోజనానికి రమ్మని అందరూ పిలిచారు.

"లేదండీ... ఆఫీసు పని మీద వచ్చాను. అందరితోపాటు హోటల్లో భోజనం చేసేశానండీ!" అన్నాడు వినయంగా.

భార్య రాసిన ఉత్తరం చూసిన తరువాత అతను కూడా పొరపాటు చేశానని చాలా బాధపడ్డాడు. ఆ పొరపాటు సరిదిద్దుకుని అత్తవారికి ఏదోవిధంగా చేయూత నీయాలనుకున్నాడు.

గదిలో కూర్చున్న భర్తతో అన్ని విషయాలూ చర్చించాడు.

అందరూ భోజనాలు చేసి హాల్లో కూర్చున్నారు.

"దేశంలో అందరూ అలాగే ఏర్పాట్లు చేసుకుంటున్నప్పుడు- మనం దాన్ని గురించి భయపడవలసిందేమీ లేదు. లోను సంగతి నేను ఏర్పాటుచేస్తాను. మిగతా సంగతులు మీరు చూసుకోండి!" వెంకటేశ్వరరావు చెప్పవలసింది చెప్పాడు.

"సరే... అలాగే కానీవయ్యా!" అన్నారు పురుషోత్తమరావుగారు.

"నేను ఈ సాయంకాలం రైలుకే బయలుదేరుతున్నానండీ! మా అమ్మగారు మనవడికోసం బెంగపెట్టుకున్నారు. అపర్ణని, పిల్లాడిని తీసుకువెళుతున్నాను. పురిటికి అత్తయ్యగారిని అక్కడికే పంపించండి!" అన్నాడు వెంకటేశ్వరరావు.

"అదేమిటయ్యా! నెలలు నిండిన పిల్లని తీసుకువెళ్లడమేమి"టని ఎవరు చెప్పినా అతను వినిపించుకోలేదు.

మనోహర్‌కి ఓ సూట్‌కేస్, ఓ హ్యాండ్‌బ్యాగ్ కొనిచ్చాడు. అపర్ణ మూడువేలు తమ్ముడి చేతుల్లో పెట్టి బట్టలు కుట్టించుకోమంది. పట్టుచీర కొనుక్కోవాలని దాచుకున్న డబ్బది! ఇప్పుడు తనకు పట్టుచీర కంటె తమ్ముడు చదువే ముఖ్యమనుకుంది. అత్తగార్ని మరోసారి పురిటికి రమ్మని చెప్పి అతను అపర్ణను, కొడుకును తీసుకుని బయలుదేరాడు.

"ఫీజుకి బ్యాంకు లోను ఇస్తుంది. మిగతా ఖర్చు ఎంతవుతుందో ఆఫీసులో అప్పు తీసుకుంటాను నాన్నా!" అన్నారు జానకీ రాం తండ్రితో.

"సరే... దాని సంగతి ఆలోచిద్దాం!" అన్నారు పురుషోత్తమరావుగారు.

అంతలో... ఒకరోజు చిన్నకొడుకు తల్లితండ్రుల్ని తీసుకువెళతానని బయలుదేరి వచ్చాడు. ఆ కొడుకు ఎందుకు వచ్చాడో ఆ వృద్ధ దంపతులకి బాగా తెలుసు. అవేమీ తెలియని జానకీ రాంగారు.

" కొన్నాళ్లు ఉండనీరా! తర్వాత తీసుకువెళుదువు గాని..." అన్నారు.

'ఇంటి చాకిరీకి కాని, తల్లి మీద ప్రేమ కాదు. తన పెన్షన్ మీద ప్రేమ కాని, తన మీద కాదు!' మనస్సులోనే అనుకున్నారు పురుషోత్తమరావుగారు.

"నేను ఇక్కడే కొన్నాళ్లు ఉండాలనుకుంటున్నానురా! ఒకవేళ బతికి ఉంటే మనోహర్ చదువు పూర్తయ్యేవరకు నాలుగేళ్లు ఇక్కడే ఉంటారా!" ఖచ్చితంగా చెప్పారు. చిన్నకొడుక్కి కోపం వస్తుందని తెలుసు. అయినా తన నిర్ణయం చెప్పేశాడు.

"ఇది చిన్న ఇల్లు... పైగా అద్దెకొంప! ఇక్కడ సౌకర్యం ఉండదు నాన్నా! అక్కడ మీకు అన్ని సౌకర్యాలు ఉన్నాయి" అన్నాడు మరోసారి!

"ఒకప్పుడు ఇక్కడ సౌకర్యాలు లేవని వెళ్లిన మాట నిజమేరా! కాని, ఇప్పుడు ఆలోచిస్తే నా సౌకర్యంకంటే నా మనవడి చదువు ముఖ్యంరా!"

# అంతమ్మ శపథం



"అంతమ్మా! నే చెప్పేది వింటున్నావా! సంవత్సరానికి 12 వందలిస్తా! ఒక జత కొత్త బట్టలు కుట్టిస్తా! ఇక మధ్యమధ్యలో అంటూ నా పాత బట్టలు నీ కూతురికే కాదు, నీకూ ఇస్తుంటా... నీ కూతుర్ని నాతో పంపించు!"

కాంతామణి చీర సవరించుకుంటూ అంతమ్మకు ఆశ చూపించటానికి ప్రయత్నించింది.

కానీ...

"నే ఆడుకుంటా! నే రానే!" అంటూ 'నీలి' తోటి పిల్లలతో ఆడుకుంటోంది.

ఎంత బతిమాలినా నీలి ఆట మాని రావడానికి ఇష్టపడలేదు. కోపం పట్టలేని అంతమ్మ కూతురు నడ్డివంచి శక్తి కొద్దీ కొడుతూ లాక్కొచ్చింది. ఎప్పుడో తిన్న ఆకలి బాధ ఒక పక్క, మరోపక్క తల్లి కొట్టే దెబ్బల బాధ ఓర్చుకోలేని నీలి గొంతు కీచుపడింది.

"మన బతుకులకి ఆటలేంటే? పొట్ట నిండడమే కష్టం! ఇదిగో... ఆరితో యెల్లు. నీకు కడుపు నిండా తిండేనా దొరుకుతుంది. ఆరింటి సెప్పిన పని ఖచ్చిడిగా సెయ్యాలా!" అంతమ్మ మాటలు నీలికి వినపడ్డాయో, లేదో తెలీదు. ఏ సమాధానమూ చెప్పలేదు. ఏడుపు మానినా వెక్కుతూనే ఉంది.

అంతమ్మ బక్క కోపం పొంగులా చల్లారిపోయింది.

కొట్టిన చేతులు బాధగా చూసుకుంది. పొద్దుట మొదలు తనతో అందరిళ్లల్లో పనులు చేస్తూనే ఉంది. ఇప్పుడే కాస్త తీరిక దొరికి తోటిపిల్లలతో ఆడుకోడానికి పోయింది. 'అనవసరంగా కొట్టా!' మనసు బాధపడుతున్నా కాంతామణి ఎదురుగా ఏమనడానికీ నోరు పెగల్లేదు.

కూతురు ముఖం కడిగి ఓ పాత బట్టతో తుడిచింది. గిన్నెలో అడుగున మిగిలిన అన్నం రెండు ముద్దలు తినిపించింది.

"నే ఆరితో ఎల్లు! నీ కాడే ఉంటా!" నీలి తిరిగి పేచీ ప్రారంభించింది. కాంతామణి ఆమె పేచీ లెక్కచేయకుండా వెళ్లి కార్లో కూర్చుంది.

అంతమ్మ– కసాయివాడు గొఱ్ఱెను లాక్కెళ్లినట్లుగా నీలిని లాక్కెళ్లి కారు వెనకసీట్లో కూర్చోపెట్టింది.

"ఓ అమ్మో! నే ఎల్లనే..!" నీలి ఏడుపు వినబడుతూనే ఉంది.

కారు అంతమ్మ దృష్టిని దాటి దూసుకుపోయింది.

కాంతామణి చెప్పిన మాటలన్నీ గాలిలో కలిసిపోయాయి.

నీలి వెలుగు రాకుండా లేచి పాచిపని మొదలుకొని, అంట్ల గిన్నెలు తోముడు, నాలుగు బకీట్లు బట్టలు ఉతకడం... అన్నీ ఆమె చేయవలసిన పనులే! మధ్యలో కాంతామణి చంటిపిల్ల ఏడుపు వినబడకుండా ఎత్తుకు తిప్పుతోంది. తిరిగి రాత్రి ఏ పదో దాటితే కాని, కన్ను మూయడానికి లేదు.

ఆరోజు నీలి ఆకలికి తట్టుకోలేక విలవిల్లాడింది.

"అమ్మా! అన్నం పెడతావా! ఆకలేత్తోందమ్మా!" వీధుల్లో ముష్టివాళ్ళు అడిగేటట్టు కాంతామణిని అడిగింది.

"అయ్యో... కాంతామణీ! ఆ బక్క ప్రాణం గుటుక్కు మంటుందేమోనే! ఆసుపత్రికి పంపించవే?" తొందరచేసింది కాంతమణి తల్లి.

కాంతామణికి కూడా భయంవేసింది. రాత్రి కాంతామణి మరిది గదిలో సందడి... ఆవిడ, కాంతామణి కూడా చూశారు. కాని, నోరు మెదపలేదు. ఆ తాగుమోతు వినడని తెలుసు. గట్టిగా అరిస్తే కొంప అల్లరిపాలవుతుంది. చూసీచూడనట్టే ఉండిపోయారు.

కాంతామణి వెంటనే కర్తవ్యం గుర్తించింది. నీలిని ఎలా వదిలించుకోవాలా... అని ఆలోచించింది. ఆమెను తీసుకెళ్లి ఓ ప్రైవేటు ఆసుపత్రిలో డబ్బు ఎర చూపించి చేర్పించింది. ఆసుపత్రి డాక్టరు మొదట భయపడ్డాడు కాని, ఆమె ఇచ్చిన డబ్బుకి నోరు మెదపలేదు. వచ్చిన పని పూర్తి కాగానే కాంతామణి చేతులు దులుపుకుని ఇంటికి వెళ్లిపోయింది.

ఆరాత్రి అంతమ్మ కంటికి నిద్రలేదు. నిద్రలో నీలి- "అమ్మా! అమ్మా..!" అని పదేపదే పిలిచినట్లయింది. ఆ మగత నిద్రలోనే ఆమెకు తెల్లవారింది. నీలిని పోయి చూడాలని ఆమె మనస్సు తొందరపడింది. రోజూలాగే రోడ్డువార బండి దగ్గరకు చాయ్ తాగటానికి పరుగెత్తింది.

"అంతమ్మా! నీ బిడ్డను ఎప్పుడు తోలుకొస్తవే?" అంటూ చాబండి ఎల్లయ్య అడగ్గానే అంతమ్మకు గుండె కదిలినట్లయింది.

"ఇప్పుడే పోతున్నానయ్యా!" అంటూ సమధానమిచ్చిన అంతమ్మ చాయ్ తాగుతుంటే కప్పులో నీలి రూపం కదలినట్లయింది. అంతమ్మ ఉలిక్కిపడింది. తడబడే అడుగులతో చాయ్ పైసలైనా ఇవ్వకుండా బస్సుస్టాండు వైపు కదిలి, బస్సు ఎక్కింది.

సైదాబాదులో బస్సు దిగిన అంతమ్మ- కాంతామణి ఇల్లు చేరి,"నీలి! నీలి!" అంటూ పిలిచింది. ఆ పిలుపు ఇల్లంతా మారుమ్రోగింది. కాని, నీలి జాడలేదు. పైగా... కాంతామణి చూడనట్టే పక్కకు ముఖం తిప్పుకు కూచుంది!

అంతమ్మ మనస్సు ఎందుకో... కీడును శంకించింది. గుండె దడదడలాడింది.

"నా బిడ్డేదమ్మా..?" అంటూ అంతమ్మ దీనంగా అడిగింది.

"జ్వరం వస్తే మంచి మందులిస్తారని ఇదిగో... దవాఖానాలో చేర్పించినా! ఈ డబ్బుంచుకో... అంతమ్మా! కంగారుపడకు!" అంటూ రెండు వందలు అంతమ్మ చేతిలో పెట్టింది. అంతమ్మ అదేమీ పట్టించుకునే స్థితిలో లేదు. దవాఖానా వివరాలు తెలుసుకుని వేగంగా పరుగెత్తింది.

అంతమ్మ దవాఖానాలోని అన్ని గదులూ వెతికింది. ఎక్కడా నీలి జాడలేదు.

# డా: వాసా ప్రభావతి

ఎమ్.ఏ., పి.హెచ్.డి

డా: వాసా ప్రభావతి తూర్పుగోదావరి జిల్లా ఆత్రేయ పురంలో భారత స్వాతంత్ర్యం కోసం పోరాటం సాగించిన దేశభక్తుల కుటుంబంలో జన్మించారు. ఇంటర్ వరకు ఆ పల్లెలోనే చదువుకుని, వివాహమైన తరువాత హైదరాబాదులో బి.ఎ., ఎమ్.ఏ.(తెలుగు) 'ఆంధ్ర సాహిత్యములో హరిశ్చంద్రోపాఖ్యానము' అనే అంశంపై పి.హెచ్.డి., లింగ్విస్టిక్స్‌లో పి.జి. డిప్లొమా ఉస్మానియా యూనివర్శిటీలో చేశారు.

సరోజినీనాయుడు వనితా మహావిద్యాలయంలో రీడర్‌గా, తెలుగు శాఖాధిపతిగా పనిచేసి ఇటీవలే పదవీ విరమణ చేసి ఉత్తమ ఉపాధ్యాయినిగా, మహావక్తగా పేరుగడించారు.

ఒక రచయిత్రిగా, కవయిత్రిగా సుమారు 50 పుస్తకాలు రచించి అనేక అవార్డులు, సన్మానాలు, సత్కారాలు అందుకున్నారు. అనేక కవి సమ్మేళనాలలో, జాతీయ, అంతర్జాతీయ సెమినార్లలో పాల్గొని పేరు గడించారు.

ఈమె రచనలు... కవిత, కథ, నవల, వ్యాసం, నాటకం మొదలైనవి దిన, వార, మాస, త్రైమాసిక పత్రికలలో ప్రచురించబడి, హిందీ, కన్నడ, తమిళ, ఇంగ్లీషు భాషలలోకి కూడా అనువదించబడ్డాయి. ఈమె రచనల్లో 2 కవితాసంపుటాలు, నవలలు, 3 మినీ నవలలు, 3 నాటకాలు ప్రసిద్ధిచెందాయి.

'వెండి వెలుగులు, ప్రేమ బంధం' మొదలైన నవలలు, 'బిచ్చగత్తె, నాన్న కావాలి, న్యాయం గుడ్డిది, వీధి దీపాలు' మొదలైన కథలకు బహుమతులు, 'రష్యాలో స్నేహయాత్ర, అమెరికాలో తెలుగు మహిళలు, స్వాతంత్ర్యోద్యమంలో తెలుగు మహిళలు' మొదలైన గ్రంథాలు, 'దేశ బాంధవి, స్వాంతంత్ర్యోద్యమంలో దువ్వూరి సుబ్బమ్మ చరిత్రపై నాటకం, బిచ్చకత్తె' మొదలైన నాటికలు మంచిపేరును సంపాదించిపెట్టాయి.

చిన్నతనం నుంచి కవిత్వం రాయడం అలవోకగా అలవాటు అయింది. స్కూలు మాగ్జైనులోనే కవితలు వచ్చాయి.

'అమ్మ, ఆలాపన, జగతి-ప్రగతి, మానవతా శిఖరం, మంజీర నాదాలు, మళ్ళీ మళ్ళీ పుడతా.., హృదయ నేత్రం (కవితా కావ్యం)' సాహితీవేత్తల, అభిమానుల మన్ననలు అందుకున్నాయి. వేదికలపై అనేక కవి సమ్మేళనాలలోనే కాకుండా- రేడియో, టీ.వీ. కవి సమ్మేళనాలలో పాల్గొన్నారు.

ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం వారిచే ఉగాది వేడుకలలో అప్పటి ముఖ్యమంత్రి ఎన్. టి. రామారావుగారి చేత, ఇప్పటి ముఖ్యమంత్రి చంద్రబాబునాయుడుగారి చేత అనేకమార్లు సత్కారాలు అందుకున్నారు. జాతీయ కవి సమ్మేళనంలో పాల్గొన్నారు కూడా.

అనేక కవితలకు, 'హృదయనేత్రం' కవితాసంపుటికి బహుమతులు అందుకున్నారు. 'దేశ బాంధవి' ఉత్తమ నాటకంగా అవార్డు పొందింది.

ఉస్మానియా యూనివర్శిటీ బోర్డాఫ్ స్టడీస్ మెంబరుగా, 12 సంవత్సరాలు సెన్సార్ బోర్డు మెంబరుగా పనిచేసి ఉత్తమ విమర్శకురాలిగా పేరు గడించారు.

మైసూరు యూనివర్శిటీలో 1990-1993 వరకు 'సంఘం చేసిన బిక్షుకి, న్యాయం గుడ్డిది' గ్రంథాలు బి.ఏ., బి.ఇడి.వారికి పాఠ్య గ్రంథాలుగా ఉన్నాయి.

'మద్రాసు గృహలక్ష్మి కంకణ అవార్డు, తెలుగు యూనివర్శిటీ ఉత్తమ రచయిత్రి ఎండోమెంటు అవార్డు, రచయిత్రి ఉత్తమ గ్రంథం సాహితీ అవార్డు, 2001 ప్రతిష్టాత్మకమైన సుశీలా నారాయణ రెడ్డి అవార్డు' లభించాయి.

ఇవేగాక, 'మద్రాసు యునైటెడ్ రైటర్స్ అసోసియేషన్ లైఫ్ ఎచీవ్‌మెంటు అవార్డు, మద్రాసు తెలుగు అకాడమీ పురస్కారం, ఢిల్లీ తెలుగు అకాడమీ పురస్కారం, బొంబాయి ఆంధ్ర మహాసభ సత్కారం, రాగ సప్తస్వరం బంగారు కంకణం, వంశీ ఆర్ట్ థియేటర్స్‌వారి బంగారు పతకం, పి.ఎస్.ఆర్. ఆంజనేయశాస్త్రి సాహితీ అవార్డు, జ్యోతి మహిళా మండలి పంచరత్న మహిళా అవార్డు, తారా కల్చరల్ అసోసియేషన్ మహిళా అవార్డు...' ఇంకా అనేక అవార్డులు, సన్మానాలు, సత్కారాలు లభించాయి.

అఖిల భారత భాషా సాహిత్య సమ్మేళన వారిచే 'సాహిత్య శ్రీ, భారత భూషణ్' బిరుదులు.., ఇవేగాక- 'సాహిత్య శిరోమణి, సాహితీ సరస్వతి, అక్షర కంఠీరవ' బిరుదులు లభించాయి.

